వెల: 6.00, ఏప్రిల్ 1992



# నలుపు

ప్రజల పక్ష పత్రిక

## ఎంగెల్స్-పునర్దర్శనం

## మహిళా పోరాటాలు-రాజ్యహింస



# స్త్రీలు-కులం, లైంగికత్వం

మహిళా ప్రత్యేక సంచిక


ఏదేం నాశనం కాలేదు అట్లగుపిస్తుంది.
అంతే...
ఇండియా
ఇది ఎంతముఖ్యమైనది! కదా! మీరు చదవలేదా?
ఇక్కడ బాంబు లేదు


నా మరు జన్మ ఆంధ్రప్రదేశ్‌లో నైతే వద్దు సామీ
అక్కడ పోలీసులు ఎన్‌కౌంటర్ పేరిట కాల్చేస్తారు!


ప్రజల తృప్తి కోసం అలా అన్నామంటే
మీరు ఎప్పటిలాగే అమ్ముకోండి !!
జనార్థన్
బియ్యం వ్యాపారి
మార్కెట్లో బియ్యం ధర


IMF ఆర్థికసహాయంతో
KARUNA

విడిప్రతి రు 6.00
సంవత్సర చందా రు. 65.00

సంపాదక వర్గం
బొజ్జా తారకం
కె. బాలగోపాల్
డి. నరసింహారెడ్డి
కె. ఐలయ్య
సిరిల్ రెడ్డి
పి. ఎల్. విశ్వేశ్వరరావు
ఆర్. అఖిలేశ్వరి

సంపాదకుడు
బొజ్జా తారకం

ఉప సంపాదకులు
వై. నాగేశ్వరరావు
ఎన్. మల్లారెడ్డి

రూప కల్పన
ఏ. షరీఫ్
ఆర్ట్ వర్క్
నారు

ప్రచురణ, ముద్రణ
హైదరాబాద్ బుక్ట్రస్ట్ తరఫున
సిరిల్‌రెడ్డి

అక్షరాలు
ఓం సాయి లేజర్ గ్రాఫిక్స్
నారాయణగూడా.

అచ్చు
హైదరాబాద్ ప్రింటర్స్
హైదరాబాదుకుగాను,
గాయత్రి ఎంటర్ ప్రైజెస్,
హైదరాబాద్.

సర్క్యులేషన్ మేనేజర్
బి. సుదర్శన రెడ్డి

సర్క్యులేషన్ రిప్రజెంటేటివ్
ఆది బాబు

'నలుపు' పక్ష పత్రిక
ఇం. నెం. 1-1-342/బి, వివేకనగర్,
హైదరాబాద్ - 500 020
ఫోన్ నెంబర్ - 611232

# నలుపు
## ప్రజల పక్ష పత్రిక

సంపుటి:3 సంచిక - 20-24 ఏప్రిల్ 1992

### లోపలి పేజీల్లో...

# స్త్రీలు - డా. బి. ఆర్. అంబేడ్కర్

డా. బి.ఆర్ అంబేద్కర్ శత జయంతి ఉత్సవాలు ముగుస్తున్న సందర్భంలో ఈ ప్రత్యేక సంచికను తీసుకు రావటం సముచితంగా ఉంటుందని భావిస్తున్నాము. స్త్రీల సమస్యలను పరిశోధించి, వాటికి పరిష్కార మార్గాలు కనుగొన్న బహుకొద్ది భారతీయ మేధావులలో డా. అంబేద్కర్ అగ్రగణ్యుడు. స్త్రీల పక్షాన నిలబడి వారికి జరుగుతున్న అన్యాయాన్ని ఎదిరించి పోరాటం సలిపిన వారిలో కూడా ఈయన ముందు భాగాన నిలుస్తాడు. భారతదేశంలోనే స్త్రీల విముక్తి కోసం ఆలోచన చేసి, వారి విముక్తి కోసం ఛాందస హిందూ సమాజంపై తిరుగులేని పోరాటం చేసిన మహాత్మా జ్యోతిరావ్ ఫులే స్ఫూర్తితో డా. అంబేద్కర్ స్త్రీల విముక్తికి పాక్షిక మార్గాలను ఎంచుకోక, సమగ్రమైన, సంపూర్ణమైన దారిని ఎన్నుకొని భారతీయ సమాజానికే ఒక సవాలుగా నిలిచిన ధీరుడు డాక్టర్ అంబేద్కర్. అందుకే ఆయన జన్మదిన సందర్భాన ఈ ప్రత్యేక సంచిక రావటం ఎంతో సముచితంగా ఉందని అనటం.

ఎందరో సంఘ సంస్కర్తలు ఈ దేశంలో వెలిశారు. వాగంతా వారి వారి సంఘాలలోని దురాచారాలను రూపుమాపటానికి ప్రయత్నించారు గాని మొత్తం భారతీయ సమాజాన్ని పట్టి పీడిస్తున్న రుగ్మతలను కనిపెట్టి వాటి నివారణకు ఉపాయాలను చూపిన వారు చాల తక్కువ మంది ఉంటారు. అందులో ఎన్నదగిన వ్యక్తి డాక్టర్ అంబేద్కర్.

సంఘ సంస్కరణలు అంటే మనకు గుర్తుకు వచ్చేది రాజారామ్మోహన్‌రాయ్. ఆంధ్రదేశానికి వస్తే కందుకూరి వీరేశలింగం పంతులు. ఇద్దరు కూడా వారి వారి 'సమాజాల'కు సంబందించిన సమస్యలనే చేపట్టారు గాని మొత్తం జాతి జీవనానికి సంబంధించిన మూల సమస్యలను పరిష్కరించటానికి ప్రయత్నం చెయ్యలేదు. రాజారామ్మోహన్‌రాయ్ చేపట్టిన 'సతీ సహగమనాని'కి వ్యతిరేక ఉద్యమం స్త్రీలలో ఎంత శాతానికి సంబంధించినది? పోనీ తక్కువ శాతానికి సంబంధించినదే అయినా మొత్తం స్త్రీ జాతిని ప్రభావితం చేసే సమస్యగా దానికి మనం తీసుకోవచ్చునా? కొన్ని బ్రాహ్మణ లేదా రాజపుత్రుల కుటుంబాలకు సంబంధించిన సమస్య అది. భర్త చితిలో సజీవంగా స్త్రీని తగల బెట్టటం అనేది అగ్రకులాలలో అగ్రకులానికి సంబంధించినది. అది కూడా కేవలం కొన్ని ప్రాంతాలకే! ఈ జాడ్యం మొతం దేశంలో వ్యాపించి ఉండలేదు.

అయితే రాజారామ్మోహన్ రాయ్ సతీ సహగమనానికి వ్యతిరేకంగా పోరాటం చేస్తున్న సమయంలోనే మహాత్మా జ్యోతిరావ్ ఫులే స్త్రీలపై జరుగుతున్న అనాచారాలకు, అత్యాచారాలకు, మత మౌఢ్యాలకు వ్యతిరేకంగా పోరాటం చేశాడు. ముఖ్యంగా స్త్రీ విద్య కోసం బ్రహ్మాండమైన కృషి చేశాడు.

అదే విధంగా ఆంధ్రదేశం వచ్చేసరికి కందుకూరి వీరేశలింగం పంతులు విధవా వివాహాలు చేయించాడు. ఈ సమస్య కూడా కేవలం బ్రాహ్మణ కులానికి సంబంధించినదే! మొత్తం స్త్రీ జాతిని ప్రభావితం చేసిన ఉద్యమం కాదది. 'విధవ' అనే వ్యవస్థ లేని సమాజంలో విధవా వివాహాలకు అర్థం ఉండదు. అందుకనే వారు, వారి వారి సమాజాలకు సంబంధించిన సమస్యలను చేపట్టారని చెప్పటం. అసలు భారత సమాజమే అనేక సంఘాల కలగూర గంప.

అందుకే డాక్టర్ అంబేద్కర్‌ని తీసుకొనేసరికి మొత్తం భారత సమాజం ఎదురుగా నిలబడుతుంది. ఒకప్పుడు భారతీయ సమాజంలో స్త్రీలకు ఎంతో ఉన్నతమైన స్థానముండేదని, స్త్రీ పురుషులకు సమాన గౌరవాలు, స్థానాలు ఉండేవని అది బౌద్ధమతం పరిఢవిల్లుతున్న నాటికి అత్యుత్తమ స్థానంలో ఉండేదని సమాజంపై హైందవ సంప్రదాయాలు నీతి నియమాలు పట్టు సంపాదించిన నాటి నుంచి స్త్రీ స్థితి పతనానికి దారి తీసిందని, బ్రాహ్మణవాదం స్త్రీని ఒక విలాస,

భోగవస్తువుగా, ఒక మార్పిడి వస్తువుగా తయారు చేసిందని గ్రహించిన మొదటి వ్యక్తి డాక్టర్ అంబేడ్కర్. ఆమెకు ఆస్తి లేకుండా, ఆస్తిలో సాక్ష్యం లేకుండా, విద్య లేకుండా, మానవ విలువలు లేకుండా ఒక ప్రమాదకరమైన వ్యక్తిగా నగరిక వ్యవహారాలతో సంబంధం లేని ఒక వెలి, బలి పశువుగా స్థిరీకరించింది బ్రాహ్మణ వాదం. ఈ వాదానికి వ్యతిరేకంగా పోరాటం చెయ్యకుండా స్త్రీ విముక్తి - కనీసం భారత దేశంలో సాధ్యం కాదని ప్రగాఢంగా విశ్వసించింది డాక్టర్ అంబేడ్కర్. అందుకే ఆయన బ్రాహ్మణ వాదానికి, హైందవ మతానికి వ్యతిరేకంగా పోరాటం చెయ్యటానికి సిద్ధపడ్డాడు.

ప్రతి పోరాటానికి ఒక పోరాట సిద్ధాంతం ఉంటుంది. విప్లవం సాధించాలంటే విప్లవ సిద్ధాంతం ఉండాలని చెప్పినట్లుగా పోరాటం విజయవంతం కావాలంటే ఒక పోరాట సిద్ధాంతం అవసరం. ఒక పోరాట పంథా అవసరం. ఈ అవసరాన్ని గుర్తించిన డాక్టర్ అంబేడ్కర్ ఒక పోరాట సిద్ధాంతాన్ని రూపొందించుకున్నాడు. దానికి అనుగుణంగా, ఆ సిద్ధాంతాన్ని ఆచరణలో పెట్టడానికి ఆచరణతో ముడిపెట్టటానికి ఒక పంథాను ఎంచుకున్నాడు. స్త్రీ ఒక వ్యక్తిగా వికాసం చెందటానికి, ఒక పరిపూర్ణ మూర్తిగా వర్ధిల్లటానికి ఏవి కారణాలు ప్రోత్సాహకాలవుతాయో, ప్రేరణలవుతాయో, పోషకాలవుతాయో శోధించాడు. ఏ ఏ కారణాలు ఆమె అభ్యున్నతికి, అభివృద్ధికి, వికాసానికి అడ్డుగా నిలుస్తాయో పరిశోధించాడు. ఈ అడ్డులను తొలగించటానికి తగిన ఒక గొడ్డలిని తయారు చేసుకొని నరుక్కుంటూ పోయాడు. తన, ఆనాటి ప్రయత్నంలో ఏ ఒక్క సంఘ సంస్కర్త ఆయనకు తోడుగా నిలబడక పోవటం చాల విచిత్రం. హైందవ సమాజం, బ్రాహ్మణ వాదం ఎంత వేరూనుకు పోయిందో దీనిని బట్టి మనకు తెలుస్తున్నది. ఒక కరగాల్పుడు ఈ మౌఢ్యాన్ని హతమారుస్తూ వచ్చాడంటే అతని కృషి ఎంత శ్లాఘనీయమో!

సామాజికంగా స్త్రీ వికాసానికి అడ్డుగా నిలుస్తున్న కారణాలలో ముఖ్యమైనవి కుటుంబానికి సంబంధించినవి. మరీ ముఖ్యంగా వివాహానికి సంబంధించినవి. భారత దేశం స్వతంత్రం పొందటానికి సన్నద్ధపడింది కాని తన మనుషులను స్వతంత్రులను చేయటానికి ఆలోచించలేదు, ఆ ప్రయత్నమూ చెయ్యలేదు. రాజకీయ స్వాతంత్ర్యం గురించే ఆలోచించుకున్నారు గాని సాంఘిక ఆర్థిక స్వాతంత్రం గురించి ఆలోచించలేదు. ఆ విధంగా ఎవరైనా ఆలోచిస్తున్నా వారిని వెనక్కి నెట్టి వేయటానికి, నిరుత్సాహ పరచటానికి నీరస పెట్టటానికి కీ ప్రయత్నాలు చేశారు. అలా నిరసనకు గురైన వారిలో డాక్టర్ అంబేడ్కర్ ఒకరు. కుటుంబ వ్యవహారాలకు సంబంధించి మనుధర్మ శాస్త్రం సమాజాన్ని ఏలుతున్నది. వివాహానికి సంబంధించి ఎన్నో షరతులు కట్టుబాట్లు, కట్టు దిట్టాలు తయారు చేసి శతాబ్దాలు నుండీ బలుసుకు పోయి బింకంగా ఉన్న విధానాలని డాక్టర్ అంబేడ్కర్ వాటిని దెబ్బ కొట్టటానికి సమాజంలో వాటి ప్రభావం ఏమీ లేకుండా చేయటానికి మనువును మొదట సంస్కరించాడు. అవకాశం దొరకగానే మొదట ఆయన చేసింది హిందూ కోడ్ బిల్లును ప్రవేశపెట్టటం స్త్రీలకు సంబంధించి వివాహం, విడాకులు, ఆస్తి, ఆస్తి సంక్రమణకు సంబంధించిన వ్యవహారాలను క్రోడీకరించి ఎన్నో మార్పులు చేశాడు. వివాహంలో స్త్రీకి స్వేచ్ఛను ప్రసాదించాలన్నాడు. అలాగే విడాకుల విషయంలోను ఆస్తికి హక్కులేని స్త్రీకి ఆస్తిహక్కు కల్పించటమే కాకుండా, ఆస్తి సంక్రమణ విషయంలో కూడా విప్లవాత్మకమైన మార్పులు తెచ్చాడు. ఆస్తి హక్కును స్త్రీకి కలుగ చేయటం ద్వారా ఆమె జీవితంలో గొప్ప మార్పుకు దోహదం చేశాడు. నిరాధారమైన వ్యక్తిగా నిలిచిపోకుండా ఆమెను ఒక మనిషిగా తీర్చిదిద్దటానికి స్త్రీ విద్యను ప్రోత్సహించాడు. వివాహ విషయంలో కూడా విప్లవాత్మకమైన మార్పులు తేవటంతో ఒక వ్యక్తిగా స్త్రీ వికాసానికి దోహదం చేశాడు.

తన చుట్టూ ఉన్న అంటరాని కులాలకు చెందిన స్త్రీలకు సాంస్కృతికపరమైన విషయాలు ఎన్నో బోధిస్తూ వారిలో సాంఘిక చైతన్యాన్ని తీసుకు రావటానికి ప్రయత్నించేవాడు. మొత్తం స్త్రీ జీవితానికి సంబంధించిన ఒక సమగ్ర వికాసానికి సోపానాలు వేసిన వ్యక్తి డాక్టర్ అంబేడ్కర్. స్త్రీ విముక్తి కోసం వేసుకుంటున్న ఆలోచనలు అంబేడ్కర్ ఆలోచనలతో ముడిపెట్టుకోవడం ఈనాడు ఎంతో అవసరం.

# స్త్రీలు - సామాజిక హింస

ఎన్నో ఏళ్ళుగా అంతర్జాతీయ మహిళా దినోత్సవాలు జరుపుకొంటున్నా స్త్రీలు సంఘాలుగా ఏర్పడి పోరాట పటిమని సంతరించుకొంటున్నా స్త్రీలపై మానసిక, శారీరక హింస కొనసాగుతూనే వుంది. అనాదిగా స్త్రీ దోపిడీకి గురవుతూనే వుంది. మాతృస్వామ్యంలో తానే సర్వాధికారిణి అయి, ఈనాడు ఒక బానిసకొక బానిసగా మిగిలిపోయింది. మాతృస్వామ్యం నుండి పితృస్వామ్యంలోకి సమాజం మారిన క్రమంలో స్త్రీ మరెప్పుడూ అధికారం చేజిక్కించుకోకుండా అణిచి ఉంచడమే కాదు. ఎప్పటికీ ఆమె తానున్న హీనస్థానమే తనది అని మనసా వాచా నమ్మి ఎప్పటికీ ఎదిరించకుండా వుండేలా చాలా పకడ్బందీగా స్త్రీల మీద అణిచివేత కార్యక్రమం కొనసాగించడానికి పురుషస్వామ్యం కనిపెట్టిన శక్తివంతమైన ఆయుధాలు మతం, రాజ్యాంగం, నవమాజం, కుటుంబం, ఇవన్నీ ఆమె నెత్తినెక్కి తొక్కుతూ ఆమె అనుక్షణం హింసిస్తూనే వున్నాయి.

ఈ అణిచివేత కార్యక్రమంలో మతం వహించిన వహిస్తున్న పాత్ర చాల ముఖ్యమైంది. మతం పేరిట నిర్దాక్షిణ్యమైన కట్టుబాట్లు పెట్టారు.

"ఎలాంటి ఉన్నత గుణాలు, మంచి లక్షణాలు లేకపోయినా ఇతరుల ఆనందాన్ని వెతుక్కునే వాడయినా, భర్తను విధేయురాలైన భార్య నిరంతరం దేవుడిలాగా పూజించాలి" అని మనువు తాను వ్రాసిన హిందూ (అ)ధర్మ శాస్త్రంలో పేర్కొన్నాడు. ఎంతోమంది హిందువులచే పూజింపబడిన రామకృష్ణ పరమహంస కూడా "స్త్రీ - సంపద కలిసి ప్రపంచాన్నే పాపపంకిలం చేసాయి" అని అన్నాడు. అప్పటి ఆ భావజాల ఇప్పటికీ ... ప్రతిబింబిస్తూనే ఉన్నది. వాటిని బలపరుస్తూ ఆ భావజాలాన్ని బలంగా ముద్రించేందుకు రామాయణం వంటి పురాణాలు రాయబడ్డాయి. "తప్పెట, వెర్రిబాగులవాడు, శూద్రులు, జంతువులు, స్త్రీ ఇవన్నీ కొట్టదగినవి" అని తులసీదాసు రామాయణంలో వ్రాసాడు. ఆ భావజాలాన్ని నిత్యం ప్రచారంలో వుంచేందుకు పాలక వర్గాలకి ఇప్పుడున్న అద్భుతమైన అవకాశం టీవీలు. రామాయణాన్నే ప్రసారం చేసి ఏమైనా ప్రగతిశీల భావాలు ఏర్పడితే తుడిచి పెట్టుకుపోయేంత బలంగా చిత్రీకరించి ప్రజల మీదికి వదులుతున్నాయి.

మతం విషయంలో హిందువులే కాదు. క్రైస్తవ ముస్లిం మతాలు కూడా తక్కువేం కాదు. "భార్యలు దైవానికి విధేయులుగా ఉన్నట్లే భర్తలకు కూడా విధేయులుగా మసలుకోండి. చర్చికి క్రీస్తు ఎంతో భార్యకు భర్త కూడా అంతే. అతడే ఆమె శరీర పరిరక్షకుడు. కాబట్టి క్రీస్తుకు చర్చి ఎలా లోబడి ఉంటుందో భార్యలు భర్తలకు అదే విధంగా ప్రతి విషయంలోనూ లోబడి జీవించాలి" అని క్రైస్తవ మత గ్రంధం బైబిల్ చెబుతుంది.

"స్త్రీకంటే పురుషుడ్ని ఉన్నతుడిగా చేసినందువల్ల స్త్రీ పోషణకు పురుషుడు తన . సంపదను ఖర్చు పెడుతున్నందువల్ల స్త్రీలపై పురుషులకు అధికారం వుంది. ఉత్తమ స్త్రీలు ఎప్పుడూ విధేయంగా వుంటారు. మాట వినరని భావించినపుడు కోప్పడి కొట్టాలి. పడక వేరే చోటుకి మార్పించాలి" అని ఖురాన్ చెప్తుంది. చిన్నతనం నుండి పెంపకంలో కూడా అమ్మాయిని, అబ్బాయిని వేరు వేరుగా పెంచడంతో ఈ అసమానత్వం మొదలవుతుంది. అది అడుగడుగునా స్త్రీని అన్యాయాల పాలుచేస్తూ తోటి... సర్వశక్తులు దానమిస్తుంది. స్త్రీ శక్తి స్వరూపిణి అనీ, ఆదిశక్తి అని అపరావతారం అనీ పొగిడి పొగిడి మత్తు మందు జల్లి ఆ మత్తులో స్త్రీలను ముంచి తమ పురుషాధిక్యతని యధావిధిగా సాగించుకొంటున్నారు. ఇంట్లో ఆడుకొనే వస్తువులు కొనడం దగ్గర్నుండీ మొదలుపెడితే చదివించే విషయంలోనూ వివక్షతే అడుగడుగునా నువ్వు స్త్రీవి స్త్రీవి అని గుర్తు చేస్తూ స్త్రీగా పుట్టడమే మహాపాపం అనే దశకు తెచ్చారు. అంతేకాదు. ఈనాడు వరకట్న హత్యలకు అత్తింటి ఆరళ్ళకు ప్రధాన కారణం స్త్రీతే అనీ, ఆడదానికి ఆడదే శత్రువు అనే స్త్రీతే నమ్మే స్థితిని తెచ్చారు. ఆ భావజాలాన్నే స్త్రీల మీద రుద్దుతున్నారు. ఇది మధ్య తరగతి మహిళకున్న ప్రధాన సమస్య అయితే క్రింది తరగతుల్లోని మహిళలపై జరిగే హింస మరింత ఎక్కువగా ఉంటుంది.

ముఖ్యంగా కార్మిక రంగంలో అసంఘటిత కార్మికులుగా పనిచేసే స్త్రీలలో ఈ హింస యజమాని నుండి భర్త నుండీ శారీరకంగానూ మానసికంగానూ రెండు రకాలుగానూ చాల అధిక మొత్తంలోనే వుంటుంది. కనీస సౌకర్యాలు లేకుండా స్త్రీలకు వుండే కొన్ని ప్రత్యేక ఇబ్బందుల్ని, సమస్యలను ఆధారంగా చేసుకొని యజమానులు వారిని ఎంతగానో హింసిస్తుంటారు. ఇది నిన్నగాక మొన్న అరిస్టోలాబ్ కార్మికుల విషయంలో యాజమాన్యం ఎంత నీచంగా, ఘోరంగా ప్రవర్తించిందో దినపత్రికలలో సైతం వచ్చింది.

అయితే రాజ్యాధికారం తెల్లదొరల చేతులలో నుండి నల్లదొరల చేతులలోకి బదలాయించబడ్డాక మనకు స్వాతంత్ర్యం వచ్చింది. ఘనది ప్రజాస్వామ్య దేశం, చట్టం ముందు స్త్రీ పురుషులంతా సమానమే, ఏ మతం వారైనా కులం వారైనా సమానులేనంటూ రాజ్యాంగంలో రాసుకోవడంతో స్త్రీలలో కొత్త ఆశలు కలిగాయి. కాని అవన్నీ బూటకమేనని తెలియచెప్పే లాంటి మరో అంశం కూడా రాజ్యాంగంలో రాయబడింది. ఒక ప్రక్క స్త్రీ పురుషులు సమానులేనంటూ మరో ప్రక్క మత స్వేచ్ఛ వున్నది మతపరమైన విషయాలలో రాజ్యాంగం కల్పించుకుందే. వాక్యంతో మొత్తం స్వేచ్ఛని కుదించి వేసింది. స్త్రీలకు కల్పించబడ్డాయని చెప్తున్న అవకాశాలు. సమానత్వం అన్నీ మట్టికొట్టుకు పోయేలాంటి విషయాలు కూడా



సాంప్రదాయ చట్రంలో మహిళ

రాజ్యాంగంలో చేర్చబడ్డాయి. రాజ్యాంగంలోని విషయాలు ఇలా ఒకదానికొకటి పరస్పర విరుద్ధంగా వుండి స్త్రీలకు అన్యాయం చేస్తున్నాయి. ప్రాథమిక స్వేచ్ఛ విషయాలలో పరోక్షంగా ఆ స్వేచ్ఛని హరించే విధంగా వున్న రాజ్యాంగం కొన్ని విషయాలలో ప్రత్యక్షంగానే స్త్రీలపట్ల అన్యాయంగా ప్రవర్తించింది.

ముఖ్యంగా రేప్ కేసులలో ఈ విషయం బాగా కనిపిస్తుంది. ఒక స్త్రీ తన ఇష్టానికి వ్యతిరేకంగా, ఆమె సమ్మతి లేకుండా పురుషునితో లైంగిక కార్యకలాపాల్లో పాల్గొనవలసి వస్తే అది రేప్ కింద పరిగణిస్తారు. ఈ సందర్భంలో ఆ స్త్రీ తన ఇష్టానికి వ్యతిరేకంగానే ఇది జరిగిందని కోర్టుని నమ్మించగలగాలి కోర్టులు ఆమె గత చరిత్ర తవ్వి తీసి గత కాలంలో ఎప్పుడైనా ఆమెకి ఈ వ్యక్తితో గాని మరే వ్యక్తితోగాని సంబంధాలుంటే అవి కూడా పరిగణనలోనికి తీసుకొని అప్పుడు ఇష్టపడింది కాబట్టి ఇప్పుడు కూడా ఇష్టపడే వుంటుందని ప్రస్తుతపు కేసు రేప్ అయినా కూడా దానిని ఆమె నడవడిక మంచిది కాదు అనే కారణం చూపి కొట్టివేసిన సందర్భాలున్నాయి. మధుర కేసు ఇందుకు మంచి ఉదాహరణ. ఒక సర్వే ప్రకారం రేప్ కేసులలో 70 శాతం దోషులు నిర్దోషులుగా వదిలివేయబడుతున్నారు.

స్త్రీల మీద జరుగుతున్న అనేక అత్యాచారాలను అరికట్టాల్సిన ప్రభుత్వమే తన రాజ్యాంగం ద్వారా రక్షకభటుల ద్వారా మరింత హింసను ప్రేరేపిస్తున్నది. రంగనాథ్ మిశ్రా వంటి పురుషాహంకారం గల వ్యక్తులు న్యాయనిర్ణేతలుగా వుండి ఇంక స్త్రీలకు ఏం న్యాయం చేస్తారు. "స్త్రీలు తమ ఉద్యోగాలు వదిలిపెట్టి ఇళ్ళకు వెళ్ళమని ఒక స్త్రీల సభలోనే మాట్లాడగలగడం న్యాయవ్యవస్థకే సిగ్గుచేటు. పైగా తను వ్యక్తిగత హోదాలోనే మాట్లాడానని సమర్థించుకోని చూడడం ఇంకా అసహ్యం. రేపు ఇదే రంగనాథ మిశ్రా స్త్రీ న్యాయవాదులు వాదించే కేసులలో తీర్పు చెప్తాడు. న్యాయమైనవిగా వుంటాయని ఎలా అనుకోగలం?

వరకట్న హత్యలు రోజు రోజుకూ పెరుగుతున్నాయి. వరకట్న హత్యలు హత్యలుగాకాక ఆత్మహత్యలుగా మాత్రమే రిపోర్టు కావడం 99% నేరస్థులైన భర్తలు శిక్ష తప్పించుకోవడం చాల సహజ విషయమై పోయింది. కడుపునొప్పి భరించలేక అనే, స్టౌ అంటుకొని ప్రమాదవశాత్తు అనే, పిల్లలు లేరనే బెంగతో (16 ఏళ్ళు లేదా 18 ఏళ్ళ) స్త్రీ ఆత్మహత్య చేసుకున్న కారణాలు పోలీసులు నమ్మడం, నమ్మించడం అంతకంటే సహజం అయిపోయింది. దానితో ఈ నేరాల సంఖ్య గణనీయంగా పెరగడమే కాదు. ఈ హత్యలు చేసేవాళ్ళు రహస్యంగా ధీమాగా కాళ్ళు చేతులు కట్టివేసి బాల్కనీ లోకి లాక్కొచ్చి మరీ తగులబెట్ట గలుగుతున్నారంటే ఆశ్చర్యం లేదు. ఇలాంటి సంఘటనలు జరుగుతున్నా నేరస్థుడైన వ్యక్తి సంగతి తెలిసి కూడా అతనికి రెండో పెళ్ళికి మళ్ళీ పిల్లనివ్వడానికి సిద్ధపడుతున్నారు. తమ భార్యలని సజీవంగా తగులబెట్టినా చుట్టుపక్కల వాళ్ళు పట్టించుకోకుండా వుంటున్నారంటే భార్య భర్తల మధ్య తగువు వారి వ్యక్తిగత విషయంగా భావించడం వల్లే తన భార్యని తగులబెట్టినా అది మనకనవసరం అనుకోగలుగుతున్నాము. తాగి వచ్చి భార్యలను హింసించే వాళ్ళు కూడా ఎక్కువయ్యారు. శాస్త్రీయ జ్ఞానం పెరిగే కొద్దీ అది కూడా తనకు చాతనయిన రీతిలో స్త్రీల అణచివేతకు ఉపయోగ

*రోజు రోజుకూ స్త్రీలపై దౌర్జన్యాలు, అత్యాచారాలు పెరిగిపోతున్నాయి. ఇలా అనునిత్యమూ అణిచివేతల అంధకారంలో మగ్గిపోతున్న స్త్రీల "రక్షణ" కోసం, "అభ్యున్నతి" కోసం ప్రభుత్వం ఎన్నో చట్టాలు చేసింది. ఎంతో ఆర్భాటం చేసింది. ఎన్ని చట్టాలు చేసినా ఆ చట్టాల సందుల్లో నుంచే, స్త్రీలపై అత్యాచారాలు చేసినవారు, దౌర్జన్యాలు చేసినవారు, సజీవ దహనం చేసినవారు తప్పించుకొని జేఫికరుగా తిరుగుతున్నారు. ఈ పితృస్వామిక వ్యవస్థలోని అన్ని విలువల మాదిరిగానే న్యాయం గూడా పురుష పక్షపాతిగా ఉండడం మూలంగానే నేడు స్త్రీ జాతి ఇంత రంపపుకోతలకు, రాక్షస హింసలకు బలి అవుతున్నా పట్టించుకున్న పాపాన ఏ పాలక వర్గ పార్టీ పోలేదు. ఈ దుస్థితి మూలంగానే వరకట్న హత్యలు, అత్యాచారాలు నిత్యకృత్యమయ్యాయి.*

*ప్రభుత్వ లెక్కల ప్రకారం, 1988 సం॥లో 2,209 మంది స్త్రీలు వరకట్న హత్యలకు గురయ్యారు. 1989 సం॥ము వచ్చేసరికి 4,006 మంది వరకట్న పిశాచానికి బలయ్యారు. అంతేగాక 7,895 మంది అత్యాచారానికి బలి అయ్యారు. 11,126 మంది స్త్రీలు, బాలికలు కిడ్నాపులకు దౌర్జన్యాలకు గురయ్యారు. 16,683 మంది అసభ్య ప్రవర్తనలకు అవమానాలకు గురైనారు.*

*1990 సం॥ వచ్చే నాటికి ఇంకింత భయంకరమైన వాస్తవాలు ఉన్నాయి. ఈ ఒక్క సం॥లోనే 4,835 మంది స్త్రీలు సజీవ దహనం చేయబడ్డారు. 40,000 మంది దౌర్జన్యాలకు గురయ్యారు. 4,835 మంది వరకట్న హత్యలకు గురికాగా 9,515 మంది అత్యాచారాలకు బలి అయ్యారు. 20,186 మంది అసభ్య చేష్టల అవమానాలకు గురికాగా 11,689 మంది కిడ్నాపులు చేయబడ్డారు.*

*ఇవన్నీ సమాజంలో జరుగుతున్న సంఘటనలలో ఒక శాతం కూడా కావని వేరే చెప్పక్కరలేదు. ఎందుకంటే స్త్రీ తన దైనందిన జీవితంలో అనుక్షణం ఎదుర్కొంటున్న అవమానాలనూ, అణిచివేతలను, దౌర్జన్యాలను మౌనంగా భరించి, భరించి, చివరికి నూటికో కోటికో ఎవరో ఒక్కరు "సంఘ కట్టుబాట్లు, నీతి నియమాల"ను తెంచేసుకొని పోలీస్ స్టేషన్ కొచ్చి ఫిర్యాదు చేస్తున్న సంఘటనలే పై విధంగా ఉంటే స్త్రీ జాతి నాలుగు గోడల మధ్యననుభవిస్తున్న అరణ్యరోదన, మూగవేదన ఎంతో...*

పడుతోంది. గర్భిణీ స్త్రీలపై స్కానింగ్ చేసి లింగ నిర్ధారణ పరీక్షలు చేసి ఆడశిశువును చంపించడం లాంటి భయంకర సంఘటనలు కూడా జరుగుతున్నాయి. అలాగే పరీక్షల్లో ఆడశిశువు అని నిర్ధారణ జరిగిన ఒక గర్భిణీ స్త్రీ గర్భస్రావం చేయించడానికి ప్రయత్నించి అందుకు కుదరకపోగా 8 నెలల గర్భిణీని కిరసనాయిలుపోసి తగులబెట్టిన సంఘటన హైదరాబాద్ లోనే జరిగింది.

మైనర్ బాలికల మీద అత్యాచారాలు కూడా ఈ మధ్య గణనీయంగా పెరిగాయి. హైదరాబాద్‌లోని పేరు మోసిన స్కూల్ పిల్లల్ని చాటుగా తీసుకుపోయి మరోచోట ఆ చిన్నపిల్లల మర్మాయవాల మీద గాయాలు చేయడం వంటి సంఘటనలు జరిగాయి. అభం శుభం ఎరుగని చిన్న పిల్లలు సైతం ఇలా ప్రవర్తించడానికి కారణమైన సినిమాలు. వాటి ప్రభావం, సంస్కృతి పాలక వర్గాలు తమ స్వప్రయోజనాల కోసం ప్రజల మీద రుద్దుతున్నదే.

పురుషాధిక్య సమాజం స్త్రీని ఒక వ్యక్తిగా కాకుండా ఒక వస్తువుగా ఒక సరుకుగా చూస్తున్నంత కాలం ఈ పరిస్థితి మారదు.

స్త్రీలపై ఇలా శారీరక హింస మాత్రమే కాకుండా మానసిక హింస కూడా నిత్యం జరుగుతున్నది. స్త్రీని బాల్యంలో తండ్రి, యవ్వనంలో భర్తా, వృద్ధాప్యంలో కొడుకూ చూస్తారని పురాణంలో వ్రాయడమే కాదు. ఆచరణలో కూడా స్త్రీని ఒక పరాన్నభుక్కుగా, ఒక నిర్జీవమైన వస్తువుగానో పరిగణించబడుతోంది.

స్త్రీలపై జరుగుతున్న ఈ అత్యాచారాలను, ఈ శారీరక మానసిక హింసను ఎదుర్కోవాలంటే పురుషులు స్త్రీలు సమానమనే సమాజం రావాలి. స్త్రీలు ఒక వస్తువుగా, ఒక సరుకుగా కాక మనుషులుగా గుర్తింపబడాలి. దీనికి పరిష్కారం వ్యవస్థ మార్పు చెందితేనే సాధ్యపడుతుంది. ఈ అసమానత్వాలకి మూలం ఎక్కడుందో అర్థం చేసుకొని అక్కడ్నుంచే నాశనం చేయాలి. స్వంతాస్తి రద్దు అయి ఆస్తులన్ని సమాజపరం అయ్యి సామాజిక అవసరాలు తీర్చబడి స్త్రీలు ఉత్పత్తిలో భాగస్వాములు అయినపుడే ఇది సాధ్యపడుతుంది. ఇందుకోసం మహిళలు సంఘటితపడి ఉద్యమించాలి. అయితే ఈనాడున్న ఫెమినిస్ట్ ధోరణుల్లో కొన్ని పెడత్రోవ పట్టించేవిగా ఉన్నాయి. మహిళా ఉద్యమం దానికదే స్వతంత్రమైనదని పురుషులకు అందులో భాగం లేదని కొంత మంది అభిప్రాయం. కాని పీడిత జనావళితో స్త్రీలు ఒక భాగం కనుక మొత్తంగా పీడిత జనం విముక్తి చెందే క్రమంలోనే స్త్రీ విముక్తి కూడా సాధ్యపడుతుంది. కార్మిక వర్గ నేతృత్వం లో నూతన వ్యవస్థ కొరకు జరిగే విప్లవంలో మహిళలు పురుషులతో భుజం భుజం కలిపి పోరాడాలి. అపుడే స్త్రీల సమస్యలన్నిటికీ ఒక శాశ్వత పరిష్కారం దొరుకుతుంది.

– సాధారణ

# మహిళా పోరాటాలు — రాజ్యహింస

"నన్ను మణుగూరుల అరెస్టు చేసి, మూడు దినాలు లాకప్‌లో వుంచి, చేతులకు చెక్కలు బిగించిన్రు. రోకలి బండ లెక్కించిన్రు. సుట్టలతో కాల్చిన్రు. అటెనక బట్టలిడి పించి గదిలోకి గుంజుక పోయి, చెవులకు, మెడకు, నడుముకు కరెంటు పాకులిచ్చిన్రు...."

— గోగు బెల్లి లక్ష్మి

"నాతో పాటు ఇంకిద్దరక్కలను 4 దినాలు కరీంనగర్ వన్‌టౌన్ పోలిసు స్టేషన్‌లో వుంచి, బగ్గకొట్టిన్రు. పెయి మీన కెల్లి బట్ట లిడిపించిన్రు. లాకప్‌ల ఏసిన్రు. "లంజలు.. పెల్లి పెటాకులు లేకుండ తిరుగతున్రు. రోజుకు ఎంత మంది మొగొల్లుగావల్నే మీకు, మా కానిస్టేబుల్ల నిచ్చి పెల్లి జేస్తమే..." అని బూతులు తిట్టుకుంట పూల దండలు తెప్పించి, అల్ల మెడలల్ల ఏయమన్నరు. పెయిమీద గ్యాసునూనె పోసిన్రు. అగ్గి పెట్టలు, తాడు, పురుగుల మందు గదిలో పెట్టి - "గీ బతుకు బతికె కంటే సావరాదే..."! అని చావమని వత్తిడి చేసిన్రు.

- కరీంనగర్ జిల్లాలో బీడీ కార్మిక సంఘంలో పనిచేస్తున్న రాజేశ్వరి అనుభవం ఇది.

వసంత, కొమరక్క లిద్దరూ వరంగల్ జిల్లాలో మహిళా సంఘంలో పనిచేస్తున్నారు. గత ఏడాది మే 8వ తేదీన ఘనపురం పోలీసులు వీరిద్దరినీ అరెస్టు చేసి 2 రోజుల పాటు లాకప్‌లో వుంచి విపరీతంగా కొట్టారు. కొమరక్క ఎంత చెబుతున్నా వినిపించుకోకుండా 'నీచీర లోపల ' దళం డ్రెస్' వుంది" అనంటూ మగ పోలీసులు ఆమె చీర విప్పి 'చెక్' చేసారు. చివరికి ఇద్దరి పైనా తొండలు వదిలిపెట్టారు.

పోలీసులతో ఇలాంటి అనుభవాల్ని తెలంగాణా ప్రాంతంలో మహిళా సంఘంలో పని చేస్తున్న కార్యకర్తలందరూ ఏదో ఒక మేరకు పొందిన వారే.

భర్తల వల్ల, మగ వాళ్ళవల్లా మోసానికి, దౌర్జన్యానికి గురి అయిన స్త్రీలు, కుటుంబ హింసకి బలి అయి, బయటకు వచ్చేసిన వంటరి స్త్రీలు,, వందల సంఖ్యలో మహిళా ఉద్యమం పట్ల ఆకర్షితుల..వుతున్నారు. తాము వ్యక్తులుగా ఎదుర్కొన్న సమస్యలు కేవలం తమ ఒక్కరివేకావని, ఇదేవిధంగా కోట్లాదిమంది స్త్రీలు పితృస్వామ్య అణిచివేతను, కుటుంబ హింసను అనుభవిస్తున్నారన్న గుర్తింపు, స్త్రీల సంఘాలు ఈ సమస్యలపై పోరాడుతాయన్న చైతన్యం వారికి ఎంతో ధైర్యాన్ని కలిగిస్తుంది. ముఖ్యంగా తెలంగాణా జిల్లాలో వివిధ విప్లవ సంస్థల నాయకత్వంలో సాగుతున్న ప్రజా పోరాటాలు, స్త్రీలలో ప్రజాస్వామిక చైతన్యాన్ని కలుగ జేస్తున్నాయి. ఈ పోరాటాల ప్రభావంతో కూడా స్త్రీలు మహిళా సంఘాల క్రింద సంఘటిత మవుతూ తాము స్త్రీలుగా ప్రత్యేకించి ఎదుర్కొంటున్న అణిచివేత, పీడనల పై పోరాడుతున్నారు. అట్టడుగు వర్గాలకు చెందిన స్త్రీలు, ముఖ్యంగా దళిత స్త్రీలు స్త్రీ విముక్తి పోరాటాలలో ప్రధాన పాత్ర వహిస్తున్నారు.

వర్గ దోపిడికీ, కుటుంబ హింసకు వ్యతిరేకంగా ముందుకు వస్తున్న ఈ స్త్రీలను ' రాజ్యం' తిరిగి వంటిళ్ళలోకి, "పవిత్ర కుటుంబాల"లోకి తరిమేందుకు పూనుకుంటున్నది. కుటుంబం వెలుపల స్త్రీలపై భూస్వామ్య వర్గాలు, లంపెన్ శక్తులు, ఫ్యాక్టరీ యజమానులు సాగించే ఆర్థిక దోపిడికి, లైంగిక పరమైన వేధింపులకు అత్యాచారాలకు రాజ్యం లేజిటిమసిని కల్పిస్తున్నది. అంతేకాదు కుటుంబం లోపల, బయట ప్రజాస్వామిక హక్కుల కోసం, సమానత్వం కోసం స్త్రీలు సాగిస్తున్న పోరాటాలను పాశవికంగా అణిచివేస్తూ, అసమానతలపైనఆధార పడి వున్న పితృస్వామిక కుటుంబ వ్యవస్థను అది యధాతథంగా పరిరక్షించ తలుచుకున్నది కూడా !

**మహిళా పోరాటాలు :**

ఇవ్వాళ్ళ తెలంగాణా జిల్లాలో ఏ పల్లెలో చూసినా ఒకే దృశ్యం! దొరల వాకిళ్ళ ముందు సాన్పుజల్లే బాసాన్లు దోమే స్త్రీలు, మురికి బట్టలు మల్లె పూవుల్లా వుతికే చాకలి అక్కలు, నడుము ..లిరుగంగ నాట్లు వేసే లచ్చుమమ్మలు, బీడీలు చుట్టీ, చుట్టీ, రోగాలతో సగం అయిపోయిన బీడీ అక్కలు, వుట్టిన్నుండి నచ్చే దాకా కష్టాలు తప్పా, మరేమీ ఎరుగని దొలమ్మలు, కొమరమ్మలు, సమ్మక్కలు జెండాలు చేత బట్టి, తమ హక్కుల కోసం పోరాడుతున్నారు.

స్త్రీలపై జరుగుతున్న లైంగిక అత్యాచారాలకు, వరకట్న హత్యలకు, కుటుంబహింసకు, మైనర్ బాలికలపై అత్యాచారాలకు, రాజ్యాంగ యంత్రం, భూస్వామ్య వర్గాలు, లంపెన్ శక్తులు స్త్రీలపై సాగిస్తున్న హింస, అణిచివేతలకు, స్త్రీలను కించపరస్తున్న సంస్కృతి, భావజాలానికి, పురుషాధిపత్యానికి వ్యతిరేకంగా వేల సంఖ్యలో స్త్రీలు వీధులలోకి వచ్చి పోరాడుతున్నారు.

కుల వివక్షత, పీడనలతో పాటు, పురుషాధిపత్య అణిచివేతకు గురి అవుతున్న, సమాజంలో సగభాగంగా వున్న స్త్రీలకు విద్యా, ఉద్యోగ అవకాశన్నింటా 50% రిజర్వేషన్‌లను కల్పించాలనీ, భూమిపై, ఆస్తిలోనూ నమాన భాగస్వామ్యం వుండాలని డిమాండు చేనన్తా స్త్రీలు ఉద్యమిస్తున్నారు.

మన రాష్ట్రంలో మద్య పానానికి వ్యతిరేకంగా.ఇటీవల స్త్రీలు సాగించిన పోరాటం చెప్పుకోదగ్గది. ముఖ్యంగా తెలంగాణా జిల్లాలో ఈ పోరాటంలో వేలాది మంది స్త్రీలు పాల్గొన్నారు. గత ఏడాది కరీంనగర్ జిల్లాలో మారుమూల పల్లెల నుండి వచ్చిన 35 వేల మంది స్త్రీలు కరీంనగర్ పట్టణంలో 11-9-91 తేదీన గొప్ప ప్రదర్శనను నిర్వహించారు. చేతిలో కర్రలతో, జెండాలతో,నినాదాల హెూరుతో స్త్రీలు సాగించిన ఈ మిలిటెంటు ప్రదర్శన, జిల్లాలోని సారాకాంట్రాక్టర్లను, పోలీసు

వర్గాలను భయకంపితులను చేసింది. ఆరోజు కరీంనగర్ పట్టణానికి వందలాది మంది సాయుధ పోలీసులను దింపారు. సారా, బ్రాందీ దుకాణాలు, బార్‌లు మూతపడ్డాయి. ఈ స్త్రీల దుకాణాలపై దాడి చేస్తారేమోనన్న భయంతో దుకాణాలముందు సాయుధ పోలీసులను కాపలావుంచారు.

నిజామాబాద్‌లో 30-10-91 తేదీన 10 వేల మంది స్త్రీలు "అక్షర జ్యోతులు కాదు - అకలి తీర్చండి!" "తాగుబోతు పోలీసుకు, సర్కారుకు బుద్ధి చెబుదాం!" "సర్కారుకు సత్తా వుంటే సారాదుకాణాలు బందు పెట్టాలె" అని నినాదాలిస్తూ కలెక్టర్ ఆఫీసు ఎదుట ప్రదర్శన చేసారు. మద్యపానానికి వ్యతిరేకంగా లక్ష మంది ప్రజల సంతకాలను సేకరించి కలెక్టర్‌కు మెమోరాండం ఇచ్చారు. ఊరేగింపుకు అనుమతి వున్నప్పటికీ, ప్రతినిధి బృందం ఓ వంక కలెక్టర్‌తో మాట్లాడుతూ వుండగానే పోలీసులు ప్రదర్శకులపై విరుచుకుపడ్డారు.

నల్గొండలో అనేక గ్రామాలలో స్త్రీలు తాగుడుకు వ్యతిరేకంగా ప్రదర్శనలు చేసారు. సారా జీపులు ఊళ్లలోకి ప్రవేశించకుండా అడ్డుకున్నారు. మహిళా సంఘం కార్యక్రమాలతో ప్రభావితులైన గ్రామీణ స్త్రీలు తమంతట తామే అనేక గ్రామాలలో ప్రదర్శనలు జరిపారు. గ్రామంలో కూలికి వెడుతున్న కూలి అక్కలు సారా జీపు తమ ఊళ్ళోకి రాబోవడాన్ని దూరం నుండి చూసి, జీపు వెంట పరుగెత్తుకు వెళ్ళి, దానిలో వున్న సారా ప్యాకెట్లను కొడవళ్ళతో కోసి క్రింద పారబోసారు.

రంగారెడ్డి జిల్లాలోని అనేక మండలాలలో మద్యపానానికి వ్యతిరేకంగా ప్రచారం జరిగింది. కులకచర్ల మండలంలో ప్రచారం చేస్తున్న 6గురు మహిళా కార్యకర్తలను పోలీసులు అరెస్టు చేసి నాలుగు రోజుల పాటు నిర్బంధించారు. పరిగిలో 144 సెక్షన్ విధించి, మీటింగ్‌కు అనుమతి నిరాకరించారు. అయినప్పటికీ మీటింగ్‌కు వచ్చిన నాలుగు వేల మంది జనంపై లాఠీచార్జి చేసి తరిమికొట్టారు. 12 మందిని అరెస్టు చేసి కేసుపెట్టారు.

మద్యపానం వల్ల కలుగుతున్న దుష్ఫలితాలకు అందరికన్నా ఎక్కువ గురవుతున్నది స్త్రీలే. మద్యపానానికి వ్యతిరేకంగా మహిళలు సాగిస్తున్న ఈ పోరాటం నేడు తెలంగాణా జిల్లాల నుండి ఆంధ్ర, రాయలసీమ, ఉత్తరాంధ్రలకు విస్తరించింది. కృష్ణా, గుంటూరు, ప్రకాశం, నెల్లూరు, తూర్పు, పశ్చిమ గోదావరులు, విశాఖ, శ్రీకాకుళం, అనంతపురం, కర్నూలు దాదాపు 18 జిల్లాలలో స్త్రీలు వందల, వేల సంఖ్యలో మద్యపానానికి వ్యతిరేకంగా ప్రదర్శనలు చేసారు. నెలరోజుల పాటు వందలాది గ్రామాలలో తాగుడుకు వ్యతిరేకంగానూ, సారాకాంట్రాక్టర్లు, ప్రభుత్వం సాగిస్తున్న దోపిడిని వివరిస్తూ, విస్తృతంగా ప్రచారం సాగింది స్త్రీలు టీములుగా ఏర్పడి ప్రచారం చేసారు.

కార్మిక సంఘాలు, రైతు-కూలి సంఘాలు స్త్రీల సమస్యలపై చేపడుతున్న పోరాటాలకు మహిళా సంఘం క్రియాశీలక మద్దతు ప్రకటిస్తూ వుంది. మన రాష్ట్రంలో గల 10 లక్షల మంది బీడీ కార్మిక స్త్రీలు, వ్యవసాయ రంగంలో పనిచేస్తున్న లక్షలాది మంది వ్యవసాయ కూలి స్త్రీలు పని పరిస్థితుల మెరుగదల కోసం, కూలిరేట్ల పెంపుదల కోసం పోరాడుతూ వున్నారు. ఒక స్పష్టమైన రూపం తీసుకోక పోయినప్పటికీ భూమిపైన హక్కుకోసం స్త్రీలు కదలటం ప్రారంభమయింది.

వరంగల్ జిల్లాలో మిరప తోటలలో పనిచేసే 10 వేల మంది మహిళా కూలీలు 1990 జనవరిలో 15 రోజుల పాటు సమ్మెచేసి, విజయాలను సాధించుకోగలిగారు. తునికాకు తెంపే, అటవీ మైనర్ ఉత్పత్తులను సేకరించి అమ్మే గిరిజన మహిళలు పోరాటాల ద్వారానే తమ కూలి రేట్లను పెంచుకోగలిగారు.

వరంగల్ జిల్లా అశోక్‌నగర్‌లో 50 మంది, భూపాలపల్లెలో 400 మంది స్త్రీలు గొడ్డళ్ళు పట్టుకుని పురుషులతో పాటు పోడు భూములు నరికి ఆక్రమించుకున్నారు. ఖమ్మం జిల్లా రేగళ్లులో మొత్తం స్త్రీలే కదిలి 1000 ఎకరాలు పోడు నరికి, భూములు స్వంతం చేసుకున్నారు. మరో 500 ఎకరాలు పురుషులతో పాటు కలిసి నరుకుతున్నారు. ఈ భూముల ఆక్రమణ సందర్భంగా ఫారెస్టు అధికారులు, భూస్వాములు, పోలీసులు అమలు పరిచిన నిర్బంధాన్ని, అక్రమ కేసులను తట్టుకుని ధైర్యంగా నిలిచారు. ఎన్ని బెదిరింపులు ఎదురైనా స్త్రీలు భూములను మాత్రం వదిలిపెట్టలేదు.

స్త్రీలు ఇలా భూమిపైన హక్కు పొందగలగటం చుట్టు ప్రక్కల గ్రామాలలోని మహిళలకు ఎంతో ఉత్తేజాన్ని, ధైర్యాన్ని ఇచ్చింది.

బయటి ప్రపంచమూ, రాజకీయాలు పురుషులకు సంబంధించిన వ్యవహారంగా చూడబడుతూ వుంది. అన్ని విధాలా బాధితులైన స్త్రీలు సమాజం ఎదుట నేరస్తులుగా నిలబెట్టబడుతూవున్నారు. ఫ్యూడల్ విలువలు బలంగా వుండే గ్రామీణప్రాంతాలలో స్త్రీలు వీధులలోకి రావడం తప్పుగా చూడబడుతుంది. అలాంటి ప్రాంతాలలో మహిళా పోరాటాలు, ప్రజా పోరాటాలు అవికల్పించిన చైతన్యం ఫలితంగా స్త్రీలు ధైర్యంగా ముందుకు వచ్చి తమ పైన జరిగిన అన్యాయాలను బయటకు వెల్లడించడమే కాకుండా, న్యాయాన్ని డిమాండు చేస్తున్నారు. కొన్ని సందర్భాలలో బాధితులైన స్త్రీలు తమపై దౌర్జన్యం చేసిన నేరస్తులను బహిరంగంగా శిక్షించారు కూడా! గ్రామాలలో కుల పెద్దలు, పెత్తం దార్లు, భూస్వాములు చెప్పే తీర్పులలో స్త్రీలు పాల్గొనేందుకు అనుమతి వుండదు. ఇలాంటి పురుషాధిపత్యపు విలువలను, భావజాలాన్ని స్త్రీల సంఘాలు ఓ మేరకు దూరం చేయగలిగాయి. గత రెండు సంవత్సరాల కాలంలో కరీంనగర్, వరంగల్, ఖమ్మం, నిజామాబాద్, నల్లగొండ, రంగారెడ్డి తదితర జిల్లాలలో దాదాపు 250 ప్రజా పంచాయితీలను మహిళా సంఘం నిర్వహించింది. కుటుంబ హింస, వివాహేతర సంబంధాలు, వరకట్నం, లైంగిక వేధింపులు, అత్యాచారాలు, వివిధ రూపాలలో స్త్రీలపై సాగుతున్న అణిచివేత మొదలగు సమస్యలపై స్త్రీలు తీర్పులు చెప్పారు. మొదట కొంత వింతగా చూసినా, క్రమంగా ప్రజలు ఈ తీర్పులను

ఆమోదించడం, ఆహ్వానించడం చేసారు.

చుండూరులో అగ్రకుల దురహంకార శక్తులు దళితులపై సాగించిన మారణ కాండకు, ఇందుకు స్త్రీలను కారకులుగా చేసి, సాగించిన దుష్ప్రచారాన్ని, చలకుర్తిలో ముత్తమ్మపై జరిగిన అమానుష కృత్యాన్ని తీవ్రంగా ఖండిస్తూ వర్గదోపిడీ, కుల వివక్షత, పీడన, పితృస్వామానికి గల సంబంధాన్ని వివరించేందుకు స్త్రీ విముక్తి సంఘం కృషి చేసింది. దళితులు, ప్రజా సంఘాలు, ప్రజాస్వామిక శక్తులు సాగించిన ఐక్య పోరాటాలలో స్త్రీలు చురుకుగా పాల్గొన్నారు.

అడ్డుకునేందుకు స్త్రీ విముక్తి పోరాటాలను మొగ్గలోనే త్రుంచి వేసేందుకు రాజ్యం అన్ని విధాలా ప్రయత్నిస్తున్నది.

మహిళా ఉద్యమాలను, ప్రజా ఉద్యమాలను అణిచి వేసేందుకు రాజ్యం లైంగిక అత్యాచారాలను ఒక రాజకీయ ఆయుధంగా ఉపయోగిస్తున్నది.

1991 సంవత్సరంలో ప్రగతిశీల మహిళా సంఘం (స్త్రీ విముక్తి) కార్యకర్తలు, సానుభూతి పరులు పోలీసుల నిర్బంధానికి సంబంధించి దాదాపు 80 కి పైగా ఘటనలు జరిగాయి. వీటిల్లో 90 శాతం తెలంగాణా ప్రాంతంలో



సారాయిని జీపుల నుండి గుంజుతున్న మహిళలు

### స్త్రీలపై నానాటికీ తీవ్రం అవుతున్న రాజ్య హింస :-

ఆకాశంలో సగం అయిన స్త్రీలు, ఇలా పోరాటాల్లోనూ సగం కావడం, వర్గదోపిడికీ, పితృస్వామ్యానికి వ్యతిరేకంగా ఉద్యమించడం, దోపిడీ వర్గాలను నిజంగానే భయకంపితులను చేస్తున్నది.

అనేక హింసలను అనుభవించిన స్త్రీలు చైతన్యవంతులై ఒక్కసారి ఉద్యమాలలోకి రావడమంటూ జరిగితే సాధారణంగా వెనక్కు తిరిగి వెళ్ళే సమస్యే ఉత్పన్నం కాదు. చరిత్ర రుజువు చేసిన అంశం ఇది. అందుకే ప్రారంభంలోనే స్త్రీల కదలికను

జరిగాయి. 1991 డిసెంబర్‌లో రాష్ట్రంలో నక్సలైట్ ఉద్యమ అణిచివేత పేరిట, తెలంగాణా ప్రాంతాలకు ప్రభుత్వం బి.ఎస్.ఎఫ్., సి.ఆర్.పి., ఐ.టి.బి.పి తదితర ప్యారా మిలటరీ బలగాల దింపింది.

అలనాడు తెలంగాణా సాయుధ రైతాంగ పోరాటాన్ని నెత్తురుటేర్లలో ముంచేందుకు కేంద్రం నుండి యూనియన్ సైన్యాలు తెలంగాణాకు దిగాయి. తిరిగి ఆనాటి ఫాసిస్టు నిర్బంధాన్ని తలపింప జేస్తూ, మరల తెలంగాణా జిల్లాలో ప్యారామిలటరీ బలగాల ఇనుప బూట్ల కవాతు ప్రతిధ్వనిస్తోంది.

ఇప్పటికే స్త్రీల పోరాటాలపై అమలవుతున్న రాజ్య హింసకు తోడు, బి.ఎస్.ఎఫ్ దళాల రాకతో ఈ హింస మరింత తీవ్ర రూపం తీసుకుంటూ వుంది. పోరాట ప్రాంతాలలో స్త్రీలపై రాజ్యహింస మూడు పద్ధతులలో అమలవుతూవుంది. ఒకటి పితృస్వామ్యానికి వ్యతిరేకంగా పోరాడుతున్న మహిళా సంఘాల కార్యకర్తల పైన, సానుభూతి పరులపై, విప్లవ సంస్థలలో పని చేస్తున్న మహిళా కార్యకర్తలపైన., రెండు ప్రజా ఉద్యమాలలో పనిచేస్తున్న కార్యకర్తలు, సానుభూతి పరుల కుటుంబాలకు చెందిన స్త్రీల పైన, మూడు ఎలాంటి పోరాటాలతోనూ సంబంధం లేక పోయినప్పటికీ పోరాట ప్రాంతాలలో వుండటం, స్త్రీలు కావడం వల్ల జరిగేది.

ఖమ్మం జిల్లా పగిడేరు గ్రామస్తురాలు, మహిళా సంఘం కార్యకర్త సావిత్రిని 20 రోజుల పాటు అక్రమంగా నిర్బంధించి, చిత్రహింసలు పెట్టి, అత్యాచారం జరిపారు. వరంగల్ జిల్లా దూమెడ గ్రామంలో అంగన్ వాడీ టీచర్ మహిళా సంఘం సభ్యురాలు జ్యోతి ఇంటిపై ఎ.ఎన్.ఎన్. పోలీసులు అర్ధరాత్రి దాడి చేసి, ఊరవతల అడవికి ఎత్తుకెళ్ళి చిత్రహింసలు పెట్టి, కరెంటు షాకు ఇవ్వడంతో ఆమె మానసిక స్థితి దెబ్బతింది. రంగారెడ్డి జిల్లా కన్వీనర్ శ్యామలను టాడా క్రింద అరెస్టు చేసి మూడు నెలలు జైల్లో నిర్బంధించారు. ఆదిలాబాద్‌లో ప్రమీలను దేవాపూర్‌లో అరెస్టు చేసి, ముల్కాల పోలీసు స్టేషన్‌లో వుంచి గోళ్ళలో సూదులు గుచ్చి హింసించారు. ఏడాది వయసు వున్న పాలు తాగే తన పాపను తీసుకు రమ్మని ఆమె కోరితే, ఆమెను బాగాకొట్టి, ఆసుపత్రికి తీసుకువెళ్ళి పాలు ఇంకి పోయేందుకు ఇంజక్షన్ ఇప్పించారు పోలీసులు. బి.ఎస్.ఎఫ్ దళాలు వచ్చాక ఈ నిర్బంధం మరింత పెరిగింది. ఈ తీవ్రతను అర్థం చేసుకునేందుకు ఫిబ్రవరి నెలలో ఎడతెరిపి లేకుండా కరీంనగర్‌లో మహిళా కార్యకర్తల పై అమలైన నిర్బంధం తోడ్పడుతుంది. ఫిబ్రవరి 5, 1992 అర్ధరాత్రి కొదురుపాక గ్రామంలో బీడీకార్మిక సంఘం ఆఫీసులపై సాయుధ పోలీసులు దాడి చేసారు. కాంత, రమణ, రాజేశ్వరిలను అరెస్టు చేసి ఆరు రోజులపాటు

అక్రమంగా లాకప్‌లో వుంచి ఇష్టం వచ్చినట్లు కొట్టారు. "బి.ఎస్.ఎఫ్ దళాలు ఆకలితో వున్నాయని, వాళ్లకి ఆడవాళ్ళ అవసరం ఎంతో వుందనీ మీలాంటి వాళ్ళని వాళ్ళ వద్దకు పంపు తామనీ...." అంటూ వర్ణించ శక్యం కాని బూతులు తిట్టారు. మానసికంగా టెర్రరైజ్ చేసారు. ఈ అరెస్టుల విష యం కనుక్కుందామని వెడుతున్న అంజలి, ఎన్. రాజేశ్వరీలను ఫిబ్రవరి 9న అరెస్టు చేసి ఒక రోజంతా లాకప్‌లో వుంచి చెప్పుకోలేని ప్రాంతాలలో బాగా కొట్టారు. ఫిబ్రవరి 22న శాత్రాజ్‌పల్లి గ్రామంలో ఇంట్లో వున్న ఎన్. రాజేశ్వరిని (కార్యకర్త) ఇంట్లోంచి బయటకు ఈడ్చుకు వచ్చి విపరీతంగా కొట్టడమే కాకుండా, ఆ గ్రామానికి చెందిన మరో 150 మంది ప్రజలను పోగు చేసి, రాజేశ్వరిని ముందునిలబెట్టి, అందరినీ కొట్టుకుటూ, మహిళా సంఘానికీ, నక్సలైట్లకు వ్యతిరేకంగా నినాదాలు ఇప్పిస్తూ సాయంత్రం వరకూ ఊరంతా త్రిప్పారు. ఈ ఘటన ను ఖండిస్తూ సిరిసిల్లాలో పోస్టర్లు వేస్తున్న సుశీల, మధుర, బాల, లక్ష్మిలను ఫిబ్రవరి 24న అరెస్టు చేసి బాగా కొట్టి రాత్రి 10 గం||కు వదిలిపెట్టారు.

ఇటీవలి కాలంలో విప్లవ సంస్థల లోను, మహిళా సంఘాలలోనూ పని చేస్తున్న అనేక మంది మహిళా కార్య కర్తలు ఎన్‌కౌంటర్ల పేరిట కాల్చి చంపబడుతున్నారు. క్రిష్ణ సాగర్‌లో కృష్ణకుమారి, కాంచన పల్లిలో చింతాలక్ష్మి, నుసేన, కరీంనగర్‌లో నర్సక్క, నిజామాబాద్‌లో జ్యోతి, పగిడేరు వద్ద మరో మహిళా కార్యకర్త మరణించారు.

ఇక ప్రజా ఉద్యమాలలో పనిచేస్తూ రహస్య జీవితాలను గడుపు తున్న కార్యకర్తల కుటుంబాలలోని స్త్రీలు అనుభవిస్తున్న హింస ఎక్కువగా వెలుగులోకి రావడం లేదు. మాయమై పోయిన తమ వాళ్ళకోసం, చివరకు శవాలుకూడా దక్కని తమ జీవిత సహచరుల కోసం దుఃఖిస్తున్న ఈ స్త్రీలు రాజ్య హింసను పరోక్షంగానే కాదు, ప్రత్యక్షంగా కూడా అనుభవిస్తున్నారు.

తమ పిల్లల, భర్తల రాజకీయా లతో ఎలాంటి సంబంధం లేకపోయి నప్పటికీ ఆ కుటుంబాలకు చెందిన నేరానికి వారి పౌరహక్కులను ప్రభుత్వం అణచివేస్తున్నది. అమాయకులను శిక్షిస్తున్నది.

ఖమ్మం జిల్లా భద్రాచలం వద్ద ఉన్న సారపాక గ్రామంలో రైతు-కూలీ సంఘం కార్యకర్త వెంకటరత్నం పోలీసు నిర్బంధం వల్ల రహస్య జీవితం గడుపుతు న్నాడు. అతని భార్య రమణ ముగ్గురు పిల్లలతో, చిన్న కూరగాయల దుకాణం పెట్టుకుని, పేదరికంలో మగ్గుతూ, అతి కష్టంమీద జీవితం గడుపుతూ వుంది. భర్త ఆచూకీ తెలుపమంటూ ఆమెను పోలీసు స్టేషన్‌లో నిర్బంధించి సామూహిక అత్యాచారం జరిపి, చిత్ర హింసలు పెట్టారు. మే 28న రమణను, ఆమె 11 నెలల పాప వెన్నెలను చంపి, పురుగుల మందు పోసి, ఆత్మహత్యగా చిత్రిక రించారు. ఈ విషాదం ఇంతటితో ముగియలేదు. పోలీసుల దుర్మార్గం నుండి బయట పడ్డతన మిగిలిన ఇద్దరు పిల్లల్ని చూసేందుకు వస్తున్న వెంకటరత్నాన్ని మార్గ మధ్యంలోనే పోలీసులు అరెస్టు చేసి, 3 రోజులు చిత్రహింసలు పెట్టి, ఆగస్టు 2న ఎన్‌కౌంటర్ పేరిట కాల్చి చంపారు.

గత 3 నెలల కాలంలో వరంగల్, ఖమ్మం, కరీంనగర్, మెదక్, ఆదిలాబాద్ మొ|| ప్రాంతాలలో బి.ఎస్.ఎఫ్, సి. ఆర్.పి., తదితర ప్యారామిలటరీ బలగాలు వందలాది గ్రామాలపై దాడులు చేసాయి. వీరి ఆర్భాటం చూసి తీరాల్సి ందే! బస్సులు, లారీలు, జీపులలో, ఎక్కుపెట్టబడ్డ తుపాకులతో, ఒకే దఫా 5,6, వందల మంది సాయుధ బలగాలు రోడ్డుపై ప్రయాణించే దృశ్యాలకు ప్రజలు మెల్లిమెల్లిగా అలవాటు పడుతున్నారు.

రాత్రికిరాత్రి తి సాయుధ పోలీ సులు గ్రామాలను చుట్టువుట్టి ఊర్లోవున్న జనాన్ని ఒక దగ్గరకి చేర్చి విచక్షణా రహితంగా విపరీతంగా కొట్టడం అన్నలకు వ్యతిరే కంగా నినాదాలు ఇప్పించడం, ముందుగా తయారు చేసుకున్న లిస్టుల ప్రకారం యువకుల్ని అరెస్టు చేసి పట్టుకుపోవడం సర్వసాధారణం అయింది. ఇటీవల కరీంనగర్ జిల్లాలో ఈ దాడులలో కిష్టంపేటలో లక్ష్మి, రంగంపేటలో ఏడు నెలల గర్భవతి, తడగొండలో హెూటల్ శంకరమ్మ, సింగారంలో రాజమణి తీవ్రంగా గాయపడ్డారు. ఈ స్త్రీలంతా ప్రజా పోరాటాలు సాగుతున్న ప్రాంతాల్లో నివసిస్తూ వున్నవారు తప్పితే ఉద్యమాల్లో కార్యకర్తలు కారు. ప్యారా మిలటరీ బలగాలు అడుగిడిన ప్రతిచోటా సాధారణ ప్రజాజీవనం చిన్నాభిన్నం కావడం, స్త్రీలపై లైంగిక అత్యాచారాలు పెచ్చుపెరగటం అనుభవంలో వున్న విషయమే. గ్రామాలలో నిర్బంధం కారణంగా సంపాదించే మగవాళ్ళు యువకులు ఇళ్ళు వదిలిపెట్టి పారిపోవడం పెద్ద ఎత్తున జరుగుతూ వున్నది. దీనితో కుటుంబాలని పోషించాల్సిన భారం అంతా స్త్రీలు ఒక్కరే మోయాల్సి రావడం, పోలీసు వేధింపుల కారణంగా తీవ్రమైన అభద్రతా భావం, నిత్యం ఆందోళన స్త్రీలలో చోటు చేసుకుం టున్నాయి. పట్నాలలో చదువు కుంటున్న విద్యార్థులు గత 4,5 మాసాలుగా తమ పల్లెలకు తిరిగి వెళ్ళలేకపోయారు. ఊళ్ళలో స్కూళ్ళు నడవడం లేదు. చాలా గ్రామాలలో ఎటూపోయే దారిలేక మిగిలిపోయిన స్త్రీలు పోలీసులు ఏమిచేస్తారో అన్న భయంతో రాత్రంతా అందరూ గుంపుగా ఒకే దగ్గర కూర్చుని, ప్రాణాలరచేత పెట్టుకుని జాగరణలు చేస్తున్నారు.

ఖమ్మం జిల్లా మణుగూరు వద్దగల వెంకటాపురం గ్రామంలో ఇటీవల స్పెషల్ పోలీసులు జీపులో వచ్చి, మంచినీళ్ళు కావాలని అడగ్గా, నీళ్ళు తెచ్చి పోస్తున్న ఇద్దరు యువతులను చేతులు బట్టి బయటకు లాగి, చీకటి గుడిసెలోకి లాక్కుపోయి, అత్యాచారానికై ప్రయత్నించారు. ఆ యువతుల అరుపులు విని ఊర్లోవున్న జనం పరిగెత్తుకు రాగా, పోలీసులు వెళ్ళి పోయారు.

మణుగూరులో పారిశ్రామిక భద్రతాదళాలకు చెందిన సాయుధ పోలీసులు, రాత్రి బహిర్భూమికి వెళ్ళిన విజయలక్ష్మిని, ఎత్తుకువెళ్ళి సామూ హిక అత్యాచారం జరిపి, చిత్రహింసలు పెట్టి చంపారు. మహబూబ్‌నగర్ జిల్లా వెల్తూరు గ్రామంలో 40 సం||

స్త్రీని, నిజామాబాద్ జిల్లా గంగాధరలో ఒక యువతిని, క్యాంపు పోలీసులు రేప్ చేశారు. ఇటీవల నిజామాబాద్ జిల్లాలో స్కూటర్‌పై వెడుతున్న వాళ్ళని అనుమానంతో కాల్చి చంపారు. ఈ ఘటనలో ఇద్దరు స్త్రీలు మరణించారు. ఈ హత్యకు 'లెజిటిమసీ' ని కల్పించే పేరిట చాలా సహజంగానే పోలీసులు ఎప్పుడు అల్లే కట్టుకథని "ఆస్త్రీలు వ్యభిచారులు" అనే కథని ప్రచారం చేశారు.

నక్సలైట్లకు అన్నాలు పెడుతున్నారనే వంకతో పోలీసుల చేతులలో తన్నులు తిన్న స్త్రీల లెక్కేలేదు. స్త్రీలపై కుటుంబంలోపల సాగుతున్న హింసలను, పౌరప్రాథమిక హక్కుల అణచివేతను పౌరహక్కుల సంఘాలు ఇప్పుడిప్పుడే వెలుగులోకి తెస్తూ వున్నాయి. కుటుంబాల వెలుపల జరుగుతున్న హింసలను, మరీ ముఖ్యంగా స్త్రీలపైన, మహిళా ఉద్యమాలపైన సాగుతున్న రాజ్యహింసను ఈ సంఘాలు మరింతగా వెలుగులోకి తీసుకురావాల్సిన అవసరం నేడు ఎంతైనా వుంది. ఈ వ్యవస్థ స్త్రీలు ఎలా వుండాలో నిర్దేశించే ఒక మూసను (మోడల్) మన ముందు ఉంచుతు వుంది. దీని నుండి బయటకు వచ్చే స్త్రీల ఎడల, స్వేచ్ఛా, హక్కులను కోరే, పోరాడే స్త్రీల ఎడల పెద్ద ఎత్తున దుష్ప్రచారం సాగుతుంది.

గ్రామాలలో పోరాడుతున్న స్త్రీలు - వట్టి 'ఆడవాళ్ళు' 'కల్చర్డ్', ఇంటలెక్చువల్, ఎలైట్ కాని, చదువు సంధ్యలు లేని మట్టికాళ్ళు, బండచేతుల కూలివాళ్ళు. పైగా మాల, మాదిగ, 'అలగా' స్త్రీలు. దళితులు! ఇలాంటి వాళ్ళు వేలమంది తెలంగాణా పల్లెలలో కదలటం చేస్తే, ఏలిన వారికి, వారు నమ్మిన బంట్లయిన 'కల్చర్డ్' ఐపిఎస్ అధికారులకు, అగ్రకుల భూస్వామ్య శక్తులకు కంపరంగానూ, కలవరంగానూ వుండటం సహజమే! ఇది తమ వర్గంపై జరుగుతున్న దాడినే గాక తమ పురుషాధిక్యతపై జరుగుతున్న దాడిగా కూడా పరిగణిస్తున్నారు.

కరీంనగర్‌లో పర్మిషన్‌కోసం వెళ్ళిన మహిళా సంఘం కార్యకర్తలను ఒక ఐపిఎస్ అధికారి కోపంతో పళ్ళు కొరుకుతూ "మా ఇళ్ళముందు సాన్పులు (కళ్ళాపి) జల్లే మాల మాదిగ ముండలు, బరితెగించి, మా కళ్ళ ముందే జెండాలు పట్టి జులూసులు (ఊరేగింపు) దీస్తుంటే వూరుకునేటోళ్ళం కాము" అని హెచ్చరించాడు.

నిజామాబాద్ జిల్లాలో బిక్కనూరు ఎస్.ఐ. సోమశేఖర్ ప్రత్యేకంగా పత్రికా విలేఖరుల సమావేశం పెట్టి మహిళా సంఘంలో పనిచేస్తున్న వాళ్ళంతా మొగుళ్ళు వదిలేసిన వారనీ, వ్యభిచారులు, తాగుబోతులనీ ప్రకటనలిచ్చాడు. రేప్ చేస్తామని బెదిరించడం, లైంగికంగా వేధించడం, బట్టలు విప్పడం, బూతులు తిట్టడం, మర్మావయవాలపై కొట్టడం, స్త్రీలపై అమలు జరుపుతున్న హింసలోనూ పచ్చి పురుషదురహంకారం వుంది.

ఆంధ్ర రాష్ట్రంలో నేడు పితృస్వామ్యం, జెండర్, స్త్రీల లైంగిక స్వేచ్ఛ, స్త్రీల చరిత్ర, స్త్రీల దృష్టికోణం.... మొదలైన అంశాలపై చెప్పుకోదగిన చర్చ సాగుతూ వుంది. దీనితోపాటు, నిజానికి గ్రహించాల్సిన మరో విషయం స్త్రీలు పోరాడుతున్నారు. అవి ఆర్థిక పోరాటాలు కానివ్వండి, పాక్షిక సమస్యలపై సాగిస్తున్న పోరాటాలు కానివ్వండి, స్త్రీలు వంటగదులను, కుటుంబం నాలుగు గోడలను దాటి వేసే ప్రతి ఒక్క అడుగు పితృస్వామ్యానికి వ్యతిరేకంగా ఆచరణలో పోరాడందే సాధ్యం కాదు. స్త్రీల ఆచరణాత్మక అనుభవాలను, విజయాలను పరిశీలించాల్సిన, పరిగణలోకి తీసుకోవాల్సిన అవసరం వుంది.

పితృస్వామిక నిర్మాణాలకు, కుటుంబ వ్యవస్థ రద్దు కోసం, పురుషాధిపత్య విలువలు, సంస్కృతికి వ్యతిరేకంగా మార్పు హఠాత్తుగా పుట్టుకురాదనీ, రోజువారీ జీవితంలోనూ, పోరాటాలలోనూ ఎంతో చైతన్యంతో ఈ కృషిని సాగించాల్సి వుంటుందనీ, పోరాట ప్రాంతాలలో స్త్రీలు తమ స్వంత అనుభవం ద్వారా నేర్చుకుంటున్నారు. ఆచరిస్తున్నారు. అంతే కాదు. స్త్రీలు, పురుషులు ఇరువురూ సమానులేనన్న ప్రజాస్వామిక దృక్పథం ప్రజలలో ప్రధానంగా ప్రజా పోరాటాలు కొనసాగుతున్న ప్రాంతాలలో మెల్లిమెల్లిగా చోటు చేసుకుంటూ వుంది. ఇలాంటి ప్రాంతాలలో స్త్రీలు తమ ప్రత్యేక సమస్యలపైన, పితృస్వామిక అణిచివేతకు వ్యతిరేకంగా సాగించే పోరాటాలకు ప్రజల మద్దతు కూడా లభిస్తోంది. స్త్రీల పోరాటాలు నిజానికి ఏదో ఒక మేరకు ఈ ప్రాంతాలలో విజయవంతం కాగలుగుతున్నాయి.

స్త్రీలు రాజ్యాంగంలో పేర్కొన్న ప్రాథమిక హక్కులను, జీవించే హక్కును కోరడం, సాంఘిక, ఆర్థిక, రాజకీయ రంగాలలో సమానత్వం కావాలనడం నేరం అవుతుందా? తమపై రకరకాల రూపాలలో అణచివేతను, అత్యాచారాలను సాగిస్తున్న నేరస్తులను, ఈ ప్రభుత్వం శిక్షించక పోవడమే కాకుండా, బాధితులైన స్త్రీలనే నేరస్తులను చేసి నిలబెడుతున్న దురన్యాయాన్ని ప్రశ్నించడం తప్పవుతుందా?

తమను తాము రక్షించుకునేందుకు తమ ఆత్మగౌరవం కోసం, స్వేచ్ఛ కోసం స్త్రీలు ఉద్యమించడం తప్పెలా అవుతుందని ఇవ్వాళ స్త్రీలు నిలదీస్తున్నారు. కుటుంబ హింస, రాజ్య హింస చెట్టాపట్టా వేసుకుని స్త్రీలపై అణిచివేతను కొనసాగిస్తున్నప్పుడు ప్రతిఘటన స్త్రీల హక్కు కాదాఅని అడుగుతూ వున్నారు.

కన్నీళ్ళను కత్తులుగా మలచుకున్న స్త్రీలు మానవులుగా జీవించేందుకై ఈ రోజు చావు బతుకుల సంకుల సమరం సాగిస్తున్నారు. స్త్రీలు ఈ పాశవిక నిర్బంధాన్ని తట్టుకోగలరా? అందరి హృదయాల్లోనూ మెదులుతున్న ఈ ప్రశ్నకు గోగుబెల్లి లక్ష్మి మాటలే సమాధానం. "నాకు 14 ఏళ్ళ వయసుల పెండ్లి జేసిన్రు. మగడు, సంసారం అంటే ఏందో తెల్వక ముందే ఇద్దరు పిల్లలు పుట్టుకొచ్చిన్రు. నా బతుకు నిప్పుల్ల బడ్డది. మగడు ఒక్క పని చేయడు. తాగొచ్చి తంతడు. బూతులు తిడతడు. నాపెయి మీన దెబ్బలు లేని జాగ లేదు. నేను దినాం, రాత్రి గొడ్డు తిరుగ కాయకష్టం జేస్తేనే నా సంసారం ఎల్లద్ది. దినాం నా అసుంటి ఆడోల్లు ఇండ్లల్ల పోలీసు దెబ్బలు తినీ, తినీ, మొండికి బడ్డరు. దీని గురించి మాట్లాడెటోడే వుండడు మల్ల. బయట పోరాటం జేసిన గియ్యే తన్నుడు గుద్దుడాయె. బయటనైతే జర మన గురించి మొత్తుకునేటందుకు పౌర అక్కులోల్లన్న వున్నరు...."

స్త్రీలకు నిర్బంధం, అణిచివేత కొత్త కావు. పితృస్వామ్యానికీ, దోపిడీ వర్గ వ్యవస్థకు వ్యతిరేకంగా స్వేచ్ఛ కోసం, సమానత్వం కోసం, నూతన సమాజం కోసం పోరాడుతున్న స్త్రీలు ఈ వ్యవస్థీకృత రాజ్యహింసను కూడా ప్రతిఘటించి తీరుతారు.

**- విమల**

# స్త్రీలకు అక్కరకు రాని చట్టాలు

ఈనాటి స్త్రీలు ఎదుర్కొంటున్న సమస్యలు గతంలో బహుశ ఏ సమాజం లోని స్త్రీలు ఎదుర్కొని ఉండరనుకుంటాను. అనేక మానసిక, శారీరక ఒత్తిడుల మధ్య ఈనాడు స్త్రీ బతుకుతోంది. కుటుంబంలోను, సమాజంలోను ఆమె ఎన్నో అవమానాలకు అత్యాచారాలకు గురవుతోంది. వరకట్న హత్యలు, లైంగిక అత్యాచారాలు ప్రమాదకర స్థాయిలో పెరిగిపోయి స్త్రీల బతుకులు పసిమొగ్గలుగానే బుగ్గయి పోతున్నాయి. మారుతున్న పరిస్థితుల్లో మారని పురుషుడి దృక్పథం ఆమెని తీవ్ర మానసిక వేదనకి, శారీరక హింసకి గురిచేస్తోంది. యాంత్రికమైన ఇంటి చాకిరీకే ఆమె శరీరంలోని శక్తంతా హరించుకుపోతోంది. బయట పని చేస్తున్న స్త్రీలు ఇంటా, బయటా చాకిరితో సతమతమవుతున్నారు. అసంఘటిత రంగంలో శ్రమిస్తున్న లక్షలాది స్త్రీలు ఎలాంటి రక్షణలు లేకుండా, కనీస సౌకర్యాలకు నోచుకోకుండా బతుకుతున్నారు. అయితే స్త్రీలకి సంబంధించి చట్టాల్లేవా? వారనుభవిస్తున్న వివక్షతకి అంతం లేదా? ఆమెను రక్షించడానికి ప్రభుత్వం ఏమీ చేయదా? అసలు స్త్రీల కోసం ఏమేం చట్టాలు అమలులో ఉన్నాయి? అనే ప్రశ్నలు ముందుకు రావడం సహజం.

నిజానికి భారత దేశంలో స్త్రీలకి సంబంధించి ఎన్నో చట్టాలు చేయబడ్డాయి. భారత రాజ్యాంగంలోని ఆర్టికల్స్ 14,15,16 ప్రకారం చట్టం ముందు అందరూ సమానులే. వర్ణ, వర్గ, లింగ వివక్షతలుండరాదు. అన్నింట్లోను అందరికి సమాన అవకాశాలుండాలి. ఈ ఆర్టికల్స్ ప్రకారం భారత రాజ్యాంగం స్త్రీలకు సమాజంలోని అన్ని రంగాల్లోనూ సమానత్వాన్ని ప్రసాదించింది. ఇండియన్ పీనల్ కోడ్, క్రిమినల్ ప్రొసీజర్ కోడ్‌లలోని ఎన్నో సెక్షన్లు స్త్రీలకు అనేక రక్షణలు కల్పిస్తున్నాయి. సమాన పనికి సమాన వేతనం బాలికలకు పధ్నాలుగేళ్ళ వరకు నిర్బంధ విద్య, గర్భిణీ స్త్రీలకు పనిచేసే చోట పూర్తి రక్షణ, ఒకటేమిటి. ఎన్నో చట్టాలు.

అయితే ఇక సమస్య ఏమిటి? ఆడవాళ్ళని ఆదుకోవడానికి యిన్ని చట్టాలుండగా, చట్టపరమైన ఎన్నో హక్కులుండగా, వారి స్థితి ఎక్కడ వేసిన గొంగళి అక్కడే అన్నట్టుగా ఎందుకుంది? రాజ్యాంగం అమలులోకి వచ్చి ఇన్ని సంవత్సరాలు గడిచిపోయినా ఆడవాళ్ళ పరిస్థితిలోగాని, సాంఘిక హోదాలోగాని చెప్పుకోదగిన మార్పు ఎందుకు రాలేదు? అనే ప్రశ్న వేసుకోక తప్పదు. ఆడవాళ్ళ కోసం తయారు చేయబడిన అసంఖ్యాకమైన చట్టాలను అమలు చేసి ఉంటే మనకున్న చట్టాలేమిటి? అని ప్రస్తుతం చర్చించుకోవాల్సిన అవసరమే ఉండేది కాదు. పైపైన చూస్తే ఈ దేశంలో ఆడవాళ్ళ కోసం ఎన్నో చట్టాలున్నట్టు అన్పిస్తూ ఉంటుంది. కానీ లోతుగా తరచి చూస్తే ఈ చట్టాలన్నీ కాగితం పులులని, ఒట్టిగా భయపెట్టడానిక్కూడా అవి పనికి రావని అర్థం అవుతుంది.

ఉదాహరణకి భారత రాజ్యాంగం స్త్రీలకి ప్రసాదించిన స్వేచ్ఛ, సమానత్వం లాంటి హక్కులనే తీసుకుందాం. సమానత్వం, స్వేచ్ఛలను ప్రసాదించిన రాజ్యాంగమే ఆర్టికల్ 25 ద్వారా మత స్వేచ్ఛను కూడా ప్రసాదించింది. ప్రతి పౌరుడు తనకిష్టమైన మతాన్ని స్వీకరించవచ్చు. ప్రచారం చేసుకోవచ్చు. ప్రజల మత విశ్వాసాల్లో ప్రభుత్వం తల దూర్చవద్దు. జోక్యం చేసుకోరా. రాజ్యాంగంలోని ఈ ఒక్క ఆర్టికల్ చాలు స్త్రీల హక్కులను కాలరాచి వేయడానికి. స్త్రీలని మత పరంగా విడదీసి, మతాచారాలను, సాంప్రదాయాలను చట్టాలుగా మార్చి ఆడవాళ్ళని అణిచి వేయడానికి ఈ ఒక్క ఆర్టికల్ చాలు. రాజ్యాంగం 14, 15, 16 ఆర్టికల్స్ ద్వారా గ్యారంటీ చేసిన సమానత్వం ఈ ఆర్టికల్‌తో గాలికి కొట్టుకుపోయింది.

ఈ దేశంలో కొంతమంది స్త్రీలకి వారసత్వపు హక్కు లేదు. కుటుంబంలో సమానత్వం లేదు. కొందరికి భరణం పొందే హక్కు లేదు. కొందరికి భర్త నాలుగేసి పెళ్ళిళ్ళు చేసుకుని బయటకు గెంటేసినా ప్రశ్నించే హక్కు లేదు. రాజ్యాంగం సమానత్వం గురించి ఘనంగా చెప్పినప్పటికి సమానత్వం ఎక్కడుంది? హిందువులకు హిందూ లా, ముస్లిమ్‌లకు ముస్లిమ్ లా, క్రైస్తవులకు క్రిష్టియన్ లా. ఇలా మత ప్రాతిపదిక మీద చట్టాలేర్పడి స్త్రీల జీవితాలను శాసిస్తున్నాయ్. స్త్రీలకి అత్యంత ప్రధానమైన చోట, అంటే కుటుంబంలో అసమానతలు కొనసాగడానికి వ్యక్తిగత చట్టాలు పకడ్బందీగా తయారైనాయి. మతం ఆడవాళ్ళని నోరుమూసుకుని, కష్టాలు భరిస్తూ ఇంటికి అంకితం కమ్మని శాసిస్తోంది. కుటుంబానికి మగవాడే యజమాని అని మతం చెబుతుంది. దీనిని చట్టాలు కూడా సమర్థిస్తున్నాయ్.

వందలాది సంవత్సరాల పూర్వం మనువు రాసిన రాతలే నేడు హిందూ 'లా'లో సాక్షాత్కరిస్తున్నాయి. మను ధర్మం మీద ఆధారపడే మన చట్టాలు తయారైనాయి. స్త్రీలు స్వతంత్రంగా బతకడానికి వీలు లేదని, బాల్యంలో తండ్రి, యవ్వనంలో భర్త, వృద్ధాప్యంలో కొడుకుల నీడలో బతకాలని మనువు నిర్దేశించాడు. అలాగే ఉత్తమ ఇల్లాలు ఎలా ఉండాలో కూడా చెప్పాడు. భర్త దుష్టుడైనా, దుర్మార్గుడైనా, తాగుబోతైనా, వ్యభిచారైనా పరమ నీచుడైనాగాని భార్య భర్తని దైవంగా పూజించాలని, అతని పాద సేవ చేయాలని, పాతివ్రత్య ధర్మాలని తూ.చ. తప్పకూడదని మనువు శాసించాడు. అయితే మనువు ఏనాడో చెప్పిన ధర్మసూత్రాలివప్పుడెందుకు? అయన ఏం రాసుకుంటే మనకెందుకు? అని ఎవరైనా ప్రశ్నించవచ్చు. కానీ అక్కడే ఉంది కిటుకంతా. ఏనాడో మనువు చెప్పిన నీతులు, అతని భావాలు ఈనాటికీ చట్టాల ద్వారా, కోర్టు ద్వారా ప్రచారం అవుతూనే ఉన్నాయి. ఆ భావాల ప్రభావం సమాజం నిండా విస్తరించి ఉంది. అలాగే మిగిలిన మతాల వారి మీద అయా

మతాధిపతుల, మత గ్రంథాల ప్రభావం అపారంగానూ, చెక్కు చెదరకుండానూ ఉంది. ఆ ప్రభావమే చట్టాల్లోనూ ప్రతిఫలిస్తోంది. అందువల్లనే భారత రాజ్యాంగం గ్యారంటీ చేసిన సమానత్వం వ్యక్తిగత చట్టాల్లో కొట్టుకు పోయింది. ఈ వ్యక్తిగత చట్టాలను అడ్డం పెట్టుకుని రాజకీయ నాయకులు గొప్ప సెక్యులర్ ఫోజులు కొడుతూంటారు. "మీకు సమానత్వం ఇస్తున్నాం. కానీ మీ మతాలు ఇంకోలా చెబితే మేమేం చేయలేం. ఇతరుల మత విశ్వాసాల్లో మేం జోక్యం చేసుకోం. మేం అన్ని మతాలను సమానంగా గౌరవిస్తాం" అని రాజకీయ నాయకులు చేతులెత్తేస్తుంటారు.

మతాలన్నీ స్త్రీలని అణిచివేసే స్వభావాన్నే కలిగి ఉన్నాయి. హిందూ మతం స్త్రీలని మనుషులుగా కాక శృంగార వస్తువుగా, మగాడి అవసరాలు తీర్చే బొమ్మగాను, పిల్లల్ని కనే యంత్రంగాను చిత్రించింది. ఈ నమూనా స్త్రీని ఉమ్మడి కుటుంబాల్లో బంధించి గాలి వెలుతురూ కూడా అందకుండా, అందమైన అబద్ధాలను, ఆకర్షణీయమైన భావ జాలాన్ని ఆమె చుట్టూ అల్లి, ఆచారాలు, సంప్రదాయాలు, కట్టుబాట్లను ఆమెకి సంకెళ్ళుగా వేసి అణిచివేసింది. ఆడవాళ్ళని పశువులతో పోల్చిన ఘనత హిందూ గ్రంథాలదే. ఇస్లామ్ మతం కుటుంబంలో మగాడే యజమానని, ఆడది అతనికి అణిగి మణిగి ఉండాలని, విధేయత చూపని ఆడవాళ్ళని కొట్టి దారికి తీసుకు రావాలని బోధిస్తోంది. స్త్రీల విషయంలో మతాలన్నీ అమానుషంగానే ప్రవర్తించాయి.

అయితే ఇలాంటి ప్రతికూల పరిస్థితుల్లో కొందరు సంస్కరణవాదులు ముందుకొచ్చి ఆడవాళ్ళకు జరుగుతున్న అన్యాయాలను, అక్రమాలను ప్రశ్నించడం జరిగింది. ముక్కుపచ్చలారని పసికందులను అరవై ఏళ్ళ ముసలాడికి కట్టబెట్టి, వాడు కాస్తా గుటుక్కుమనగానే, ఆ పసిదాన్ని అందవికారంగా తయారుచేసి జీవితాంతం జీతంలేని పనిమనిషిగా ఉపయోగించుకున్న ఘనత హిందూ సంస్కృతిదే. ఎందరో సంస్కరణవాదులు ఛాందస మతవాదుల నుండి తీవ్రమైన వ్యతిరేకత నెదుర్కొని, అన్ని అడ్డంకులను దాటుకుని విధవా పునర్వివాహ చట్టం తీసుకు రాబడింది. 1856లో ఈ చట్టం చేయబడినప్పటికిని, ఆధునిక కాలంలో కూడా వితంతు వివాహాలు జరగడం అసాధ్యంగానే ఉంది. భర్త చనిపోయిన మూడు నెలల్లో తిరిగి వివాహం చేసుకుని ఎలాంటి చీకూ, చింతా లేకుండా మగవాడు బ్రతకగలుగుతున్నాడు. కానీ పునర్వివాహం చేసుకోవాలంటే ఆడది మాత్రం ఎంతో ప్రతిఘటనను ఎదుర్కోవలసి వస్తోంది. భార్య పోయిన మగాడి మీద సమాజం సానుభూతి వర్షం కురిపిస్తుంది. అదే ఆడదాని విషయం వచ్చేసరికి కనీస మానవత్వాన్ని కూడా వదిలేసి చాలా అమానుషంగా ప్రవర్తిస్తుంది. పునర్వివాహ చట్టం వల్ల స్త్రీలకి ఒరిగిందేమీ లేదు. 1829లో సతి నిషేధ చట్టం వచ్చింది. స్త్రీని ప్రాణాలతో నిలువుగా కాల్చేసే ఈ ఆచారం ఎంత ఘోరమైందో వేరే చెప్పక్కరలేదు. ఈనాడు ఈ ఆచారం చాలావరకు తగ్గిపోయినాగాని, నిన్న కాక మొన్న జరిగిన రూప్ కన్వార్ హత్య గుండెల్లో గాయంలాగా బాధపెడుతుంది. సతిని నిషేధిస్తూ కొత్త చట్టం అమల్లోకి వచ్చినప్పటికిని మతవాదులు సతిని కొనసాగించడానికి ప్రయత్నాలు చేస్తూనే ఉన్నారు. ఆడవాళ్ళు సతిని ఆచరించాలని శంకరాచార్యలాంటి మత వాదులు ప్రబోధిస్తున్నారు. బెడ్ రూమ్ స్టోరీ అనే చలనచిత్రంలో సతీమాత భస్మాన్ని ఉపయోగించి దయ్యాన్ని అదృశ్యం చేసినట్టు చూపించి సతిని ప్రోత్సహించారు. దీనిని బట్టి సతి నిషేధ చట్టం అమలు చేయడంలో ఎంత నిజాయితీ ఉందో అర్థం అవుతుంది.

1956లో వచ్చిన వ్యభిచార నిరోధక చట్టం సంగతి చూద్దాం. ఈ చట్టం వ్యభిచారాన్ని నిరోధించడానికి చేయబడింది కాదు. దీని ప్రకారం వ్యభిచారం చేయడం నేరం పట్టుబడితే శిక్షపడేది ఆడదానికే గానీ అందులో పాలు పంచుకున్న మగాడికి ఏ శిక్షా లేదు. అతడు తేలికగా తప్పించుకోగలడు. పోలీసులకు చిక్కిన ఆడవాళ్ళు జుల్మానా కట్టుకోవాలి. లేదా వీరిని బలవంతంగా నారీ నికేతనాల్లో బంధిస్తారు. గతి లేక, వేరే దారిలేక వ్యభిచార గృహాలకు అమ్మివేయబడిన స్త్రీలు పోలీసుల వలలో చిక్కి ఈ నారీ నికేతనాల్లో దుర్భర పరిస్థితుల్లో, అమానుషంగా బతుకుతున్నారు. నేరానికి బాధ్యుడైన మగాడు మాత్రం దర్జాగా తిరుగుతుంటాడు. వేశ్యావృత్తిలో బతుకుతున్న స్త్రీలకు వివిధ వృత్తుల్లో శిక్షణ నిచ్చి, పునరావాసం కల్పించే పనిని ప్రభుత్వం చేపట్టాలి. అంతేగాని వారిని శిక్షించి, ఫైనులు కట్టించుకోవడం వల్ల నారీ నికేతనాల్లో బంధించడం వల్ల ఈ స్త్రీలకు ఒరిగేదేమీ ఉండదు.

స్త్రీల మీద జరిగే దాడుల్లో అత్యంత పాశవికమైంది రేప్. ఆమె మీద దాడి జరిపి లైంగిక అత్యాచారం జరిపే పురుషుడు ఇండియన్ పీనల్ కోడ్‌లోని సెక్షను 375 కింద శిక్షార్హుడవుతాడు. ఈ సెక్షన్ కింద అత్యాచారం జరపడం నేరమే. ఎపుడు? అది రుజువైనపుడు. నాలుగు గోడల మధ్య, నిశ్శబ్ద, నిర్మానుష్య ప్రదేశాల్లో జరిగే రాక్షస కార్యానికి రుజువులు ఎలా దొరుకుతాయి? అత్యాచారానికి గురైన స్త్రీ తాను అందుకు సమ్మతించలేదు. అని రుజువు చేసుకోవాలి. ఈ సందర్భంగా 1972 లో మహారాష్ట్రలో జరిగిన మధుర కేసు తీసుకుందాం. పోలీస్ స్టేషన్‌లో గణపతి, తుకారాం అనే కానిస్టేబుళ్ళు మధురపై అత్యాచారం జరిపారు. ఈ కేసు సెషన్స్ కోర్టులో విచారించినపుడు మధుర అబద్ధాల కోరు అని, పోలీసులు అమాయకులని తీర్పు వచ్చింది. అత్యాచారం జరిగినపుడు ప్రతిఘటించినట్టు సాక్ష్యాలు లేవు కాబట్టి రేప్ జరగలేదనీ సెషన్స్ కోర్టు తీర్పునిచ్చింది. బొంబాయి హైకోర్టు మాత్రం ఈ తీర్పును కొట్టివేసింది. సుప్రీమ్ కోర్టుకు వెళ్ళినపుడు ఈ కేసులో ఘోరమైన తీర్పు వెలువడి ఇద్దరు పోలీసులు అమాయకులని వదిలివేసింది. మధుర వంటి మీద గాయాలేవీ లేవు కాబట్టి జరిగిన అత్యాచారం ఆమె అనుమతితోనే జరిగిందని, కాబట్టి అది రేప్ కాదని సుప్రీమ్ కోర్టు తీర్పు చెప్పింది. ఈ తీర్పు మీద దేశవ్యాప్తంగా మహిళా

సంఘాలు తీవ్రంగా స్పందించాయి. ఈ తీర్పుని వ్యతిరేకించాయి. మహిళా సంఘాల ఉద్యమం కారణంగా 1983 లో ఇండియన్ ఎవిడెన్స్ ఏక్ట్‌కు ఒక సవరణ వచ్చింది. దాని ప్రకారం ఒక స్త్రీ తాను "అత్యాచారానికి గురయ్యాను అని కోర్టులో చెబితే అది నిజమని కోర్టులు నమ్మాలి" ఆమె అలా చెప్పడమే ఆమె అనుమతినివ్వలేదని స్పష్టం చేస్తుందని దానిని కోర్టులు నమ్మతీరాలని ఈ సవరణ పేర్కొంది. ఈ సవరణ గుడ్డిలో మెల్లలాగా కొంత మేలు అనే చెప్పాలి.

అలాగే అత్యాచారానికి గురైన ఆడదాని శీలం గురించి వ్యాఖ్యానించి, ఆ శీలం లేకపోతే రేప్ జరిగినా ఫర్వాలేదు అనే తీర్పు టర్కీలో వెలువడింది. వ్యభిచారిపైన అత్యాచారం జరిగినపుడు తక్కువ స్థాయి శిక్షను సంసార పక్షం స్త్రీల మీద అత్యాచారం జరిగినపుడు ఎక్కువ స్థాయి శిక్షను విధించవచ్చని ఆ తీర్పు సారాంశం. దీనిమీద టర్కీలో మహిళా సంఘాలు పెద్ద ఎత్తున నిరశన ప్రదర్శనలు జరిపాయి. వ్యభిచారిణులు మనుషులు కారన్న అభిప్రాయం, వారి మీద అత్యాచారం జరిగినా పెద్ద నేరం కాదన్న వాదన టర్కీలోనే కాదు ప్రపంచమంతటా వుంది. మనం పంచమ వేదంగా కీర్తించుకునే మహాభారత గ్రంథంలో ఇదే అభిప్రాయాన్ని కర్ణుడి నోటి వెంట వ్యాసుడు చెప్పించాడు. ద్రౌపది వస్త్రాపహరణ ఘట్టంలో కర్ణుడు ఐదుగురు భర్తలను కల్గి ఉన్న నువ్వు వేశ్యవు. అంతమంది భర్తలను కల్గి ఉన్నావు. దుర్యోధనుడిని కూడా స్వీకరించు. వేశ్యలకు మానాభిమానాలు ఎక్కడి నుండి వస్తాయి" అంటూ ద్రౌపదిని అవమానిస్తాడు. వేశ్యలు మనుషులు కారన్న అభిప్రాయం, వారికి మానాభి మానాలు ఉండవన్న అభిప్రాయం పవిత్ర భారత గ్రంథంలోనే కాదు. మరెన్నో గ్రంథాల్లో ఉంది.

1961 నుండి అమల్లో ఉన్న వరకట్న నిషేధ చట్టం గురించి తప్పక చర్చించాలి. ఈ చట్టానికి ఎన్నో సవరణలు జరిగాయి. ఈ చట్టం ప్రకారం కట్నం ఇవ్వడం, తీసుకోవడం రెండూ నేరమే. వరకట్న దురాచారం ఎన్ని వెర్రితలలు వెయ్యాలోఅన్నీ వేసింది. వరకట్నం కోసం అగ్నికి ఆహుతయిపోతున్న ఆడవాళ్ళ సంఖ్య రోజు రోజుకి పెరిగిపోతోంది. ఈ మధ్య పౌరహక్కుల సంఘం వారు కేవలం విశాఖపట్నం జిల్లాలోనే 83-89 మధ్య 72 మంది వివాహిత యువతులు చనిపోవడం, జరిగిందని ఆ యువతులు చనిపోవడానికి ప్రధాన కారణం భర్తేనని ఒక నివేదికలో పేర్కొన్నారు. కట్నం హత్యలు ఈ మధ్య కాలంలో ఇంతగా పెరిగిపోవడానికి ఎన్నో కారణాలు న్నాయి. సులభంగా డబ్బు సంపాదిం చాలనే కక్కుర్తి, బజారులో అసంఖ్యా కంగా విడుదలవుతున్న విలాస వస్తువులు. వీటిని భార్య ద్వారా రాబట్టాలనే దుర్బుద్ధి ముఖ్య కారణాలు. ఇవే కాకుండా అనుమానం, పిల్లలు లేకపోవడం, కొడుకుని కనలేకపోవడం ఇలా ఎన్నో కారణాలు భార్యలను భర్తల చేత సజీవ దహనం చేయిస్తు న్నాయి. కట్నం హత్యలు ఇంత ఎక్కువగా పెరిగిపోతున్నప్పటికి, ఈ హత్యలు చేసిన నేరస్తులకి శిక్షలు పడటం చాలా తక్కువగా ఉంది. అసలు శిక్షేమి లేకుండానే చాలామంది తప్పించుకుంటున్నారు. వరకట్న సమస్యకి అసలు కారణం స్వంఆస్థి విధానం అమల్లో ఉండడం, ఆడవాళ్ళకి ఆస్థిలో వారసత్వపు హక్కులు లేకపోవడం. అయితే ఈ దేశంలో ఎంతమందికి ఆస్థి ఉంది అనొచ్చు. సాధారణంగా ఈ సమస్య మధ్య తరగతిలోను, ఎగువ మధ్య తరగతిలోను ఎక్కువగా ఉంది. పేదవాళ్ళలో ఈ హత్యలు జరగడం లేదని కాదు. కానీ మధ్య తరగతిలో ఎంతో కొంత ఆస్థిపాస్తులున్న వారుంటారు. పెళ్ళి సమయంలో ఎంతో కొంత కట్నం ఇస్తారు. ఇంకా ఏవేవో ఇస్తామని వాగ్ధానాలు చేస్తారు. వరకట్న నిషేధ చట్టం ఉనికి కూడా ఇక్కడ కనబడదు. ఈ చట్టం వల్ల కట్నం సమస్య ఆవగింజంత కూడా పరిష్కారం కాలేదు.

అయితే పెళ్ళి సమయంలో ఇచ్చే సొమ్మును పెళ్ళి కొడుకుకు, అతని కుటుంబానికి కాక ఆడపిల్లకే ఇస్తే కొంత బావుంటుంది. అంతేకాదు. కొడుకులతో సమానంగా కూతుళ్ళకు ఆస్థిలో సమాన వాటాను ఇస్తే ఈ సమస్య స్వరూపం మారిపోతుంది. ఈ సందర్భంగా ఆంధ్రప్రదేశ్‌లో అమల్లోకి వచ్చిన వారసత్వ సవరణ చట్టం కొంతవరకు ఆహ్వానించదగిందే. ఈ సవరణ ప్రకారం సమిష్టి కుటుంబ ఆస్థిలో, తండ్రి ఆస్థిలో కుమారుడితో సమానంగా పుట్టుకతోనే కూతురికి వాటా యివ్వాలి. ఈ చట్టంలో లోపాలున్నప్పటికి కొడుకులతో సమానంగా, కూతుళ్ళకి ఆస్థిలో హక్కును కల్పించడం అనేది విప్లవాత్మకమైన మార్పే. అయితే కూతురికి వారసత్వంగా లభించిన ఆస్థి మీద భర్తకుగానీ, అత్త మామలకు గానీ హక్కు ఉండరాదు. ఒకవేళ భార్య అనుమానాస్పద పరిస్థితుల్లో మరణించినా, హత్య కావింపబడినా ఆస్థి భర్త చేతుల్లోకి పోయే అవకాశం లేనపుడు ఆమెను హింసించి చంపే పరిస్థితులు చాలావరకు తగ్గుతాయి. ఆమె సహజ మరణం పొందిందనిరూఢీ అయితేనే ఆస్థి భర్తకు చెందుతుంది. లేదంటే ఆమె తల్లి తరఫు వారికి చెందేట్టు ఉండాలి. అపుడే అత్తింట ఆమెకు, ఆమె ప్రాణానికి ప్రమాదం తగ్గుతుంది. కాబట్టి కట్నం పోవాలి. కట్న పిశాచి నశించాలి అంటూ శాపనార్థాలు పెట్టడం కాక దేశవ్యాప్తంగా ఆడపిల్లలకు వారసత్వ హక్కుల కోసం పోరాడాలి. నిజానికి తండ్రి ఆస్థిలో కూతుళ్ళకి సమాన వాటా లభించిననాడు ఈ వరకట్న సమస్య స్వరూపం మారి పోతుంది. అలాగే వరకట్న హత్యలు తగ్గడానికి, ఈ కేసులు త్వరితంగా పరిష్కారం అయ్యేటందుకు కొన్ని చర్యలు తీసుకోవాలి. ఈ కేసులు త్వరగా పరిష్కారం అయ్యేందుకు ప్రత్యేక న్యాయస్థానాలు ఏర్పాటు చేయాల్సిందిగా డిమాండ్ చేయాలి. అలాగే హత్య జరిగిన ప్రదేశానికి వెళ్ళి విచారణ చేయడానికి మొబైల్ న్యాయస్థానాలు ఏర్పాటు చేయాలి. సాక్ష్యాలు తారుమారు అయి పోకుండా వుండడానికి ఇది చాలా ముఖ్యమైంది. ఈ కేసులను త్వరితంగా పరిష్కారం చేయక ఏళ్ళ తరబడి లాగడం వల్ల ఫలితం ఏమీ ఉండదు.

వరకట్న హత్యల కేసులు వారం పదిరోజుల్లో పరిష్కారం అయిపోయి నిందితులకు శిక్షలు పడిననాడు ఈ నేరాలు గణనీయంగా తగ్గిపోతాయి. వరకట్న నిషేధ చట్టం వల్ల ప్రయోజనం శూన్యమే. అయితే పైన పేర్కొన్న చర్యలు తీసుకుంటేనే ఈ సమస్యకి పరిష్కారం దొరుకుతుంది.

ఉమ్మడి సివిల్ చట్టం గురించి ఇపుడు చర్చించుకుందాం. రాజ్యాంగంలోని 14, 15, 16 ఆర్టికల్స్ అందరికి సమానత్వం, స్వేచ్ఛల నిచ్చాయని ఇంతకు ముందే చెప్పుకున్నాం. అయితే వ్యక్తిగత చట్టాలు అమలులో ఉండడం వల్ల పైన చెప్పిన హక్కులు నీరు కారిపోయాయి. మహిళల హక్కులు వ్యక్తిగతమైనవని, అందులో జోక్యం చేసుకునే హక్కు ప్రభుత్వానికి లేదని అన్ని మతాల నాయకులు వాదిస్తున్నారు. షాబానో కేసులో అదే జరిగింది. మతవాదుల వత్తిడివల్ల తీర్పును రద్దు చేయమని సుప్రీమ్ కోర్టును కోరాల్సి వచ్చింది. సుదీర్ఘమైన న్యాయపోరాటం తర్వాత పొందినమనోవర్తి కేవలం 179/- రూపాయలు. ఒక్క ముస్లిం వ్యక్తిగత చట్టాలే కాదు. మన దేశంలో అమలులో ఉన్న ఏ చట్టంలోను మనోవర్తి నిబంధనలు సరిగ్గా లేవు. 1955 లో చేయబడిన హిందూ దత్తత, మనోవర్తి చట్టం కింద హిందూ స్త్రీలకు మనోవర్తి లభిస్తుంది. భర్తా తనూ కలిసి సంపాదించిన మొత్తం ఆస్తిలో మూడో వంతును మనోవర్తిగా అడిగే హక్కు భార్యకు ఉంది. ముస్లిం మహిళలకి పెళ్ళి సమయంలో మెహర్ లభిస్తుంది. అలాగే ఇద్దత్ కాలంలో పోషణ ఖర్చులు లభిస్తాయి.

మరో ముఖ్యమైన విషయం ఏమిటంటే వ్యక్తిగత చట్టాల ప్రకారం మనోవర్తికి సంబంధించిన కేసులన్నీ సివిల్ కేసులే. ఇవి ఏళ్ళ తరబడి కోర్టుల్లో నానడం వల్ల భార్యలకు ఏమీ లభించడం లేదు. అందువల్లనే చాలామంది స్త్రీలు క్రిమినల్ ప్రొసీజర్ కోడ్‌లోని సెక్షన్ 125 కింద కేసు పెడతారు. ఈ సెక్షను కింద అయితే మనోవర్తి కేసు క్రిమినల్ కేసవుతుంది కాబట్టి త్వరగా పరిష్కారం అయ్యే వీలుంది. కాని సెక్షన్ 125 కింద మనోవర్తి పొందడం వల్ల స్త్రీలకు చాలా నష్టం జరుగుతుంది. ఎందుకంటే భర్త లక్షలు సంపాదిస్తున్నాగాని, బోలెడంత ఆస్థి ఉన్నాగాని, ఈ సెక్షను ప్రకారం మనోవర్తి కింద కేవలం రూ|| 500/- మాత్రమే లభిస్తాయి. వ్యక్తిగత చట్టం కింద కేసుపెడితే ఆమెకు ఇంకా ఎక్కువ లభించే వీలుంది. అయితే సంవత్సరాల తరబడి తిరగలేక, డబ్బు ఖర్చు పెట్టే స్థోమత లేక క్రిమినల్ ప్రొసీజర్ కోడ్‌ను ఆశ్రయిస్తున్నారు. దీని కింద అనాథల మని చెప్పుకుని మనోవర్తి తీసుకోవాలి. హక్కుగా పొందవలసిన మనోవర్తిని ఇలా బెదిరింపుగా పొందడం చాలా అవమానకరం. ఈ దుస్థితిని తప్పించి, మనోవర్తిని హక్కుగా ఆలస్యం లేకుండా పొందే అవకాశాన్ని అన్ని మతాల స్త్రీలకు కల్పించవలసి ఉంది. దీనికిగాను ఉమ్మడి సివిల్ కోడ్‌ను రూపొందించాల్సిన అవసరం ఈనాడెంతైనా ఉంది. ఉమ్మడి సివిల్ కోడ్‌ను అన్ని మతాల వారు వ్యతిరేకిస్తున్నారు. మార్పులు, చేర్పులు చేసిన హిందూ వ్యక్తిగత చట్టమే ఉమ్మడి సివిల్ చట్టం అని వీరు భావిస్తున్నారు. ఇది చాలా పొరపాటు అభిప్రాయం. వ్యక్తిగత చట్టాల్లోని మంచినంతటినీ తీసుకుని ఉమ్మడి చట్టాన్ని రూపొందించాలని కొందరి అభిప్రాయం. కానీ స్త్రీ సమానత్వం కోసం వ్యక్తిగత చట్టాల్లోని మంచినంతా పోగుచేసినా గాని సరిపోదు. స్త్రీలకు పూర్తి న్యాయం, సమానత్వం లభించవు. జనాభాలో సగం ఉన్న స్త్రీలందరికి న్యాయం దొరికేలా రూపొందించినపుడు మాత్రమే దీని వల్ల ప్రయోజనం ఉంటుంది. అలాగే ఉమ్మడి చట్టం రూపొందించేటపుడు ప్రభుత్వం వ్యక్తిగత చట్టాలూ ఉంటాయి. ఎవరికి నచ్చిన దాన్ని వారు ఎంచుకునే వీలుండాలి. లేని పక్షంలో మత ఛాందసుల నుండి తీవ్రమైన వ్యతిరేకతని ఎదుర్కోవలసి ఉంటుంది. అసలు ఈ చట్టం రూపకల్పనకే ప్రమాదం వచ్చే వీలుంది. అందుకనే ప్రభుత్వం వ్యక్తిగత చట్టాల జోలికెళ్ళకుండానే ఉమ్మడి సివిల్ కోడ్‌ను రూపొందించాలి. దీనిని రూపొందించడంలోను, దీని వల్ల కలిగే ప్రయోజనాలను ప్రచారం చేయడంలోను మహిళా సంఘాల బాధ్యత ఎంతో ఉంది. ఉమ్మడి సివిల్ కోడ్ ఏర్పడిన నాడు కుటుంబంలో స్త్రీల స్థితి గతులెంతో మెరుగవుతాయి. ఇది స్త్రీలకు వరంలాంటిదని జస్టిస్ కృష్ణయ్యర్ లాంటివారు పేర్కొన్నారు.

ఇటీవల కాలంలో స్త్రీల ఉనికికే ప్రమాదకరంగా తయారైన లింగ నిర్ధారణ పరీక్ష గురించి ప్రస్తావించక తప్పదు. పుట్టబోయే బిడ్డ అవ లక్షణాలను కనుగొని, సరిచేయడానికి ఉపయోగించే ఈ పరీక్షను లింగ నిర్ధారణ కోసం వాడి ఆడపిల్ల పుడుతుందని తెలిస్తే ఆ ఆడపిండాన్ని పుట్టకుండా నిర్మూలించి వేసే ఈ అమానుష కార్యం ఈనాడు దేశవ్యాప్తంగా విచ్చలవిడిగా జరుగుతోంది. అభివృద్ధి చెందుతున్న శాస్త్ర, సాంకేతిక విజ్ఞానం కూడా స్త్రీల పాలిట మృత్యువుగా మారడం ఘోరమైన విషయం. ఈ పరీక్ష ద్వారా వందలాది ఆడపిండాలను పుట్టకుండానే చంపేస్తున్నారు. ఇది ఎంతో శోచనీయమైన విషయం. ఒక్క మహారాష్ట్రలో తప్ప, దేశమంతటా ఈ పరీక్ష జరవబడుతోంది. దీనిమీద మహిళా సంఘాలు ఎంతో పోరాటం చేయాల్సి ఉంది. లింగ నిర్ధారణ పరీక్షలను నిషేధించాల్సిందిగా ప్రభుత్వం మీద వత్తిడి తీసుకు రావాలి. పిండంలో లోపాలను కనుగొనడానికి చేసే పరీక్ష ప్రభుత్వ పర్యవేక్షణ కింద మాత్రమే జరగాలి. అపుడే ఈ దురాచారం తగ్గుముఖం పడుతుంది.

స్త్రీలకు ఉద్యోగాల్లో 30% రిజర్వ్ చేస్తూ ఆంధ్ర ప్రదేశ్‌లో ఒక చట్టం ఉంది. కాని ఈ చట్టంలో అనేక లొసుగులున్నాయి. ఈ చట్టంలో మూడు అంశాలున్నాయి. (1) స్త్రీలు పురుషుల కంటే బాగా పనిచేయగలరు అని భావించే ఉద్యోగాలలో స్త్రీలకు ప్రాధాన్యత నీయాలి. (2) స్త్రీలు, పురుషులు సమానంగా పనిచేయగల ఉద్యోగాల్లో 30% స్త్రీలకు రిజర్వ్ చేయాలి. (3) స్త్రీలు మాత్రమే పనిచేయగల ఉద్యోగాల్లో స్త్రీలను మాత్రమేనియమించాలి. అయితే స్త్రీలు పురుషులకంటే బాగా పనిచేయగల ఉద్యోగాలు ఏవే, స్త్రీలు మాత్రమే పనచేయగల ఉద్యోగాలు ఎలాంటివో మాత్రం ఈ చట్టంలో వివరంగా పేర్కొనడం జరగలేదు. ఈ లొసుగుల

వల్ల ఈ చట్టం అమలు చిదంబర రహస్యంగా ఉంది. అంతేకాకుండా 30 శాతం రిజర్వేషన్ అనేది ఒక్క ప్రభుత్వ ఉద్యోగాలకి మాత్రమే వర్తిస్తుంది. అలా కాకుండా ప్రభుత్వ, ప్రయివేట్ సంస్థలన్నింటిలోను స్త్రీలకి 30% రిజర్వేషన్ సౌకర్యాన్ని కల్పించాలి. అలాగే ఈ రిజర్వేషన్‌లు పకడ్బందిగా అమలు జరిగేటట్టు చర్యలు తీసుకోవడం చాలా అవసరం.

ఈనాడు అమలులో ఉన్న చట్టాల్లో కొన్నయినా స్త్రీలకు మేలు చేసేవి ఉన్నాయి. అయితే వీటి గురించి ఎంతమందికి తెలుసు అనేది ప్రశ్న. చట్టాలనగానే అవేవో కొరుకుడు పడని జటిలమైన పదార్థాల్లాగా వుండి అర్థం కాకుండా భయపెడుతూంటాయి. నూటికి 80% ఆడవాళ్ళు నిరక్షరాస్యులుగా ఉన్న మన దేశంలో ఈ చట్టాలు, అవి కల్పించే రక్షణలు ఎవడికి అర్థం అవుతాయి? ఉన్న చట్టాలనైనా ఉపయోగించుకునే అవగాహన ఎంతమందికుంటుంది? ఈ విషయంలో కూడా మహిళా సంఘాల బాధ్యత ఎంతో ఉంది. చట్టాలు సులభంగా అర్థం అయ్యేట్టు, అందుబాటులో ఉండేట్టు చూడాలి. అంతేకాకుండా వీటిని తెలుగులోకి అనువదించి చిన్న, చిన్న పుస్తకాలుగా ముద్రించి విస్తృతంగా ప్రజల్లోకి తీసుకెళ్ళాలి. తమకోసం చేయబడిన చట్టాల గురించి స్త్రీలలో అవగాహన కలిగించాలి. ఇది చాలా ముఖ్యమైన విధి.

ఇంక కోర్టుల విషయానికి వస్తే ఇవి స్త్రీలకు గగన కుసుమాలే అవుతున్నాయి. తమ పట్ల ఎంత అన్యాయం జరిగినా దౌర్జన్యం జరిగినా గాని మౌనంగా భరించడం తప్ప ఎదిరించడం, న్యాయ సహాయం కోసం ప్రయత్నించడం స్త్రీలు ఇంకా నేర్చుకోవలసి వుంది. భర్త తనను వదిలేసి వేరే స్త్రీతో బతుకుతున్నా, తనకివ్వాల్సిన మనోవర్తి ఇవ్వకపోయినా, తనని ఇంటి నాలుగు గోడల మధ్యా తీవ్రంగా హింసిస్తున్నా చంపడానికి సైతం పూనుకుంటున్నా గాని స్త్రీలు ఇంకా సహిస్తున్నారేగాని చట్టం సహాయంతో కోర్టుల్లో కేసులు పెట్టడానికి ముందుకు రావడం లేదు. కొంతవరకు కారణం కోర్టులు వీరికి అందుబాటులో లేకపోవడమే. కోర్టు ఖర్చులు భరించడం వీరికి కష్టమే. అందుకే ఇలాంటి స్త్రీలకి ఉచిత న్యాయ సహాయం అందించాల్సిన బాధ్యత ప్రభుత్వం మీదుంది. అలాగే కేసుల విచారణలు ముఖ్యంగా స్త్రీలకి సంబంధించి వరకట్నం కేసులు, మనోవర్తి కేసులు, విడాకుల కేసులు, కట్నం హత్యల కేసులు త్వరితంగా విచారణ జరిగేట్టు చూడాలి. ఏళ్ళ కొద్దీ సాగదీయడం వల్ల నేరస్తుడు సులభంగా తప్పించుకోగలుగుతున్నాడు. ముఖ్యంగా వరకట్న హత్య కేసుల కోసం ప్రత్యేక న్యాయస్థానాలను ఏర్పాటు చేసి విచారణను త్వరితంగా జరిపి నిందితులకు శిక్షలు విధించినట్టైతే ఈ హత్యలు చాలా వరకు తగ్గుతాయి.

**స్త్రీ అంటే మాంసపు ముద్దకాదు వ్యక్తిత్వం, మానవత్వం వున్న మనిషి**

చట్టాలు సక్రమంగా అమలు జరిగిపోతేనూ కోర్టులు శిక్షలు విధిస్తేనూ స్త్రీల సమస్యలన్నీ తొలగిపోతాయని గానీ, చట్టాల ద్వారా స్త్రీల అసమానత్వం తొలగిపోయి వారి పరిస్థితి మారిపోతుందనిగాని ఆశించలేము. వ్యవస్థ ఒకవైపు, పురుషాధిక్యత ఒకవైపు స్త్రీలని అణిచివేస్తున్నాయి. ఈ పితృస్వామిక వ్యవస్థలో చట్టాలు కూడా పురుషులకు అనుకూలంగానే ఉంటాయి. తీర్పులన్నీ వారికి అనుకూలంగానే వెలువడతాయి. పితృస్వామిక కుటుంబ వ్యవస్థను చెక్కు చెదరకుండా కాపాడే బాధ్యతను చట్టాలు చాలా సమర్థవంతంగా నెరవేరుస్తున్నాయి. పైపైన చూస్తే స్త్రీల కోసం వందలాది చట్టాలున్నట్టు అన్పిస్తుంది. కాని అమలులో మాత్రం అవి స్త్రీలకి ఏమాత్రం ఉపయోగకరంగా ఉండటం లేదు. అమల్లో ఉన్న విలువలను కాపాడేవిగానే చట్టాలున్నాయి గాని కొత్త విలువలను ప్రతిపాదించే పనిని ఏ చట్టం కూడా చేయడం లేదు. అందుకే స్త్రీలు సంఘటితమై పురుషాధిక్యం, పితృస్వామ్య వ్యవస్థపై నేరుగా పోరాడితే తప్పతమ సమస్యలు పరిష్కారం కావని అర్థం చేసుకోవాలి. అప్పుడు మాత్రమే స్త్రీల సమస్యలకి శాశ్వత పరిష్కారం దొరుకుతుంది. అంతవరకు మన పరిస్థితి ఇంతేనా? ఇలా చావవలసిందేనా? ఈనాడు అమల్లో ఉన్న చట్టాల్లో కొన్నయినా స్త్రీలకి మేలు చేసేవి ఉన్నాయి. వాటిని పకడ్బందీగా అమలు జరిగేటట్టు ప్రయత్నించడమే ఈ ప్రశ్నలకు సమాధానం. తీవ్రంగా ఉన్న సమస్యలకి పరిష్కారం వెతుక్కోవడం చాలా అవసరం.

చట్టాలను సక్రమంగా అమలు జరపడం కోసం స్త్రీ విముక్తివాదులు చేయాల్సినదెంతో ఉంది. ఈ సంఘాల వత్తిడి వల్లనే 1983లో ఇండియన్ ఎవిడెన్స్ ఏక్ట్‌కి అత్యంత ముఖ్యమైన సవరణ చేయడం జరిగింది. రేప్ కేసులకి సంబంధించి ఈ సవరణ ఎంతో ముఖ్యమైంది. వరకట్న హత్యల కేసులకు సంబంధించి కూడా చేయాల్సినదెంతో ఉంది. ఈ హత్యలు తగ్గడం కోసం, వారసత్వ హక్కుల కోసం పోరాడాలి. ప్రత్యేక న్యాయస్థానాల ద్వారా భార్య హంతకులను విచారించి, శిక్షించేట్టు ప్రయత్నం చేయాలి. అలాగే నిస్సహాయులైన స్త్రీలకి ఉచిత న్యాయసహాయం అందేట్టు చూడాలి. అన్నింటికన్నా ముఖ్యమైనది ఉమ్మడి సివిల్ చట్టం కోసం ఉద్యమించడం. ఈ ఉమ్మడి సివిల్ చట్టం ద్వారా కొంత వరకు స్త్రీల సమస్యలు పరిష్కారం అవుతాయి. ఎంత తొందరలో దీనిని సాధించుకుంటే అంత మంచిది. ఇది తక్షణ కర్తవ్యంగా అన్ని మహిళా సంఘాలు గుర్తించాలి.

**—కొండవీటి సత్యవతి**

# ప్రజా పోరాటాలు — స్త్రీవాదం

భారతదేశంలోనూ, ఆంధ్ర దేశంలోనూ స్త్రీల సమస్యల గురించి ఆలోచన, ఆందోళన మొదలయ్యి వంద సంవత్సరాల పైనే గడిచి పోయాయి. మొదటి స్త్రీ సంఘాలు ఏర్పడి మొదటి బాలికా పాఠశాలలు ఏర్పడి నూట యాభై సంవత్సరాలు గడిచింది. ఆంధ్రదేశంలో పెద్ద అలజడి రేపిన మొదటి వితంతు వివాహం జరిగి వంద సంవత్సరాలయింది. 'కన్యా శుల్కం' నాటకం నూరేళ్ళ పండుగ జరుపుకుంటోంది. ఈ నూరు సంవత్సరాల కాలంలో స్త్రీలు, స్త్రీల సంఘాలూ సాధించినదేమిటి? పొందినదేమిటి అన్న విషయం పరామర్శించుకుని యిప్పటి పరిస్థితిని ప్రత్యేకంగా ఆలోచించి ముందుకు వెళ్ళాల్సిన అవసరం ఈనాడుంది. మహిళా దశాబ్దం గడిచిపోయి అయిదారేళ్ళవుతోంది. ఆంధ్ర దేశంలో స్త్రీవాదం, స్త్రీ విముక్తి గురించిన బహిరంగ చర్చ ప్రారంభమై పదేళ్ళపైనే అయింది. ప్రత్యేకంగా ఈ యిర్వై సంవత్సరాలలో స్త్రీల సమస్యల గురించిన అవగాహనలో కొన్ని మౌలికమైన మార్పులు వచ్చాయి. దాని ఫలితం ఏమిటి? స్త్రీ విముక్తి గురించి ఆచరణలో గానీ సైద్ధాంతికంగా గానీ మనం యిప్పుడు ఎక్కడ వున్నాం? మన గమ్యం లక్ష్యం వీటి గురించి స్పష్టత సాధించటంలో ఎంత ముందుకు వెళ్ళాం. మనకున్న పరిమితులేమిటి? ఇవి ఒకసారి సమీక్షించుకోవటం అవసరం.

స్త్రీల సమస్యల గురించి స్త్రీల హక్కుల గురించి పోరాటం, అలజడి, ఆందోళన పొందొమ్మిదవ శతాబ్దం మొదటి భాగంలోనే ప్రారంభమయింది. మొదట సతీ సహగమనం, వితంతు పునర్వివాహ నిషేధం, బాల్య వివాహాలు, స్త్రీ విద్యవంటి స్త్రీల సమస్యలను సంఘ సంస్కరణలో భాగంగా అర్థం చేసుకున్నారు. అర్థ రహితమైన ఆచారాలతో మితిమీరిన ఆడంబరాలతో, అర్థంలేని దానాలతో, అనవసరమైన వ్యాజ్యాలతో డబ్బంతా పోగొట్టుకోవటం ఎలాంటి అజ్ఞానమో, దురాచారమో స్త్రీలకు చదువు చెప్పించక పోవటం బాల్య వివాహాలు చేయటం, వితంతువులకు వివాహాలు చేయక పోవటం కూడా అలాంటి అజ్ఞానమే, దురాచారమే అనుకున్నారు ఆనాటి సంస్కర్తలు. మనుషులను సంస్కరించి వాళ్ళ అజ్ఞానాన్ని కొత్త జ్ఞానంతో పోగొట్టి సంఘ సంస్కరణ చేయాలని ప్రయత్నించారు. సంస్కరణోద్యమాలు నడిపారు. ఈ కృషికి బ్రిటీష్ పాలకుల అనుమతి కూడా దొరికింది. స్త్రీలకు పాఠశాలలు పెట్టారు. వితంతు వివాహాలు జరిపారు. బాల్య వివాహాలను నిషేధించే శారదా చట్టాన్ని తీసుకొచ్చారు. ఐతే ఈ కాలంలో స్త్రీ విద్య కావాలని వాదించిన వారందరూ స్త్రీకి విద్య కావాలన్నారు గానీ స్త్రీ పురుషులకు ఒకే విద్య కావాలనలేదు. స్త్రీ విద్య వల్ల మంచి తల్లులు మంచి భార్యలు తయారవుతారన్న ఆలోచనే వారికుంది. ఆర్థిక విషయాల్లో స్వేచ్ఛ వుండి పురుషులతో పోటీ చేయగలిగే స్త్రీల గురించి గానీ సంసార బాధ్యతల్లో స్త్రీలతో సహకరించే పురుషుల గురించి గానీ వారికి ఆలోచన కూడా లేదు.

సంస్కరణోద్యమం కంటే జాతీయోద్యమం స్త్రీలను మరింత చైతన్యవంతం చేసింది. జాతీయోద్యమ భావాలతో స్త్రీలు ప్రభావితులై ఉద్యమంలోకి వచ్చి పని చేశారు: ఐతే ఉద్యమంలో వాళ్ళకు చాలా పరిమితులు ఉన్నాయి. జాతీయోద్యమ నాయకత్వానికి స్త్రీ పురుష సమానత్వం మీద విశ్వాసం లేదు. గాంధీగారి అభిప్రాయంలో స్త్రీ పురుషులు ఎవరి పనులు వాళ్ళు చేయవలసిందే. జాతీయోద్యమంలో స్త్రీల కార్యకలాపాలను చాలా జాగ్రత్తగా కొన్ని పరిధులలోనే రూపొందించారు. ఆ పరిధి దాటి స్త్రీలు బైటికి వచ్చినప్పుడల్లా వారిని నిరోధించే ప్రయత్నాలు చేశారు. ఒకవైపు 'హిందూ స్త్రీ', 'భారత స్త్రీ' గురించి వున్న భావాలు, మాతృత్వం గురించి వున్న భావాలూ ఉద్యమంలో స్త్రీల స్థానాన్ని నిర్ణయిస్తుంటే మరొకవైపు కొద్దిమంది చదువుకున్న స్త్రీలు ఉద్యమంలో నాయకత్వ స్థానంలోకి వచ్చారు. వీరు తమ వ్యక్తిగత ప్రభావం వల్ల పైపై సంస్కరణలను సాధించగలిగారు. కానీ స్త్రీల సమస్యల విషయంలో ప్రజా సమీకరణ, ప్రజా రాజకీయాలలోకి ఈ సమస్యలను తీసుకు వెళ్ళటం, వీటిలో వీరు నిర్వహించిన పాత్ర తక్కువనే చెప్పాలి. ఐనా ఓటు హక్కు కోసం, రాజకీయ హక్కుల కోసం, హిందూ కోడ్ బిల్లు కోసం స్త్రీలు చేసిన పోరాటాలు ఎంతో ప్రాముఖ్యం కలిగినవి. ఓటుహక్కు, చట్ట సభలలో స్త్రీలకు ప్రవేశం, వివాహానికి విడాకులకు సంబంధించిన చట్టాలు వీటితో స్త్రీల సమస్యలు తీరిపోతాయనుకున్నారు. కానీ సమాజంలో విలువలు మారకుండా చట్టాల ద్వారా పరిస్థితులను మార్చ లేమనే విషయం క్రమంగా మహిళా ఉద్యమ నాయకులకు అర్థమయింది. సమాజంలో అమలులో వున్న నీతులూ విలువలూ ఏ పునాది మీద నిలబడ్డాయో ఆ పునాదిని కదల్చకుండా ఎన్ని చట్టాలు చేసినా ప్రయోజనం ఉండదనే విషయం యివాళ స్పష్టమయింది. ఐతే ఆ పునాదిని కదిల్చే పోరాటాలు కూడా ఆంధ్ర దేశంలో జరిగాయి. ఆ పోరాటాలలో స్త్రీలు పాల్గొన్నారు. అక్కడ స్త్రీల సమస్యల గురించి స్త్రీ విముక్తి గురించి ఎలాంటి అవగాహన వుందో చూద్దాం.

కమ్యూనిస్టు పార్టీ నాయకత్వంలో 1943లో ఆంధ్ర మహిళా సంఘం ఏర్పడింది. ఫాసిస్టు వ్యతిరేక ప్రచారం, తెలంగాణా పోరాటానికి సహాయ పడటం స్త్రీల హక్కుల గురించిన ప్రచారం, వీటితో ఆంధ్ర మహిళా సంఘం ఎంతో చురుగ్గా పనిచేసింది. ఐతే పార్టీ కార్యక్రమాలను రూపొందించటంలో ఆ కార్యక్రమాలలో స్త్రీలకు సంబంధించిన విషయాల ప్రాధాన్యతను నిర్ణయించటంలో స్త్రీలకేమీ పాత్ర లేదు. దానిని గురించి అప్పటి స్త్రీలకు పెద్ద అసంతృప్తి లేదు. ఉన్న కొద్ది అసంతృప్తి కూడా బైటికి రాలేదు. తెలంగాణా ఉద్యమంలో స్త్రీలు యిళ్ళ నుంచి బైటికి వచ్చి అడవులకు వెళ్ళి పోరాటం చేశారు. ఆయుధాలు పట్టి శత్రువుతో యుద్ధం చేశారు. ఐతే యిక్కడ కూడా పార్టీ నిర్మాణ విషయాల్లో గానీ, నిర్ణయాల విషయాల్లో గానీ స్త్రీలకేమీ ప్రాముఖ్యత లేదు. స్త్రీల సమస్యల గురించి ప్రత్యేకమైన ఆలోచన లేదు. ఉద్యమానికి స్త్రీలు ఉపయోగపడతారనే ఆలోచన ఉన్నంత బలంగా స్త్రీలకు ఉద్యమం అవసరం అన్న ఆలోచన లేదు. పార్టీలోకి, దళాలలోకి రావాలని ఉత్సాహ పడిన స్త్రీలకు తగిన ప్రోత్సాహాన్ని

యివ్వలేకపోయారు. ఉద్యమంలోకి దళాలలోకి వచ్చిన స్త్రీలపై ఆ బాధ్యతలతోపాటు తాము మంచివారిగా గుర్తింపబడాలనే అదనపు బాధ్యత కూడా పడింది. స్త్రీల సమస్యల గురించి ప్రత్యేకమైన శ్రద్ధా అధ్యయనం లేకపోవటంతో ఆర్థిక వ్యవస్థ మారితే స్త్రీల సమస్యలు మారిపోతాయనే ధోరణే ప్రముఖంగా వుంటూ వచ్చింది. స్త్రీల లైంగికత్వం మీద సమాజం విధించిన కంట్రోలు గురించీ, లైంగిక స్వేచ్ఛ గురించీ ఆలోచించిన చలం వంటి రచయితలను విశృంఖల వాదులుగా తీసి పారేశారు. లైంగిక విషయాలలో వున్న సంప్రదాయ భావనలూ, మిత్‌లూ, హిందూమతవంత భావజాలం వీటి ఆధారంగా ఆ ధోరణిని పెద ధోరణిగా జమకట్టారు. ఆ విషయాలను సీరియస్‌గా అధ్యయనం చేద్దామనే ఆలోచన లేకుండా పోయింది. తెలంగాణ ఉద్యమం ఆగిపోవటంతో ఉద్యమంలో పనిచేసిన స్త్రీలు తిరిగి కుటుంబాలకు వెళ్ళాల్సిన పరిస్థితి వచ్చింది. వారి కోసం ప్రత్యేకంగా రూపొందించిన కార్యక్రమం లేకపోవటంతో వారి అనుభవాలకూ, శక్తులకూ విలువా, ప్రయోజనం లేకుండా పోయాయి. కుటుంబ వ్యవస్థను గురించీ దాని అణచివేత స్వభావాన్ని గురించీ కనీసమైన అవగాహన లేకపోవటంతో సామాజిక విముక్తి కోసం పోరాడిన స్త్రీలు తమకు తెలియకుండానే కుటుంబంలోని అచివేతకు తలవొగ్గాల్సి వచ్చింది.

1950వ దశాబ్దంలో స్త్రీ విద్య కొంత పెరిగింది గానీ స్త్రీల గురించి వున్న ఆలోచనా విధానం ఏమి మారలేదు. పరిశ్రమ పెరగటం, ఉద్యోగాలలోకి స్త్రీలు రావటం, సామ్రాజ్యవాద సంస్కృతి ప్రభావం వీటన్నిటి వల్లా స్త్రీలకు కొత్త సమస్యలు వచ్చిపడ్డాయి. ఈ సమస్యలను ప్రత్యేకంగా అధ్యయనం చేసి ఆ సమస్యలకు సంబంధించి కొత్త కార్యక్రమాలు రూపొందించే పని ఎవరూ పెట్టుకోలేదు. ఇంటా బయటా స్త్రీలు గురవుతున్న దోపిడి అణచివేతల గురించిన స్పృహతో స్త్రీల కోసం కమ్యూనిస్టు పార్టీ ఏ కార్యక్రమాన్నీ యివ్వలేదు. ఆ కాలంలో అభ్యుదయ రచయితల సంఘం కూడా చురుగ్గా పనిచెయ్యలేదనే విషయం వున్నప్పటికీ, ఆ సంఘంలో ప్రధాన సభ్యుడైన కొడవగంటి కుటుంబరావు స్త్రీల సమస్యల గురించి చేసిన రచనల మీద చర్చ జరగలేదు. స్త్రీల



ఈ బందిఖానా బద్దలయ్యేదెన్నడో?

లైంగికత్వం గురించీ, వివాహ వ్యవస్థ గురించీ ఆయన చేసిన మౌలికమైన ప్రతిపాదనలను పట్టించుకోలేదు. నిశ్శబ్దంగా ఊరు కోవటం ద్వారా ఆ భావాలను తొక్కి పట్టారు.

ఐతే 60వ దశాబ్దం రెండవ భాగంలో దేశంలో యువతరంలో బయలుదేరిన అలజడి, నక్సల్బరీ ఉద్యమం ఆ ఉద్యమంలో యువతరం. పాత్ర వీటి వల్ల అన్ని విషయాల గురించి సమాజంలో అలజడి బయలుదేరింది. స్త్రీలలో చదువుకున్న వారి శాతం ఎక్కువ కావటం, ఉద్యమాలలోకి వచ్చిన స్త్రీలు ఉద్యమంలో తమ స్థానం గురించి ఆలోచించి ప్రశ్నించటం, పాశ్చాత్య దేశాలలో అరవయ్యవ దశాబ్దంలో ప్రారంభమైన స్త్రీ విముక్తి ఉద్యమ ప్రభావం వల్ల నగరాలలో స్త్రీల సంఘాలు ఏర్పడటం వీటన్నిటి వల్లా ఇంతకు ముందెన్నడూ లేని విధంగా స్త్రీ సమస్యలు చర్చకు వచ్చాయి. ఈ నేపథ్యంలోనే స్త్రీ వాదం, స్త్రీ విముక్తి గురించిన ఆసక్తి మొదలయింది.

'స్త్రీవాదం' 'స్త్రీ విముక్తి' అనే పదాలు అందరినీ, ముఖ్యంగా వామ పక్షాల వారిని, విప్లవ పార్టీలనూ కలవర పరిచాయి. ఈ ఆలోచనల పట్ల వారికి వున్న వ్యతిరేకతనూ, ప్రెజుడిస్‌ను తొలగించటానికే, స్త్రీలు ఎంతో పోరాడవలసి వచ్చింది. అనేక రకాల అవమానాలకూ, అవహేళనలకూ గురికావలసి వచ్చింది. తమ విశ్లేషణను వినమని కోరటమూ పెద్ద ఉద్యమంగా చేయవలసి వచ్చింది. ఈ స్త్రీ వాదం పుట్టుక పాశ్చాత్య దేశాల్లో కాబట్టి యిదొక పెడ ధోరణిగా చూడాలన్నంత గుడ్డి వ్యతిరేకత మొదట్లో ఉండేది. సమాజానికి సంబంధించిన అన్ని సమస్యల గురించి మార్క్సిజం చెప్పేసిందనీ, కొత్తగా స్త్రీ వాదం చెప్పేదేమీ లేదనీ, మధ్య తరగతి

ఆడవాళ్ళను రెచ్చగొట్టి వర్గ పోరాటాన్ని బలహీన పరచటమే ఈ స్త్రీ విముక్తి ఉద్యమ ధ్యేయమనీ కొంతకాలం వాదించారు.

ఐతే ప్రస్తుత సామాజిక రాజకీయ వాతావరణంలో, ప్రపంచ రాజకీయ నేపథ్యంలో ఆ సాంఘిక వాస్తవికత నుంచి వచ్చిన చైతన్యం ఈ స్త్రీ వాదంలో బలంగా కనిపించటం వల్ల దీనిని నిశ్శబ్దంగా నిర్లక్ష్యం చెయ్యటానికి, పెడధోరణి అని పూర్తిగా తోసిపుచ్చటానికి వీలు కాలేదు. పైగా యిక్కడ ఈ స్త్రీ వాదం పుట్టుక నక్సల్‌బరీ, శ్రీకాకుళ, తెలంగాణా విప్లవోద్యమ నేపథ్యంలోనే, ఆ రాజకీయ సందర్భంలోనే అవటం వల్ల మౌనంగా ఉండటం మరింత అసాధ్యమయింది.

ఎమర్జన్సీ తర్వాత హైదరాబాదులో ఏర్పడిన స్త్రీ శక్తి సంఘటన స్త్రీల దృష్టి నుంచి సమజాన్ని విశ్లేషించటం, స్త్రీల కోసం కార్యక్రమాలు రూపొందించటం చేసింది. ఇందులోని సభ్యులు కొందరు విప్లవోద్యమాలలో పనిచేసిన వారు. మరి కొందరు విప్లవోద్యమాలతో దగ్గరి సంబంధం వున్నవారు. విప్లవోద్యమాలలో పనిచే చేసిన స్త్రీలు రాజకీయాలంటే వ్యక్తిగత విషయాలతో సంబంధం లేనివనే పురుష ధోరణితో చాలాకాలం నుంచే విసిగిపోయి ఉన్నారు. అణచివేత ఎలా ఉందో వాళ్ళకు రాజకీయ ఉద్యమాలలో బాగా తెలిసి వచ్చింది. తాము తక్కువగా చూడబడుతున్నాం తమ సమస్యలు విలువ లేనివిగా, నవ్వు పుట్టించేవిగా తెలివి తక్కువ తనంతో మాట్లాడే మాటలుగా, వ్యక్తిగత సమస్యలుగా ఉంటున్నాయి. రాజకీయ నిర్ణయాలతో తమకు పాత్ర లేదు అన్న విషయం స్త్రీలు గ్రహించారు. ఈ అణచివేత వాళ్ళను రాజకీయాలంటే ఏమిటి వ్యక్తిగతం అంటే ఏమిటి - వ్యక్తిగతం కూడా రాజకీయం అనే నినాదం ప్రాముఖ్యత ఏమిటి అని ఆలోచింప చేసింది. స్త్రీ శక్తి సంఘటన చేసిన కృసి, సమాజంలో స్త్రీ పురుష సంబంధాలలో రోజు రోజుకూ పెరుగుతున్న వైషమ్యాలూ, విప్లవ పోరాటాలలో స్త్రీలు నిర్వహిస్తున్న పాత్ర యివన్నీ కలిసి విప్లవ పార్టీలు కూడ ఈ సమస్యల గురించి ఆలోచించి మాట్లాడాల్సిన అవసరాన్ని కల్పించాయి.

పౌరహక్కుల సంఘం వంటి ప్రజా సంఘాలలో స్త్రీల సమస్యల గురించి చర్చ జరగాలా ఒద్దా అనీ, నినాదాలలో 'పురుషాధిపత్యం' అనే మాట వాడాలా ఒద్దాఅనీ చర్చలు జరిగాయి. మార్క్సిజం పరిధిలో స్త్రీల సమస్యలనెలా అర్థం చేసుకున్నారు ? సోషలిస్టు సమాజంలో స్త్రీల సమస్యలు తీరతాయా లేదా? అన్న ప్రశ్నలు చర్చకు వచ్చాయి. విప్లవ రచయితల సంఘం మార్క్సిజం - కుటుంబ వ్యవస్థ అన్న అంశంపై ఒక క్లాసు నిర్వహించి విస్తృతంగా చర్చించింది. కుటుంబ వ్యవస్థ - మార్క్సిజం అనే పుస్తకాన్ని ప్రచురించింది. హైదరాబాదు బుక్ ట్రస్టు వారు డొమితిలా జీవిత కథను 'మాకథ' అన్న పేరుతో ప్రచురించి బోలివియాలో స్త్రీల సంఘాలనూ, వారి పోరాట పద్ధతులనూ పరిచయం చేశారు. అగ్రెస్ స్మెడ్లీ రచన 'భూమి పుత్రిక' ప్రచురణతో స్త్రీల సమస్యలను కొత్త దృష్టితో చర్చించటం మొదలయింది. స్త్రీ శక్తి సంఘటన తెలంగాణా పోరాటంలో పాల్గొన్న స్త్రీల అనుభవాలను "మనకు తెలియని మన చరిత్ర" పేరుతో పుస్తకంగా ప్రచురించారు. ఆ పుస్తకం గురించి కమ్యూనిష్టు పార్టీలన్నీ వ్యతిరేకతనే ప్రదర్శించాయి. ఐతే విప్లవ పార్టీలకు ఆ పుస్తకం రేపిన ప్రశ్నల గురించి ఆలోచించక తప్పలేదు. విప్లవ సంఘాలలో పనిచేసే స్త్రీలు ఈ స్త్రీవాద సాహిత్యం వల్ల తమ సమస్యలను కొత్త దృష్టితో అర్థం చేసుకోవటం మొదలు పెట్టారు. పార్టీలో పురుషాధిపత్యాన్ని, పితృస్వామ్యాన్నీ ప్రశ్నించటం మొదలు పెట్టారు. ఫెమినిస్ట్ స్టడీ సర్కిల్ ప్రచురించిన " మూడు తరాలు " "మాకు గోడలు లెవు" పుస్తకాల చర్చను మరింతగా పెంచాయి. ఫలితంగా యిప్పటి దాకా నిశ్శబ్దంగా వున్న బాధలూ, గుర్తింపులేని చాకిరీ చేస్తూ యిళ్ళల్లో మగ్గిన స్త్రీల పరిస్థితి గర్భధారణ పిల్లల పెంపకంతో నిస్సహాయులై తమ అవమానాల్ని తమలోనే దిగమింగుకుంటున్న స్త్రీల పరిస్థితంతా చర్చకు వచ్చినట్లయి సంఘంలో కొత్త చలనం వచ్చింది. ఆ చలనం యొక్క స్వభావం, పుట్టుక, ధోరణీ యివన్నీ వ్యవస్థను ఎదిరించటంలో ఒక కొత్త అవగాహనను యిచ్చాయి. స్త్రీ పురుషుల మధ్య తేడా కేవలం శారీరక అసమానతల వల్లగానీ, కేవలం ఆర్థిక అసమానతల వల్లగానీ నిర్ణయింపబడలేదనే విషయం ఈ చర్చల వల్ల స్పష్టమయింది. ఐతే యివాళ ఈ రెండు విషయాలూ స్త్రీ పురుషులకున్న పరిమితులను నిర్ణయిస్తూనే ఉన్నాయి. వాటిని దాటి ముందుకు వెళ్ళటానికి చేయవలసిన పోరాటాల గురించి యివాళ మనం ఆలోచించాలి. స్త్రీ వాద చైతన్యం ఒక ప్రత్యేక లైంగిక సాంఘిక వ్యవస్థలో భాగం, ఈ వ్యవస్థని మార్చాలని ప్రయత్నిస్తోంది. ఆ స్త్రీ వాదం పుట్టుకే ఆ వ్యవస్థ భౌతిక పరిస్థితులలో మార్పుకి ఉపయోగపడుతుంది. స్త్రీల సమస్యలను గుర్తిస్తే చాలు వాటంతటవే పరిష్కార మవుతున్నా యనుకున్న ధోరణి యిప్పుడు లేదు. మార్క్సిష్టు సంప్రదాయ ధోరణిలో స్త్రీలను ఉత్పత్తిలో భాగం, పనిచేసే చోట సౌకర్యాలు, చట్టాలలో మార్పులు వీటిని సాధిస్తే చాలనుకున్న రోజులు కూడా గతించాయి. ఇప్పుడు ఉత్పత్తి వ్యవస్థను కొనసాగించటంలో కుటుంబ వ్యవస్థకున్న సైద్ధాంతిక ప్రాధాన్యతనూ, పాత్రనూ గుర్తించక తప్పదు. కుటుంబంలో స్త్రీలు చేసే ఉత్పత్తి స్వభావాన్ని అర్థం చేసుకోక తప్పని పరిస్థితి స్త్రీవాదం కల్పించింది. ఉత్పత్తి శక్తులను స్త్రీలు పునరుత్పత్తి చేసే విధం, సమాజంలో వాళ్ళ స్థితి గురించిన అవగాహనా లేనిదే సామాజిక వ్యవస్థనూ ఆర్థిక వ్యవస్థనూ అర్థం చేసుకోలేమని గుర్తించే స్థితి వస్తోంది.

ఇప్పుడున్న సామాజిక రాజకియ వాతావరణంలో స్త్రీల చైతన్యం రోజు రోజుకీ పెరుగుతోంది. కుటుంబ వ్యవస్థకూ పారిశ్రామిక వ్యవస్థకూ, ప్రైవేట్ ప్రపంచానికీ పబ్లిక్ ప్రపంచానికీ, వ్యక్తిగతమైన వాటికీ వ్యక్తిగతం కాని వాటికీ మధ్య వున్న వైరుధ్యం స్త్రీల చైతన్యాన్ని పెంచి వాళ్ళలో తిరుగుబాటు ధోరణిని పెంచుతుంది. విస్తృతంగా జరుగుతున్న సరుకుల ఉత్పత్తికీ కుటుంబ వ్యవస్థకు మధ్య వచ్చే ఘర్షణ స్త్రీలు పోరాటాలకు దిగక తప్పని పరిస్థితికి దారి తీస్తుంది. ఈ పోరాటాలను ఒక ఉద్యమంగా మలుచుకోవాల్సిన బాధ్యత చైతన్యవంతులైన స్త్రీలందరి మీదా వుంది. సమాజంలో అనేక సెక్షన్ల నుంచి వచ్చే ఆందోళనలనూ తిరుగుబాటునూ ఎలా ఒకటిగా కూడగట్టాలి? మనలో వున్న తేడాలనూ, మనల్ని బలహీనుల్ని చేస్తున్న వేర్పాటు ధోరణులను ఎలా పోగొట్టుకోవాలి? దోపిడీ అణిచివేతలు లేని సమాజం కోసం మనకున్న నిమగ్నతను మన రోజువారి జీవితంతో ఎలా సమన్వయపరుచుకోవాలి? మన వ్యక్తిత్వాన్ని పోగొట్టుకోకుండా ఎలా ఒక సంఘంగా కలిసి పనిచెయ్యాలి? ఈ ప్రశ్నలు యివాళ స్త్రీల గురించి పనిచేస్తున్న కార్యకర్తలందరి ఎదుటా ఉన్నాయి. వీటికి జవాబులు వెతకకపోతే స్త్రీల ఉద్యమం ఒకరకమైన స్థబ్దతకు లోనయ్యే ప్రమాదం ఉంది.

– ఓల్గా

# గ్రామాల్లో స్త్రీలు

'నలుపు' మహిళా ప్రత్యేక సంచికగా వెలువడుతున్న సందర్భంగా గ్రామీణ స్త్రీల గురించి నన్నొక వ్యాసం రాయమన్నారు. అయితే ఇది రాయటానికి నాకు ప్రత్యేక అర్హతలూ, అనుభవాలూ అంటూ ఏమీలేవు. నేనూ స్త్రీని కావటం వల్ల స్త్రీల సమస్యలకు స్పందిస్తాను. వ్యవసాయకూలీల మధ్య నా పని సాగిస్తున్నాను. ఈ కూలీలలో ఎక్కువ మంది స్త్రీలేమరి. అందుకనే స్త్రీల కష్టసుఖాలను నేను బహుశా చేసుకోగలనను కుంటాను. ఇళ్లల్లో పని పిల్లల్ని పెట్టుకొని, గ్రామీణ పేద స్త్రీలకు 'మహిళా సమస్య' ఏమిటి ఎట్లా అని చెప్పే పట్టణ మధ్యతరగతి ఫెమినిస్టులంటే (స్త్రీ స్వేచ్ఛా వాదులు) నాకెందుకో అనుమానం. కుల వర్గ విభేదాల సమస్య నగరాల్లోకన్నా గ్రామాల్లో ఎక్కువగా కన్పిస్తుంది. ఈ సమస్య ముందు స్త్రీ పురుష విభేద సమస్య ఇక్కడ ఒక లెక్కలోకి రాదు. పితృస్వామిక వ్యవస్థ ద్వారా ఏర్పడిన అణచివేతకు అన్ని వర్గాల అన్ని కులాల స్త్రీలూ గురయ్యారన్నది నిస్సందేహమైన విషయం. అన్ని కులాల వర్గాల స్త్రీలను పితృస్వామ్య వ్యవస్థ అణచివేసింది. కులాన్ని వర్గాన్ని త్రోసిరాదని స్త్రీ ఉద్యమం ఎదగడం అసాధ్యం. సాధారణంగా పట్టణంలోని మహిళా కార్యకర్తలు తమ గ్రామీణ సోదరీమణులకు ఇచ్చే సలహా ఇలా వుంటుంది " భర్తలు మిమ్మల్ని కొడితే మీరు మళ్లీ కొట్టండి". ఈ విషయంలో దెబ్బలు తిన్న ఒకస్త్రీని ప్రశ్నించినపుడు ఆమె తెల్లబోయి ఇలా చెప్పింది : " మా ఆలుమగల సమస్యను మా కులమూ, వర్గమూ కాని వారికి చెప్పినందుకు నాకు జరిగిన శాస్తి ఇది". ఇటీవల మేము చూసిన మొదటి కేసు భర్త వదిలివేసిన ఒక కోమటి స్త్రీ ఆస్తికేసు. ఆమె భర్త చనిపోయినపుడు అతని ఆస్తి అంతా ఆవూరి జిత్తులమారీ బ్రాహ్మణ సర్పంచ్ పేర రాసినట్లు బయట పడింది. ఈ విషయంగా మేము ఇంటింటికీ తిరిగి స్త్రీలను సంఘటితం చేశాం. ఇది పూర్తిగా స్త్రీ సమస్యేనని నేను భావించాను. స్త్రీలనుండి, వారి భర్తలనుండీ బ్రహ్మాండమైన ప్రతిస్పందన వచ్చింది. కాని ఆ స్త్రీలు దీనిని నాలాగా పూర్తి స్త్రీ సమస్యగానే భావించలేదు. " ఈ బ్రాహ్మణుడు ఇలా చాలా కుటుంబాలను నాశనం చేశాడు. వాడ్ని పట్టుకొండి ! కొట్టండి ! అనే దృష్టితోనే వారున్నారు. అంటే 'ఈ సమస్య పూర్తిగా స్త్రీ పురుష విభేద సమస్యగానే చూడకూడదు, దీనితో వర్ణం, కులం ముడిపడివుంది' అనే అర్థం.

గ్రామాలలో స్త్రీలకు ప్రత్యేకంగా వున్న బాధలు ఏమిటి ? కులాలకు వర్గాలకు సంబంధించిన బాధలను సగానికిపైగా మోస్తూ స్త్రీగా ప్రత్యేక బాధలకు గురవుతున్నారు. వారు ఇంటిపనులు, వంట పనులు ముగించుకుని పొలం పనులకు పోవాలి. పితృస్వామిక వ్యవస్థకు ప్రతినిధియైన భర్తకు లోబడి వుండటం. ఇందులో ఏ కొంచెం తేడా వచ్చినా దెబ్బలకు గురికావడం జరుగుతోంది. పురుషులు పొలం పనులకు స్త్రీలకంటే ముందుగా బయలుదేరుతారు గనుక వారికి బీడి తాగటానికి, టీకొట్టుకెళ్లి టీ తాగటానికి కొంత విరామం దొరుకుతోంది. కాని స్త్రీలు మాత్రం ఇంట్లోకి నీళ్లు తెచ్చుకోవాలి, వంట చేయాలి, పిల్లలను చూసుకోవాలి. పొలం పనులు లేనిరోజున పురుషులు సినిమాలకు షికార్లకు వెళ్ళితే స్త్రీలు మాత్రం సమయం వృధా చేయకుండా ఇంట్లోకి కట్టెలు తెచ్చుకొని వాడతారు. మిగిలినవి అమ్ముకొని డబ్బు చేసుకుంటారు. ఇంకా వారు చాపలు అల్లుకోవడం, బొంతలు కుట్టుకోవడం వంటి పనులు కూడా చేసుకుంటారు. సాయం కాలం పూట పురుషులు సారా దుకాణంలో సారా తాగుకుంటూ అక్కడే వుంటారు. అదే స్త్రీలు అయితే వారు కూడా తాగదలుచుకుంటే తొందరంగా దుకాణంలోకి వెళ్లి సారాగాని, కల్లుగాని గుటగుట తాగేసి మళ్లీ రాత్రి వంటపని కోసం వెంటనే ఇంటికి తిరిగి వస్తారు. వయసు మీరిన స్త్రీలకు ఇంటి పనులనుండి కొంత విశ్రాంతి లభిస్తుంది. ఎందుకంటే తన చిన్న కూతురుకాని, కోడలుకాని ఆమె విధులను స్వీకరిస్తారు. ఇకపోతే వృద్ధస్త్రీలు తెలివిగల వాళ్లయినాకూడా వాళ్లు కుల పంచాయతీలలో కూర్చోవడానికి వీలులేదు. నాకు జ్ఞాపకమున్నంత వరకు ఒక స్త్రీ పంచాయతీలో కూచొని చాలా పనిచేయటం చూశాను. ఆమె బాల వితంతువు అయినా తన పిల్లలను తన చేతుల మీదుగానే పెంచింది. ఇంటి బాధ్యతలను పూర్తిగా నిర్వహించింది. నైతిక శక్తిని సంపాదించింది. ఆమె మగవాళ్లందరితో పాటు తానూ కుల పంచాయతీలలో కూర్చునేది. అంత ఉత్సాహవంతురాలైన స్త్రీ ఇంట్లో తన కోడలు తన మాట వినక పోవడంతో ఆత్మహత్య చేసుకుంది. తాను బతికినంత కాలం వైరుధ్యభరితమైన కష్టాలను, ఒత్తిళ్లను తట్టుకుని నిలబడిన సామర్థ్యం, పట్టుదల గలిగిన స్త్రీ ఆమె.

గ్రామాలలోని పేద స్త్రీలకు గల ప్రధాన సమస్య తమపై జరిగే లైంగిక అత్యాచారాలు. గత కాలంలో స్త్రీలను చెరపట్టి వారిని లైంగికంగా వాడుకోవడం భూస్వాములకు హక్కుగా వుండేది. గ్రామంలో వున్న అమ్మాయిలను వారికి అవసరమైనపుడు ఇంటికి పిలిపించుకునే వారు. కాని ఇప్పుడు మాత్రం లైంగిక అత్యాచారాలు జాగ్రత్తగా తెలివిగా చేస్తున్నారు. ఇప్పుడు ఆశలు చూపెట్టి మభ్య పెట్టి ఆ పనులు చేస్తున్నారు. గ్రామంలో వర్గ, కుల వైషమ్యాలు రాజుకున్నప్పుడు. నిమ్న కులాలను వర్గాలను దండించడంలో భాగంగా ఇప్పుడు స్త్రీలపై అత్యాచారాలు జరుపుతున్నారు. ఇక్కడో విషయం ఏమిటంటే ధనిక వర్గ అక్క, చెల్లెల్ల కంటే వ్యవసాయ కూలీ స్త్రీలు అంతో ఇంతో స్వేచ్ఛగా బతుకుతారనేది వాస్తవం. ఒకవేళ ఈ ధనిక స్త్రీలు

తమ స్థాయి, స్థితులలో మార్పులు వీలవుతాయనుకుంటే స్వేచ్ఛగా బతుకుతారనేది వాస్తవం. ఒకవేళ ఈ ధనిక స్త్రీలు తమ స్థాయి, స్థితులలో మార్పులు వీలవుతాయనుకుంటే స్వేచ్ఛను వదులుకోటానికి యిష్ట పడుతారు తప్ప స్థాయిని వదులుకోరు. గ్రామాల్లో ఉన్నత స్థాయి జీవనం వున్న కొద్దీ వారికి స్త్రీ పరమైన సమస్యల బరువూ ఎక్కువగానే వుంటూ వస్తుంది. భూస్వామ్య వర్గంలోని స్త్రీలు, మాల, మాదిగ కులాలకు సంబంధించిన వ్యవసాయ కూలీలైన తమ చెల్లెళ్లను పీడనలకు గురి చేస్తారు. అయితే ఇంతకంటే దారుణంగా వారు తమ కుటుంబం, వంశం కారణంగా పితృ స్వామిక దుష్టత్వానికి గురవుతుంటారు. వ్యవసాయకూలి స్త్రీలు ధనిక, భూస్వామ్య వర్గ స్త్రీలను వర్గ భేదంతో ద్వేషించినా వారనుభవిస్తున్న పురుషాధిక్య పీడనను చూసి జాలిపడుతారు. కట్నం కారణంగా చిత్ర హింసలు, భార్యను కొట్టడం, కుటుంబంలోని ఇతర పురుషులు లైంగికంగా హింసించటం వంటివి భూస్వామ్య కుటుంబాలలో జరిగినప్పుడు మా సంఘం ద్వారా వాటిని పరిష్కరించాలని ప్రయత్నించేదాన్ని అయితే మా సంఘంలో స్త్రీలు ఇలా అనేవారు. "వాళ్లు వారి మగవారిని తిరస్కరించనంత కాలం వాళ్లకు ఏమి సాయం చేయ లేం. మనం వారి వ్యవహారాల్లో జోక్యం కలగజేసుకుంటే వారి తాలూకు మగ, ఆడ వారంతా కలిసి కట్టుగా తయారై మనల్ని కొడుతారు. అనవసరంగా మనం చెడ్డవాళ్లమయి కూచుంటాం" ('బధనం' అయిపోతాం).

వ్యవసాయ కూలీలలో మగవారి, ఆడవారి పాత్రలేమిటో స్పష్టంగా నిర్ణయించటం జరిగింది. స్త్రీలు పోషించేవారు, సమకూర్చేవారు కాగా, పురుషులు వేటాడే వారు, రక్షణను కల్పించేవారు. పెళ్లిళ్లు, చావులు, పెద్దజబ్బులు వంటి వాటికి మగవారు సంపాదించి ఖర్చు పెడతారు. స్త్రీలు మాత్రం కుటుంబానికి కావలసిన దైనందిన ఆహార సంపాదనకు పని చేస్తారు. స్త్రీలు ఏమాత్రం పనిచేయక పోయినా చాలా కుటుంబాలు గడవడం కష్టం. ఒక వేళ ఆ కుటుంబంలో భార్య లేకపోతే ఇతర కుటుంబాలకంటే అది ఆర్థికంగా దిగజారుతుంది. అలాగే స్త్రీలు కూడా భర్తలేని సంసారంలో నిరంతరం కష్టాలు ఎదుర్కోవలసి వస్తుంది. భర్త తన భార్యను అప్పుడప్పుడు కొట్టడం సర్వ సామాన్యం. అయితే తన బాధలనూ విసుగుదలనూ తీర్చుకోటానికన్నట్లు ప్రతిరోజు కొడుతుంటే భార్యతరపు వారుకూడా దానిని సహించరు. అలాగే స్త్రీలు 'గయ్యాళి'గా ప్రవర్తిస్తే ఎవ్వరూ సహించరు. ఇవి ప్రజల జీవన విధానంలో సాంస్కృతిక నమూనాలుగా నిలిచిపోయాయి. ఇవి కట్టుబాట్లు పటిష్టంగా వుంటే నిమ్న కులాల్లో స్త్రీలకూ, పురుషులకూ సమానంగా వెట్టి చాకిరీ జీవితం వుంటుంది.

స్త్రీపురుష వివక్ష సమస్య మీద పోరాటం అన్నది వైరుధ్యాలతో కూడుకొని వుంటుంది. ఎవరైనా ఈ సమస్యపై పోరాటం చేయాలనుకుంటే అది కాస్తా కుల వర్గ పోరాట పంథాలోకి మళ్లి పోతుంటుంది. ఇటీవల ప్రభుత్వం వర్గమూ, కులమూ పేరెత్తకుండా ఈ సమస్యను పరిష్కరించాలని ప్రయత్నం చేస్తోంది. మహిళలను సంఘటిత పరచి చైతన్య వంతులుగా చేయటానికిగాను ప్రభుత్వం, విదేశీ సంస్థలుకూడా సమృద్ధిగా నిధులు సమకూరుస్తున్నాయి. విదేశీ నిధులుకూడా అపారంగా వస్తున్నాయి. ఇవన్నీ కూడా మహిళలకు ఉన్న సమస్యలలో ఆస్తిహక్కు, బాల్య వివాహాలు, గృహిణులపై జరుగుతున్న హింస వంటి వాటిపై మాత్రమే దృష్టిని కేంద్రీకరిస్తున్నాయి, పట్టించుకుంటు న్నాయి. స్త్రీలను కులం, వర్గంలో భాగంగా పరిగణించి చూడటం ఎప్పుడూ జరగలేదు. సమాజంలో తీవ్రమైన కుల, వర్గ సమస్యలనుండి దృష్టి మళ్లించటానికి పాలక వర్గం ఈ ప్రయత్నం చేస్తుండవచ్చు. స్త్రీపురుష విభేద సమస్యపై ప్రభుత్వం సారిస్తున్న దృష్టి వారి వ్యవస్థ రక్షణకు చేసే పనుల్లో ఒక భాగం మాత్రమే.

> **వనితలారా? విప్లవిస్తే**
> **పోయేదేమీ లేదు**
> **పితృస్వామిక బావజాలం**
> **సంకెళ్ళు తప్ప!**
>
> **శ్రమ విముక్తి**
> **జరగకుండా స్త్రీ విముక్తి**
> **జరగదు.**

మనలో ఎవరైతే స్త్రీలకోసం, స్త్రీలతో కలిసి పనిచేస్తున్నారో వారు స్త్రీ సమస్య తప్పనిసరిగా కులం, వర్గాలతో ముడిపడి వుందనేది గుర్తించాలి. స్త్రీలను ఎప్పుడూ అణచివేయ బడుతున్న జాతిగా గుర్తించి మద్దతు యివ్వాలి. స్త్రీకులమూ, వర్గమూ అనుభావాలను కూడా వారి సమస్య పరిష్కారంలో జోడించాలి. ఎవరైనా స్త్రీలను వారి భర్తలు కొట్టడం నుంచి, తాగుడు నుంచి రక్షించాలని కోరుకుం టారో వాళ్లు అస్పృశ్యతను, భూ సమస్య, కూలిరేట్ల సమస్యలను పక్కన పెట్టినట్లయితే పాలక వర్గాల ఉచ్చులో పడినట్లే. పురుష స్వామ్య పురుషాధిక్య రాజకీయాలను వదలిపెట్టి కేవలం 'రాజకీయ' సమస్యలను పట్టించు కోవాలనుకునే వారు వాస్తవంగా స్త్రీలలో దాగివున్న శక్తులను గుర్తించలేరు. వినియోగించుకోలేరు. ఉద్యమాలవైపు మళ్లించలేరు. ఈనాడు కేవలం స్త్రీ,పురుష వివక్ష సమస్యపై మహిళలను సంఘటిత పరచటం, సమీకరించటం ఎంత కష్టమో, కులం వర్గం సమస్యలపై ప్రజలను కదిలిం చటం కూడా అంతే కష్టం. ఇప్పుడు అన్ని రంగాలలోను, అన్ని అంశాలలో పనిచేస్తేనే గాని స్త్రీలలో దాగివున్న చైతన్య స్ఫూర్తిని వెలికి తీయలేము. పెంపొందించ లేము. స్త్రీలకు నాయకత్వం వహించే వారికి గ్రామాల్లో గుర్తింపు ఇచ్చేటట్లు చూడాలి. సంఘాలలో సమావేశాలలో స్త్రీలకు గుర్తింపునిచ్చి గ్రామ పంచాయతీలలో కూర్చోనివ్వాలి. ప్రపంచ జ్ఞానాన్ని వారికి తెలిపి వారిని ముందుకు నడిపించాలి.

**- గీతా రామస్వామి**

# మహిళలు – శ్రమ: ఒక పరిశీలన

శ్రమ చేసే మహిళలపై గత రెండు దశాబ్దాలుగా గణనీయమైన పరిశోధనలు జరిగాయి. ఈ పరిశోధనల ఫలితంగా వివిధ రంగాల్లో పనిచేసే మహిళలను గుర్తించారు. అనియత రంగంలో పనిచేసే మహిళలు, గ్రామీణ ప్రాంతాల్లో పనిచేసే మహిళలు, సంఘటిత రంగంలో పనిచేసే మహిళలు అని మూడు రకాలుగా విభజించారు. దీనికి కావలసిన సమాచారాన్ని మహిళల పని స్వభావము, పని పరిస్థితులు, వేతనాలు, సరయిన హోదా, గుర్తింపు కోసం వారి పోరాటాల నుంచి సేకరించారు. రెండు దశాబ్దాల పరిశోధనల ఫలితంగా తేలిన ముఖ్యమైన విషయాలు మనకు తెలుసు. అయితే ఇంకా కొన్ని ప్రశ్నలు అలాగే మిగిలి ఉన్నాయి.

**'పని చేసే మహిళ' అంటే ఎవరు?**

మహిళా ఉద్యోగినులలో ఉన్నత స్థాయివారు, దిగువ స్థాయివారు ఉన్నారు? ఉన్నతస్థాయి వైట్ కాలర్ ఉద్యోగాలు స్వతంత్ర వృత్తులలో మహిళల సంఖ్య చెప్పుకోదగినంతగా పెరిగింది. అందులో ఎక్కువ మంది ప్రభుత్వ రంగ సంస్థల్లోనే పని చేస్తున్నారు. వైట్ కాలర్ ఉద్యోగినుల్లో (కొందరు వీరిని పింక్ జాకెట్ ఉద్యోగినులు అని కూడా పిలుస్తారు.) ఎక్కువ మంది క్లర్కు స్థాయి ఉద్యోగాలు చేస్తున్నారు. సంఘటిత రంగంలోని మహిళా ఉద్యోగినుల్లో మెజారిటీ ఈ క్లర్కు స్థాయిలోనే ఉన్నారు. పశ్చిమ దేశాల్లో మాదిరిగా మన దేశంలో కూడా ఈ వృత్తిలో మొత్తం మహిళలే నిండి పోయారనే మాట నిజం కాకపోయినప్పటికీ ఇందులో మహిళల సంఖ్య మాత్రం బాగా పెరుగుతోంది. వీరి వల్ల దిగువ మధ్యతరగతి వర్గం ఏర్పడుతోంది. ముఖ్యంగా వీరి సంపాదన కుటుంబ పోషణకు, అభివృద్ధికి బాగా తోడ్పడుతోంది. ఈ స్థాయిలో పనిచేసే మహిళల జీతం వారు అవివాహితులైతే తల్లిదండ్రులకు, వివాహిత అయితే భర్త, పిల్లలకు (తరచుగా మామ, బావలకు) ఉపయోగపడుతోంది. పిల్లలకు ఉన్నత చదువులు చెప్పించడానికి, ఇల్లు కట్టుకోవడానికి కుటుంబం మరింత సుఖంగా జీవించడానికి వీరి సంపాదన ఉపకరిస్తోంది.

ఉద్యోగం చేసే మహిళ ఇంటి పని ఉద్యోగ బాధ్యత - రెండు బరువులు మోయాల్సి వస్తోంది. తీరిక లేని పనితో సతమతమయ్యే వీరికి ఇంటి పనిలో సహకరించే వారుండరు. ఇంటిపని, వంటపని పూర్తి చేసి ఉద్యోగ బాధ్యత నిర్వర్తించడానికి ఆఫీసుకు వెళ్ళాలి హడావిడిగా తయారై అన్నం కూడా తినకుండా టిఫిన్ డబ్బా బ్యాగ్‌లు పెట్టుకొని తొమ్మిందింటికల్లా బస్టాపుకు చేరుకుంటుంది. ఆమె పిల్లల్ని చూసుకోవడానికి క్రెచ్‌లు గానీ మరే ఇతర సౌకర్యాలు గానీ లేకపోవడంతో ఇరుగు పొరుగు వారినో బంధువులను ఆశ్రయించాల్సి వస్తోంది. కట్నకానుకలు ఇచ్చుకులేకపోవడం వల్ల కొందరు, ఉద్యోగం చేసే కూతురికి పెళ్ళి చేస్తే ఆమె సంపాదన తమకు దక్కదన్న దురాశతో కూతుళ్ళకు పెళ్ళి చేయలేక పోతున్నారు. దాని వల్ల ఒకటింట నాలుగు వంతు నుంచి మూడు వంతుల వరకు ఆడపిల్లలు ఒంటరిగానే మిగిలి పోతున్నారు. అయితే ఈ విషయంలో ఇంతవరకు ఖచ్చితమైన సర్వే జరుగలేదు.

ఆఫీసులో టీ టైంలో స్నేహితులతో కలిసి మాట్లాడుకోవడమే వినోదం. అయితే ఈ మాత్రానికే వారి మీద అనేక రకాలైన ఫిర్యాదులు వస్తున్నాయి. సీట్లో ఎప్పుడూ కనిపించరని, పని మీద శ్రద్ధ అనేదే ఉండదని, పనిలో ఘోరమైన తప్పులు చేస్తారని వీరిమీద తరచుగా ఫిర్యాదులు వస్తుంటాయి. అయితే వారు ఎక్కువ గంటలు పనిచేయాల్సి రావడం, వారి మీద ఇంటా బయట అనేక బాధ్యతలుండడం వల్ల వారు సరిగా నిర్వహించక పోవడాన్ని అర్థం చేసుకోవచ్చు. మహిళల పనిపట్ల ఆసక్తి కనబరచడం లేదని చాలా మంది జర్నలిస్టులు కూడా తరచుగా విమర్శిస్తుంటారు. అయితే ఈ మహిళల పరిస్థితిని మాత్రం పట్టించుకోరు. ఏ ప్రమోషన్లు, సృజనాత్మకత, చొరవ లేని ఉద్యోగంలో ఆసక్తి ఎలా ఉంటుంది? పెద్ద పెద్ద నగరాల్లో అయినా చిన్న పట్టణాల్లో అయినా ఇలాంటి పరిస్థితే ఉంది.

ఇకపోతే లెక్చరర్లు, ప్రొఫెసర్లు, డాక్టర్లు, లాయర్లు, మేనేజర్లు ఉన్నత స్థాయి ఉద్యోగాల్లోకి వస్తారు. ఈ స్థాయిలు కూడామహిళలుచెప్పుకోదగ్గ సంఖ్యలోనే ఉన్నారు. ఇలాంటి ఉన్నత స్థాయి ఉద్యోగాల్లో ఉన్న మహిళలు సాధారణంగా ఉన్నత స్థాయిలో ఉన్న వారినే పెళ్ళి చేసుకుంటారు. వారికి ఇంట్లో సకల సౌకర్యాలు అందుబాటులో ఉంటాయి. ఇంటి పనిలో సహాయ పడడానికి మనుషుల్ని నియమించుకుంటారు. పిల్లల్ని ఖరీదైన స్కూళ్ళకు పంపించడం, వారి కోర్కెల్ని తీర్చడం వారికి కష్టమేమీ కాదు. వీరిలో చాలా మంది పనిపట్ల శ్రద్ధ కనబరుస్తారు. తమ సామర్థ్యం, తెలివితేటల వల్లే బాగా పనిచేయగలుగుతున్నామని తమకు పనికిమాలిన ఫెమినిజం అవసరం లేదని వారు తరచుగా అంటుంటారు. మహిళలు తమ యిష్టానుసారం పని చేయడానికి వద్దనుకుంటే మానేసే అవకాశం ఉండాలని వీరు అంటుంటారు. వీరిని లేస్ కాలర్ ఉద్యోగినులు అందాం.

భర్తలు తమను బాగా అర్థం చేసుకుంటున్నారని ప్రగల్భాలు చెబుతుంటారు కానీ నిజానికి వారికి భర్తల నుంచి భావపరమైన మానసికమైన మద్దతు అందదు. భర్త పనిలో తీరిక లేకుండా ఆఘమేఘాల మీద తిరుగుతుంటాడు. ఆయనకు ఉన్నత ఉద్యోగం చేసే భార్య అదనపు స్టేటస్ సింబల్. ఆయన భార్య కష్ట సుఖాలను భావోద్వేగాలను పట్టించుకోవాలనుకోడు. పట్టించుకునే తీరిక కూడా ఉండదు. ఆమెకు ఆయన మీద ఒత్తిళ్ళు లేకుండా,, ఇంట్లో పనిచేయాల్సిన అవసరం రాకుండా ఉండేందుకు సరిపోయినన్ని వసతులు సమకూర్చుకుంటారు. వారి పిల్లలు మంచి బట్టలేసుకొని అందంగా తయారవుతారు,

కరాటే, డాన్సు, ఇంకా వారి ఆసక్తిని బట్టి ఏవైనా నేర్చుకోగలుగుతారు. వీరు పిల్లల్ని చాలా ఆరోగ్యంగా పెంచుకోగలుగుతారు. ఇలాంటి మహిళల గురించి విజయ సాధకులుగా మహిళా పత్రికలు బాగా రాస్తుంటాయి.

ఈ ఉన్నత స్థాయిలోని మహిళలు తమ ప్రతిభకు గుర్తింపును తెచ్చుకునేందు కోసం వృత్తి పరమైన సంఘాలను ఏర్పాటు చేసుకుంటారు. తాము వివక్షకు గురవుతున్నామనే విషయాన్ని వీరు తీవ్రంగా ఖండిస్తారు. ఒక చిన్న వర్గం మాత్రం ఫెమినిస్టులుగా మారి మహిళల సమస్యల విషయంలో వారికి మద్దతునిస్తున్నారు. తమ ఉద్యమాన్ని వ్యాప్తి చేయడానికి కృషి చేస్తున్నారు. మిగతా వారందరూ సగటు భారతీయ మహిళలే.

ఇక అత్యధిక సంఖ్యలో ఉన్న మిగతా మహిళల మాటేమిటి ? వ్యవసాయ కూలీలు, చిన్న చిన్న దుకాణదారులు, అనియత రంగంలోని కూలీలు, పరిశ్రమల్లో పనిచేసే మహిళా కార్మికులు బ్లూకాలర్ వాళ్ళు, బురద కాళ్ళు, బురద చేతుల మహిళల సంగతేమిటి? బీడి పరిశ్రమల్లో, ఇటుక బట్టీల్లో, భవన నిర్మాణ పనుల్లో, కాజు, కొబ్బరి నార, పట్టుపురుగుల పెంపకం మొదలగు రంగాల్లో ఎంతో మంది మహిళలు పనిచేస్తున్నారు. వీరంతా కనీస వేతనాలు లేకుండా, సరైన శిక్షణ, నైపుణ్యం ఉద్యోగ భద్రత లేకుండా బాధాకరమైన భయంకరమైన పరిస్థితుల్లో పనిచేస్తూ అనేక రకాలుగా దోపిడీకి గురవుతున్నారు. వీరు మూడు రకాల బాధలను, బాధ్యతలను భరిస్తున్నారు. ఉద్యోగ బాధ్యత, ఇంటి పనికి తోడు ధనస్వాముల అణచివేతకు గురవుతున్నారు. వీరికి ఇష్టమైతే పని చేయడం లేకపోతే మానేయడం లాంటి అవకాశాలుండవు, వాటిపైన ఆసక్తి ఉండదు. వాళ్ళ ఆసక్తి, ఆలోచనలన్నీ ఏరోజుకారోజు సమస్యగా ఉండే బతుకుదెరువు మీదే.

పనిచేసే మహిళల గురించి మాట్లాడేటపుడు అందరినీ కలిపేసి మాట్లాడ్డం మానేయాలి. ఎందుకంటే పనిచేసే మహిళలందరూ ఒకే రకమైన వారు కాదు. అందులో మూడు వేర్వేరు రకాల వారున్నారు. వారి కుటుంబ పరిస్థితులు, పని పరిస్థితులు, సమస్యలు కూడా వేర్వేరుగా ఉన్నాయి. పనిలో లింగ భేదాల గురించి స్త్రీల ఇంటి పని, బయటి పనుల గురించి సిద్ధాంతీకరించడం కొంత వరకు మేలు చేస్తుందేమో కానీ దాన్ని ఆధారంగా చేసుకొని ఫెమినిస్టు వ్యూహాలను తయారు చేయడానికి ప్రయత్నిస్తే ఇబ్బంది లెదుర వుతాయి. ఎందుకంటే లింగ భేదాలు, వర్గ భేదాలు ఒక దానితో ఒకటి భేదాలనే పదాలను అలంకారకంగా వాడేస్తున్నాము. కాబట్టి ఈ పదాలను మన ఫెమినిస్టు కార్యచరణ పతకాల్లో గుప్పించనవసరం లేదు.

## 2. ఉద్యోగం 'స్వేచ్ఛ' నిస్తుందా ?

మనం కొన్నింటిని నిజాలుగా భావిస్తుంటాం. అందులో ఒకటి : అర్థిక స్వాతంత్ర్యం ద్వారా స్త్రీకి స్వేచ్ఛ లభిస్తుంది' అనేది. అందువల్లనే స్త్రీలకు ఆదాయం చేకూర్చే పనులు కల్పించడం జరుగుతుంది. ప్రభుత్వ పథకాలేమి, స్వచ్ఛంద సేవా సంస్థలేమి స్త్రీలను విముక్తులను చె సేందుకు ప్రయత్నం చేస్తున్నాయి. దేశంలో ఇంత దారిద్ర్యం వుంటే ' విముక్తి' అనే పదానికి అసలు అర్థం వుందా? 'ఓ అమాయక పి.హెచ్.డి విద్యార్థిని తాను చేయబోతున్న పరిశోధన గురించి చర్చించడానికి కేరళ నుంచి పనిగట్టుకుని వచ్చింది. ఇ.ఆర్.డి.పి పథకం స్త్రీలకు ఉద్ధరించిందేమో ఆమె తెలుసుకోదలచింది' స్త్రీలను ఉద్ధరించడం అంత సులువని నేననుకోలేదు. ప్రతి మహిళకు ఓ గేదెనిస్తే ఆమె ఉద్ధరింపబడినట్టే ననుకుంటారు. స్రీల బాధ్యతలను, స్వేచ్ఛను అర్థం చేసుకోవడంలో చాలా పొరపాటు పడుతుంటారు. 'ఫెమినిస్టు' సిద్ధాంతాల పేర స్త్రీలపై మరింత భారం మోపుతున్నారు. ఎక్కువ 'శ్రమ' కల్పించి ఎవరికైనా 'స్వేచ్ఛ'ను ఎలా ప్రసాదిస్తారు నాకు అర్థం కావడం లేదు.

## 3. స్త్రీ శ్రమకు విలువ కట్టేదెవరు ?

స్త్రీల పట్ల వున్న న్యూనతా భావాన్ని కూడా పాశ్చాత్యా దేశాల్లోని ఫెమినిస్టు విశ్లేషకులు మార్క్సిస్టు చట్రంలోనే బిగించజూస్తారు. ఉత్పత్తి సంబంధాలు ఎలాగైతే 'వర్గా'లను నిర్దేశిస్తాయో, సంతానోత్పత్తి సంబంధాలు కూడా అధిక, న్యూనత భావాలను నిర్దేశిస్తాయని వారి వాదన. వేతనాల విషయంలో స్త్రీల పట్ల వివక్ష ఎందుకు చూపుతారు ? అసలు స్త్రీ శ్రమ విలువను ఏ విధంగా లెక్క గడతారు ? కృషి రంగంలో ముఖ్యమైన భూమిక నిర్వహించే స్త్రీకి తగిన గుర్తింపు ఎందుచేత ఇవ్వడం లేదు ? దీనికి అనాదిగా చెబుతున్న జవాబు ఒకటే, పితృస్వామ్య విలువలు ఈ రకమైన వివక్షకు కారణమని అంటారు. అసలు ఈ విలువలు చాలా నేర్పుగా అపాదిస్తుంటారు. ఏదో అపాదించి దాన్ని నిజమని నమ్మింపజేసేస్తుంటారు. సిద్ధాంత పరంగా మాట్లాడితే పనిలో లింగ భేదాలు పెట్టుబడిదారీవ్యవస్థ చలవే. నిజానికి పనిలో భేదాలు అసలు సమస్య కాదు. లింగాన్ని బట్టి పనిలో వైవిధ్యం వుండవచ్చు. చేసిన శ్రమకి ఎంత ఫలితం వస్తుందన్నదే సమస్య. శ్రమ విలువ విషయంలోనే వివక్ష వుంటున్నది. అయితే ఓ కుటుంబంలో శ్రమ ఫలాలు ఎవరి ఆధిపత్యంలో వుంటాయి. అంటే సర్వే ప్రకారం కుటుంబం ఆధిపత్యంలో వుంటాయి (పురుషుల పెత్తనం వుంటుందనుకోండి). నిరుపేదల విషయంలో స్త్రీలే తమ డబ్బును ఖర్చు చేస్తుంటారు.

వనరులపై పెత్తనం సాధించేందుకు జరుపుతున్న పోరాటమే స్త్రీలు సమానత్వం కోసం చేసే ఉద్యమానికి నాంది. అయితే ఈ పేదరికంలో ఆ విజయం చెప్పుదగ్గదేమీ కాదు. వనరులపై ఆధిపత్యం కోసం స్త్రీలు ఉద్యమిస్తున్నారంటే వాళ్ళు పితృస్వామ్య న్యాయ వ్యవస్థనే సవాలు చేస్తున్నారన్న మాట. సాధారణంగా వేతనాల కోసం పురుషులు జరిపే ఉద్యమంలో స్త్రీలను కూడా సమీకరిస్తారు. మరి స్త్రీలు వేతనాల కోసం ఉద్యమిస్తే పురుషుల మద్దతు సమీకరించగలరా ? ఇంత వరకు ఇది జరగలేదు.

'స్త్రీలు, వారి శ్రమ విలువ' గురించి అధ్యయనం చేసినపుడు కేవలం కొన్ని సంఘటనలను ఉదహరించడంతో ఆగిపోకుండా విశ్లేషణాత్మక అవగాహన పెంపొందించే ప్రయత్నం చేయాలి.

(1) శ్రమ స్వభావం; వివిద వర్గాల స్త్రీలలో అది ఏ విధంగా వుంటుంది. అదే విధంగా వారి మధ్య సంబంధాలు ఉదాహారణకి ఓ మధ్య తరగతి ఉద్యోగినికి ఆమె దగ్గర పని చేసే పనిమనిషికి మధ్య వుండే సంబంధం,

(2) పనిలో 'నియంత్రణ' అంశం.

(3) శ్రమఫలితం వితరణ విధానం

ఈ అంశాలను విశ్లేషణాత్మకంగా అధ్యయనం చేయాలి

**మూలం: మైత్రేయి కృష్ణరాజ్**
**అనువాదం: వి. చంద్రమౌళి**

# స్త్రీలు–కులం, లైంగికత్వం

కుల వ్యవస్థ భారత సామాజిక విధానాన్ని చిక్కుముడి తయారు చేసింది. కుల సమాజిక వ్యవస్థలో జీవిస్తున్న స్త్రీలు అన్ని సమాజాల్లో స్త్రీలు అనుభవించే అసమాన జీవన విధాన్ని, దాడుల్ని అనుభవిస్తూనే దొంతర్లుగా విడగొట్టబడి ఉన్న కుల వ్యవస్థ తెచ్చిపెట్టే అదనపు బాధల్ని కూడ అనుభవించాల్సి వస్తున్నది. స్త్రీలపై జరిగే అత్యాచారాలు అన్ని సమాజాలకు మామూలే. ఎందుకంటే ప్రపంచంలోని అన్ని సమాజాలు కూడ పితృస్వామిక వ్యవస్థలే కనుక. అంటే, పితృస్వామిక సమాజాల ఉనికే స్త్రీ పురుషుల మధ్య ఒక 'అసమాన' జీవన విధానాన్ని రూపొందించింది. అందులో స్త్రీ అధమురాలు, పురుషుడు అధిక్యుడు. ఈ పితృస్వామ్య వ్యవస్థ స్త్రీని అణిచివేసే అణిచివేతలకు కుల అణిచివేత తోడైతే, ఈ అణిచివేతల సమ్మేళనం స్త్రీని శారీరకంగా మానసికంగా మరింత కృంగదీసి వారి జీవన సరళిని పూర్తిగా కుంటుపర్చగలదు. చిరకాలంగా భారతదేశంలో కొనసాగుతూ వచ్చిన 'సతి సహగమనము' బాల్య వివాహాలు, వితంతు జీవనం పితృస్వామ్య విలువలకు కుల విలువలు జోడించడంతో ముందుకొచ్చినవే. మనం గుర్తుంచుకోవలసిందేమంటే 'సతి' వితంతు విధానం (బాల్య వివాహాలను మినహాయించినా) దోపిడి కులాల్లో మాత్రమే అమలులో ఉండేవి. ఎన్నో కారణాల వల్ల దోపిడీ కులాల్లోని స్త్రీలు దోపిడి చెయ్యబడుతున్న కులాల్లోని స్త్రీల కంటే ఎక్కువ అణిచివేతను బాదర బందీలను ఎదుర్కొంటారు. ఉదాహరణకు 'భార్యను కొట్టడం' దోపిడికి గురయ్యే కుల, వర్గాల్లో ఎక్కువగా ఉండవచ్చు. కాని ఈ స్త్రీలకు తమ బాధల్ని వెళ్ళబోసుకొనేందుకు చాల అవకాశాలుంటాయి. శ్రామిక వర్గ కులాల్లో పుట్టిన మనందరికి తెలిసిన విషయమేమంటే శ్రామిక వర్గ/కుల స్త్రీలకు తాము పనిచేసే పొలాలు తమ అనుభవాల్ని కలబోసుకునేందుకు, తమ కోపతాపాలను బాదరబందీలను చెప్పుకునేందుకు భార్యలను హింసించే భర్తలను అనభ్యంగా ప్రవర్తించే పురుషులందర్నీ విమర్శించేందుకు మంచి వేదికలు. కాని దోపిడీ కులాల్లోని స్త్రీల పరిస్థితి పూర్తిగా భిన్నంగా ఉంటుంది. వారు పొలాలకు దూరంగా ఉండడం వల్ల కుటుంబ బందీలుగా జీవించడం వల్ల కుటుంబం వారి జీవితాన్ని సతమతం చెయ్యడమే కాక వారిని కుంగదీస్తుంది. ఈ తంతంతా ఆర్థికంగా వారు శ్రామిక వర్గ స్త్రీల జీవితం కంటే మెరుగైన జీవితం గడుపుతున్న తరుణంలోనే జరుగుతుంది. దోపిడీ కులాల్లోని స్త్రీలు అణిచివేతకు, పరాయీకరణకు గురౌతున్న ఒక వర్గం.

ఈ వ్యాసంలో కుల నిర్మూలనా పోరాటాలు ఉధృతమౌతున్న దశలో, ఈ పోరాటాలపై అగ్రకుల 'అధిక్యతా వాదులు' తమ కులతత్వంతో విరుచుకు పడుతున్న దశలో దళిత స్త్రీలపై దోపిడీ కుల స్త్రీలపై ఏ రకమైన ప్రభావముంటుందనేది పరిశీలిద్దాం. చుండూరులో రెడ్డి భూస్వాములు 8 మంది దళితులను ఊచకోత కోసారు. అది పోలీసులతో కుమ్ముక్కై చేశారు. నల్లగొండ జిల్లాలోని చల కుర్తిలో ముత్తమ్మ అనే ఒక గొల్ల స్త్రీ (బిసి)ని అక్కడి రెడ్డి భూస్వాములు బట్టలు విప్పి ఊరేగించి ఆమె మర్మాంగంలో కారం పోసారు. ఈ రెండు సంఘటనలు మనకు స్త్రీకి సంబంధించిన కొన్ని ఆచరణ సిద్ధాంత సమస్యలను చర్చించడానికి ఉపకరిస్తాయి.

దోపిడీ కుల, పితృస్వామ్య, పురుషాధిక్యత సంస్కృతి దళితులపై దాడులు జరిగినప్పుడల్లా చాల విచిత్రంగా బయటపడుతుంది. చుండూరు హత్యాకాండ జరిగాక, కారంచెడు హత్యాకాండ సందర్భంలో జరిగినట్లే, ఈ హత్యాకాండను సమర్థించుకోవడానికి చాల విచిత్రమైన వదంతులు సృష్టించి ప్రచారం చేశారు. దళిత యువకులు దోపిడీ కుల స్త్రీలను అవమానపరిచారని, లేదా వారిపై అత్యాచారాలు చేశారనేది దాని సారాంశం. ఈ సంఘటన జరిగాక 48 గంటలు తర్వాత వార్తా పత్రికల కెక్కిన ఈ హత్యాకాండ వార్త అది జరుగడానికి కారణం "దళితులు రెడ్డి స్త్రీలను అవమాన పర్చడం, అత్యాచారాలు జరుపడం" అని పేర్కొనడం జరిగింది. కాని ఏ వార్తా పత్రిక కూడ ఈ సంఘటనపై ఒక పరిశిలన చేసి వాస్తవాలను ప్రకటించలేదు. పత్రికలే కాదు దోపిడీ కుల స్త్రీలు తమ ప్రచారం కోసం స్థాపించుకున్న "భారతీయ మహిళా సేవా సమితి" రెడ్డి స్త్రీలపై అత్యాచారాలు జరిపిన దళిత యువకుల పేర్లుగాని, రెడ్డి స్త్రీల పేర్లు గాని చెప్పలేదు. ఐనా ఈ సంఘటనలు నిజంగానే జరిగాయని జనం నమ్మేంతగా ప్రచారం చేసారు. ముఖ్యంగా దోపిడీ కుల జనాభా అంతా ఈనాడు ఆ ప్రచారాన్ని నమ్ముతున్నారు. "ఆ నేరానికి" 8 మందిని హత్య చెయ్యవచ్చని కూడ వాళ్ళు నమ్ముతున్నారు. వారి శరీరాలను ముక్కలు, ముక్కలుగా నరికి బస్త సంచుల్లో కుక్కి తుంగభద్ర కాలువలో వెయ్యొచ్చని కూడ నమ్ముతున్నారు. అన్ని పత్రికలు ఈ విషయాన్ని ప్రచారం చేశాయి. దోపిడీ కుల సభలు, సమావేశాల్లో ఇదే విషయాన్ని పదే పదే ప్రచారం చేశారు. కాని విచిత్రమేమంటే దళితుల చేత అత్యాచారానికి గురైన ఒక్క స్త్రీ పేరు కూడ చెప్పలేదు. ఈ విధంగా అత్యాచారానికి గురైన ఏ స్త్రీ పేరు కూడ ఎందుకు చెప్పలేదు?

ఇట్లా పేర్లు చెప్పకుండా ఉండడానికి రెండు కారణాలు ఉండొచ్చు. ఒకటి, దళిత పురుషుల మధ్య దోపిడీ కుల స్త్రీల మధ్య సమస్యలకు ఘర్షణలకు దారి తీసే స్త్రీ పురుష సంబంధాలు లేవని కాదు. (ఆ సంబంధాలు సెక్స్ సంబంధాలు కావచ్చు ఇతర సంబంధాలు కావచ్చు). దోపిడీ కుల స్త్రీలతో దళిత పురుషులు సరసాలు ఆడి ఉండవచ్చు. కోస్తా జిల్లాల్లో క్రమంగా వస్తున్న సాంఘిక మార్పుల్లో భాగంగా దళిత పురుషులు

దోపిడీకుల అమ్మాయిలతో గాని స్త్రీలతో గాని మాట్లాడి ఉండవచ్చు. ఈ క్రమంలో వారి మధ్య స్నేహ సంబంధాలు ఏర్పడి ఉండవచ్చు. బహుశా కొంతమంది దళిత యువకులు రెడ్డి కులానికి చెందిన స్త్రీలను పెండ్లి చేసుకోవాలనే ప్రయత్నం చేసి ఉండవచ్చు. ఇవన్నీ కూడ జరిగేందుకు అవకాశముంది. అయితే కుల సంస్కృతి గల ఈ సమాజంలో ఈ విధమైన సంఘటనలు దోపిడి కులస్తులకు తమ కులంలోని ఒక వ్యక్తిని హత్య చేసిన దాని కంటే ఎక్కువ కోపాన్ని తెప్పిస్తాయి. కాని అదే సందర్భంలో దోపిడీ కుల స్త్రీలు గాని, పురుషులుగాని ఈ సంఘటనలతో ముడిపడివున్న స్త్రీల పేర్లు మాత్రం బయట పెట్టడానికి సాహసించరు. ఎందుకంటే దోపిడీ కులస్త్రీల లైంగికత్వం చాల పవిత్రమైందని, అది పితృస్వామ్య విలువల పరిరక్షణకు అత్యంత కీలకమైనదని, వారి పేర్లు బయట పెట్టినట్లైతే అగ్రకుల పురుషులు వారితో కలిసి జీవించరని, ఒక వేల వారు పెండ్లి కాని వారైతే తమ కులాల్లోని అబ్బాయిలతో వారికి పెండ్లిళ్ళు కావని వీరంతా నమ్ముతారు. వారనుకున్నట్లు జరిగే సామాజిక పరిస్థితులు సృష్టిస్తారు.



రెండవది, దోపిడీ కుల స్త్రీల కులాంతర పురుషులతో సంబంధాల్లోకి తమ ఇష్టంగా పోయినా లేదా వారి మీద బలత్కారం జరిగినా ఇలాంటి సంబంధంలో ఆమె ఇరుక్కున్నదని తెలిసిన మరుసటి రోజు నుండి ఆ కుటుంబంలో ఆమె జీవించడం కష్టం. ఒక వేల ఆమె తన ఇష్టంతోనే ఒక సంబంధంలోకి పోయిందని తెలిసిందనుకో ఆ మరుసటి క్షణం నుండి ఆమె ప్రాణాలతో ఆ ఇంట్లో బ్రతకడం అసాధ్యం. దళితులపై జరిగే దాడులైనా బయటికొస్తున్నాయి కాని దోపిడీ కులాల్లోని స్త్రీలు ఎవరైతే దళిత పురుషులతో సంబంధాలు పెట్టుకుంటారో వారి మీద జరిగే హత్యకాండ మాత్రం అసలు బయట ప్రపంచానికి తెలియదు. ఎందుకంటే హత్యాకాండ "ప్రయివేటు రంగం" గుర్తించబోతున్న కుటుంబంలో జరుగుతుంది. ఈ కుటుంబం "పవిత్రమైంది" కనుక అందులో జరిగే స్త్రీ హత్య బయటికి పొక్కడానికి వీలులేదు. ఒక వేళ అదే కులానికి చెందిన స్త్రీ పురుషులకు ఆ విషయం తెలిసినప్పటికి వారు దాన్ని బయటికి పొక్కకుండా జాగ్రత్త పడతారు. ఎందుకంటే స్త్రీ లైంగికత్వానికి కుల ఆధిపత్యానికి చాల దగ్గర సంబంధం ఉంది. కనుక ఈ విధంగా "తక్కువ" కులాల్లోన్ని పురుషులతో సంబంధాల్లోకి పోయిన స్త్రీలు తమ "అగ్రకుల" ఆధిపత్యానికి భంగం కలిగించిన వారౌతారు. కులతత్వ సమాజంలో దోపిడీకుల ఆధిపత్యానికి గుర్తు తమ కులంలోని స్త్రీల లైంగికత్వం మీద తమకు పూర్తి ఆధిపత్యం ఉన్నదా లేదా అనేదే గీటు. ఈ విధంగా స్త్రీల లైంగికత్వం దోపిడీ కుల ఆధిపత్యాన్ని కాపాడందుకు ఉవయోగించే ఒక సాధనంగా ఉపయోగించబడుతుంది. అందుకే చుండూరు దళితులు దోపిడీ కుల స్త్రీలపై లైంగిక దాడులు చేశాడనే వదంతులు రెడ్డి హంతకులకు వెంటనే దోపిడీ కుల మద్దతును అతి త్వరలో సమీకరించింది. ఈ వార్త విన్న వెంటనే దోపిడీ కులాల్లోని వారంతా తమ మద్య ఉన్న విభేదాలకు తిలోదకాలిచ్చి ఆ ప్రాంతంలోని వారంతా రెడ్డి హంతకులకు మద్దతును సమీకరించారు.

అంతే కాదు వారు 'సర్వజనాభ్యుదయ సమితి' అనే ఒక దోపిడీ కుల సంస్థను కూడ స్థాపించారు.

దోపిడీకులం వారు గతంలో కూడ ఎంతో మంది దళిత యువకుల్ని చంపిన ఉదాహరణలు మనకు చెప్పేదేమంటే దోపిడీ కులాల వారు తమ కుల ఆధిపత్యానికి స్త్రీల లైంగిక జీవితానికి బలమైన ముడివేశారు. 20 సంవత్సరాల క్రితం కంచికచెర్లలో (కృష్ణాజిల్లా) కోటేష్ అనే ఒక దళిత జీతగాన్ని దోపిడీ కుల భూస్వాములు చంపారు. ఈ హత్య ఆంధ్రలో దళితులపై అత్యాచారాలకు నాందిగా కూడ చెప్పుకుంటారు. అతన్ని ఆ విధంగా హత్య చెయ్యడానికి కారణం అతను ఆ ఇంటిలోని భూస్వామ్య స్త్రీతో సంబంధాల్లోకి పొయ్యాడనేది. కాని ఇప్పుడు అమలులో ఉన్న కుల, అధికార సంబంధాలలో ఈ భూస్వామ్య స్త్రీ అంగీకారంతో కాకుండా అతను ఆమెతో సంబంధాలు పెట్టుకునే అవకాశమే లేదు. ఆమె అంగీకారమే కాదు వారిద్దరి మధ్య పరస్పర ఆకర్షణ, ఆదరణ లేకుండా ఒక ఇంటిలో జీతగాడు ఒక భూస్వామ్య స్త్రీతో లైంగిక సంబంధాల్లోకి పొయ్యే అవకాశమే ఉండదు. అంటే కుల వ్యవస్థ లేని సమాజంలో ఇది జరిగి ఉంటే ఒక భూస్వామ్య స్త్రీ తమ ఇంట్లోని పనిమనిషిని ప్రేమించిందని చెప్పేవారు. ఆ స్త్రీ తన భూస్వామి భర్తకు విడాకులిచ్చి ఆమె తాను ప్రేమించిన వ్యక్తితో జీవించవచ్చు అనేవారు. కాని కులవ్యవస్థ, కుల సంస్కృతి ప్రకారం ప్రేమ అనురాగాలు ఒక దోపిడీ కుల స్త్రీ మధ్య అదే కులానికి చెందిన పురుషుని మధ్య జరుగాల్సిందే గాని మరో రకంగా వీలులేదు.

అయితే సమాజ స్థాయిలో అమలులో ఉన్న పితృస్వామ్య విలువలు పురుషుని ప్రేమకు మాత్రం కుల బంధాన్ని వెయ్యవు. దోపిడీ కులాలకు చెందిన పురుషులు దోపిడికి గురయ్యే అన్ని కులాల స్త్రీలను ప్రేమించవచ్చు, అనుభవించవచ్చు. దళిత కులాల్లో పుట్టిన స్త్రీలు వారిని ప్రేమించారా, లేదా అటువంటి లైంగిక జీవితానికి అంగీకరించారా అనే దానితో సంబంధం లేదు. కాని ఇందుకు భిన్నంగా దళిత కులాల్లోని పురుషులు దోపిడీ కులాల్లోని స్త్రీలు తమను ప్రేమించినా, లైంగిక సంబంధాలకు అంగీకరించినా అట్లా సంబంధాలు పెట్టుకోవడానికి వీలులేదు. ఇంతెందుకు, దోపిడీ కుల స్త్రీలు దళిత పురుషులతో మాట్లాడినా అది ఒక నేరంగా పరిగణిస్తారు. ఈ విధంగా దోపిడీల మధ్య దళిత కుల పురుషుల మధ్య ఏ రకమైన సంబంధాలేర్పడినా పరిణామాలు ప్రమాదకరంగా తయారౌతాయి. కాని దళిత స్త్రీలు దోపిడీ కుల పురుషులతో సంబంధాల్లోకి పోతే ఈ పురుషుల్ని నేరంగా గుర్తించరు. దోపిడీ కుల పురుషులకు అలాంటి హక్కు, అధికారం ఉందని వారి కులస్తులంతా భావిస్తారు. దోపిడీ కుల పురుషులు దళిత స్త్రీలు తమను ప్రేమించినా, ప్రేమించకపోయినా వారిని లొంగదీసుకునే హక్కు వారికున్నట్లు దోపిడీ కుల 'సభ్య సమాజం' భావిస్తుంది. దళిత పురుషుడు మాత్రం దోపిడీ కుల స్త్రీ తనను ప్రేమించినా అతను హత్యకు పాత్రుడని దోపిడీ కుల సమాజమంతా భావిస్తుంది. అంటే రాజ్యం బదులు ప్రతినిత్యం మానవ సంబంధాల్లో ఉండే "సభ్య సమాజం" కూడ కులాల ప్రాతిపదికపై రండుగా చీలి ఉందన్నమాట. అది రాజ్యం నియమించిన సమన్యాయంతో నిమిత్తం లేకుండా "కుల న్యాయాన్ని" ఆచరణలో పెట్టింది. ధనం, రాజ్యం కూడ దోపిడీ కుల 'సభ్య సమాజం'తో చట్టా పట్టా లేసుకుని ఉంటుంది కనుక దోపిడీ కుల స్త్రీతో ఏ రకమైన సంబంధంలోకి పొయ్యిన పురుషుడైనా హత్యకో మరో రకపు శిక్షకో గురౌతాడు. 1960 దశకంలో కంచికచెర్ల కోటేశ్ అలాగే హత్యకు గురయ్యాడు. 1990 మర్చిలో అర్లప్ప అనే దళితుడు ఇలాంటి "నేరానికే" సజీవ సమాధి చెయ్యబడ్డాడు. 1990 జూన్‌లో అనంతపురం జిల్లాలోని కొత్త పులవండ్లపల్లిలో ఇటువంటి నేరానికి పాల్పడ్డాడని భూస్వాములు జీతమున్న అతన్ని సజీవ దహనం చేశారు.

నల్లగొండ జిల్లాలోని చెలకుర్తి సంఘటన కూడ దోపిడీ కుల సంస్కృతి. బహుజన స్త్రీల జీవితంతో ఎట్లా చెలగాటమాడుతుందో చూడడానికి మరో మైలురాయి. ఈ సంఘటన చుండూరు ఘటన జరిగిన వారం రోజులకే జరిగింది. చుండూరు గుంటూరు జిల్లా రెడ్డి భూస్వాముల దుర్మార్గానికి అద్దం పడితే చెలకుర్తి నల్లగొండ రెడ్డి భూస్వాముల దుర్మార్గానికి అద్దం పడుతుంది. చెలకుర్తిలో జయమ్మ అనే ఒక రెడ్డి స్త్రీ, గోవిందు అనే ఒక గొల్ల యువకున్ని ప్రేమించింది. వారిద్దరి మధ్య సంబంధాలు చాలా కాలం నుండి కొనసాగుతున్నాయి. జయమ్మ అన్న నారాయణరెడ్డి వీరిద్దరి సంబంధాన్ని ఉపయోగించుకొని చాలా డబ్బు లాగాలని చూస్తున్నాడనే భయంతో వారిద్దరుఊరు విడిచి ఆగస్టు 4, 1991 న పారిపొయ్యారు. మరొక గొల్ల స్త్రీ అయిన ముత్తమ్మ వీరిద్దరు పారిపోవడానికి సహకరించిందని నారాయణ రెడ్డి (ఇతను ధనవంతుడు కూడా కాదు) పర్వతరెడ్డి, వెంకటరెడ్డి, అనే ఇద్దరు భూస్వాములతో కలిసి ముత్తమ్మను ఒక రోజు పొలం నుండి పిలిపించి విపరీతంగా కొట్టి, బట్టలు విప్పి, ఆమె మర్మాంగాల్లో కారంపొడి పోసి కర్రతో కుక్కి ఆ నగ్న స్థితిలోనే ఆమెను మూడు గంటలు ఊరి రోడ్ల మీద ఊరేగించారు. ముత్తమ్మ మర్మాంగమంతా గాయమవ్వడం వల్ల సెప్టెంబరు మధ్యనాటికి కూడా కోలుకోలేదు.

చుండూరు సంఘటన జరిగిన కొద్ది రోజులకే ఈ సంఘటన జరిగింది కనుక ఈ రెండు సంఘటనలు కొద్ది రోజులు రాష్ట్రాన్ని కుదిపి వేశాయి. పర్వతరెడ్డిని కొద్ది రోజులకే జనమో, పోలీసులో (ఎవరు చంపారనేది తేల లేదు) చంపేశారు.

ఈ సంఘటన మనకేం తెలియజేస్తుంది. దోపిడీ కులాల వారు బహుజనుల మీద తమ ఇష్టం వచ్చినట్లు దాడులు చెయ్యగలరు. అంతేకాక స్త్రీ లైంగికత్వానికి కుల దృక్కోణం కూడ ఉంది. ఒక దోపిడీ కుల స్త్రీ ఒక బి.సి. అబ్బాయిని ప్రేమిస్తే చాల కేసుల్లో చంపేస్తారు. అయితే ఈ విషయంలో గోవిందు దొరకలేదు. అతని బంధువైన ముత్తమ్మ ఈ విధమైన కుల- లైంగిక దాడికి గురైంది. ఒక కులాన్నంతా అవమాన పర్చాలన్నా ఆ కుల స్త్రీలను

అవమానిస్తారు. తిడతారు. అయితే శారీరకంగా దెబ్బలు కొట్టిన దానికంటే ఆమె లైంగికత్వం మీద దాడిచేస్తే అవమానమూ బాధ ఎక్కువని సమాజమంతా అనుకుంటుంది. సామాజిక విభజనలో కులస్థాయి తగ్గినా కొద్దీ ఆ కులంలోని స్త్రీలు ఎక్కువ దాడులకు, తిట్లకు అవమానాలకు గురౌతారు. వీరినలా చెయ్యడం దోపిడీ కులాల్లో పుట్టిన పురుషులు అది తమ హక్కు అనుకునే స్థితికి తీసుకెళ్ళిన సామాజిక వ్యవస్థ కులం. ఉదాహరణకు ఒక దళిత స్త్రీ ఒక అగ్రకుల పురుషున్ని ప్రేమించో లేదా బలవంతాన్నో అతనితో పాటు ఊరు విడిచి పోతుందనుకోండి ఆ దళితులు ఆ పురుషుని బంధువుల్ని వేధించగలరా? అధికారం రీత్యా అది వారికి సాధ్యం కాదు. ఏదైతే సామాజిక సంబంధాలలోని అధికరం రీత్యా సాధ్యం కాదో, క్రమంగా వీరు అటువంటి చర్యను సరైన చర్య కాదని నిర్వచించుకుంటారు. అంటే అది వారి సంస్కృతి అవుతుంది. ఆ సంస్కృతి భాషలో, భావంలో వ్యక్తమౌతుంది. "పెద్ద కులం వారిని అవమానిస్తారా", "పెద్ద కులం స్త్రీలను ప్రేమిస్తారా" అని చెప్పుకునే మాటలు ఆ సంస్కృతి ప్రతిరూపాలు. అంటే కుల సంస్కృతి పెద్ద కులపు స్త్రీ లైంగికత్వానికి ఒక విలువ, చిన్నకులం స్త్రీ లైంగికత్వానికి ఒక విలువ, పెద్దకులం పురుషుని లైంగికత్వానికి ఒక విలువ, చిన్న కులం పురుషుని లైంగికత్వానికి ఒక విలువ కడుతుంది.

ఈ క్రమం మొత్తం దోపిడీ కులాల్లో పుట్టే స్త్రీలు బహుజన కులాలలోని పురుషులతో సంబంధాలేర్పరుచు కున్నప్పుడు ఆ స్త్రీలు మూల్యం చెల్లించవలసి రాదని నేను చెప్పడం లేదు. వారు చాల పెద్ద మూల్యాన్ని చెల్లిస్తారు. తమ కులంలోని వారినే ప్రేమించాలి లేదా పెళ్ళి చేసుకోవాలి అనేది ఆ స్త్రీలు చెల్లించే పెద్ద మూల్యం. అంటే మానవుల మధ్య ఉండవలసిన ఆకర్షనను, ప్రేమను కులం, కుల పరిధిలోకి కుంచిస్తుంది. ఇక్కడ దళిత కులాల్లోని పురుషుడెంత నష్టానికి సాంఘీక బంధనకు గురౌతాడో, దోపిడీ కుల స్త్రీ కూడా అంతే బంధనాలకు గురౌతుంది. అయితే ఇవాల ఉన్న సాంఘీక బంధనాల్లో "కుల పరిధిలో ప్రేమ పెళ్ళి" అనివార్యం కనుక మొదట మానసిక స్థితిని సాంఘీక అనివార్యంగా (కుటుంబ అనివార్యంగా కాదు) సరి పెట్టుకొని "మా కులంలోనే నాకు నచ్చిన వానితో పెళ్ళి జరిగితే బాగుండు" అనే కుదింపు సంతృప్తికి వస్తారు దోపిడీ కుల స్త్రీలు. అయితే ప్రేమ పెళ్ళి విలువలు ఉనికిలో ఉంటేనే "కులం నిబంధన ప్రమాదంలో పడుతుందని" కనుక అది ప్రేమనే బ్యాన్ చేసింది. భారతదేశంలో అసలు ప్రేమ బ్యాన్ కావడానికి మూల కారణం కుల వ్యవస్థ. ఉదాహరణకు ఒక దోపిడీ కులంలో పుట్టిన స్త్రీ ఒక దళితున్ని ప్రేమించిందో, సంబంధం పెట్టుకున్నదో అనుకుందాం. అట్లా చేసినందుకు ఆమెను ముందు నాలుగు గోడల మధ్య బందించి వేస్తారు. ఆమె పిచ్చిదంటారు, చిత్రహింసలకు గురిచేస్తారు. నిజానికి చాల కేసుల్లో అట్లాంటి స్త్రీని లోలోపల్నే చంపుతారు. మనం ఇంతకు ముందే చెప్పుకున్నట్లు ఆ వార్త బయటికి రానివ్వరు. ఆ స్త్రీ తల్లిదండ్రులు కూడ 'దుర్మార్గురాలికి తగిన శాస్త్రి' జరిగిందనుకుంటారు. బంధువులు, తోటి కులస్తులు 'మన ధర్మాన్ని, మన పరువును ఈ విధంగా చంపడంతో నిలబెట్టుకున్నామనుకుంటా'రు.

దోపిడీ కులాల్లో పుట్టిన స్త్రీలు బహుజన కులాల్లో పుట్టిన పురుషులతో సంబంధం పెట్టుకున్నందుకు ఇప్పటికి ఎంతో మంది స్త్రీలు హత్యకు గురై ఉంటారు. ముత్తమ్మ అనుభవించిన కిరాతకం కంటే ఎక్కువే అనుభవించి ఉంటారు. కాని అది బయటికి రాదు. దోపిడీ కులాల సంస్కృతికి బహుజన కులాల సంస్కృతికి ఉన్న మౌళిక తేడా ఇదే. ముత్తమ్మకు ఇట్ల జరిగినంక ఆమె భర్త ఆమెతో ఉన్నాడు (అదేదో గొప్ప త్యాగం అని కాదు నా ఉద్దేశ్యం) కాని దోపిడీ కుల పురుషులైతే ఈ మానవతా విలువలను కూడ గౌరవించరు. ఒక వేల అటువంటి స్త్రీని చంపకపోతే ఆమెను 'నిత్య నరకం' అనుభవించేటట్లు చేస్తారు. ఆమె జీవితం దోపిడీ కులంలో జీవించే 'విధవ' కంటే బాధాకరంగా ఉండేట్లు చేస్తారు. అన్నిటికంటే ఘోర మేమంటే ఆమెకు ఏం జరుగుతుందో బయటికి తెలువనియ్యరు. కనీసం కోటేశుకేమైందో మనకు తెలుసు, అర్జవ్వకేమైందో మనకుతెలుసు, ముత్తమ్మకేమైందో మనకు తెలుసు, కాని దళిత కులాల్లోని పురుషులతో సంబంధాలు పెట్టుకున్న స్త్రీలకైమైందో మనకు తెలియదు.

చుండూరు దళితులు దోపిడీ కుల స్త్రీలతో సంబంధాలు పెట్టుకున్నారనే దానికి మరొక దృక్పథం కూడా ఉంది. చుండూరు దళితులు పెరుగుతున్న చైతన్యానికి ఒక మంచి ఉదాహరణ. చుండూర్‌లోని దళిత యువకులు 'అంటరానితనానికి' వ్యతిరేకంగా ఎన్నో రూపాల్లో పోరాడారు. వీరు దోపిడీ కులాల వాడలో అంబేద్కర్ విగ్రహాన్ని నిలబెట్టాలని చూశారు. దీన్ని దోపిడీ కులాల వారు వ్యతిరేకించారు. పండుగల సందర్భంగా నాటకాలు గాని భాగోతాలు గాని జరిగితే దోపిడీ కులాల వారి మధ్య మేం కూర్చుంటామని పట్టుపట్టారు. కొన్ని సందర్భాల్లో వారు విజయాన్ని సాధించారు. అంబేద్కర్ విగ్రహాన్ని నిలబెట్టారు. 1990 దసరానాడు వేసిన డ్రామా సందర్భంగా దోపిడీ కులాల మధ్య కూర్చున్నారు. అక్కడ దళిత యువకులు దోపిడీ కులాల యువకుల కంటే ఎక్కువ చదువుకున్నారు (ఇక్కడి దళితుల్లో గ్రాడుయేట్లు, పోస్టు-గ్రాడ్యుయేట్లు అగ్రకులాల్లో కంటే ఎక్కువ) ఈ స్థితిలో దళిత యువకులు, దోపిడీ కులస్త్రీలు సామాజిక సంబంధాల్లోకి పోవడం సహజం. కళాశాలల్లోకి పొయ్యే దళిత యువకులు అదే కళాశాలకు పొయ్యే దోపిడీ కుల అమ్మాయిలతో మాట్లాడడం సహజం. వారు చుండూరు నుండి తెనాలికి బస్సుల్లో, ట్రైన్‌లో పొయ్యి రావలసి ఉంటుంది. ఈ మిత్రుత్వాన్ని కొంతమంది పెళ్ళిళ్ళుగా మార్చి, ఆ క్రమంలో కులవ్యవస్థలో తమ స్థానాన్ని పెంచుకోవాలనే ప్రయత్నం చేసి ఉండవచ్చు. కొన్ని కేసుల్లో ముఖ్యంగా దోపిడీ కుల అమ్మాయిల తల్లిదండ్రులు బీదవారైనప్పుడు, దళిత యువకుడు బాగా చదువుకొని ఉద్యోగం చేసే అవకాశమున్నప్పుడు, అటువంటి

పెండ్లి వారిని కట్నం బంధం నుండి బయట పడేస్తుంది. కనుక అటువంటి పెళ్ళి దోపిడీ కుల తలిదండ్రులు కూడ అంగీకరించే అవకాశం ఉంటుంది. చాలమంది కమ్మకుల స్త్రీల తల్లి దండ్రులు ఇటువంటి పెండ్లిళ్ళకు ఒప్పుకున్నారు. (ఈ విషయంలో ఆంధ్ర రెడ్లు చాల వెనుక చూపు కలిగి ఉన్నారు) కాని చాల వరకు ఇటువంటి కులాంతర పెండ్లిళ్ళకు వ్యతిరేకత ధనవంతులైన దోపిడీ కులం వారి నుండి వస్తుంది. చుండూరులో దళిత పురుషుల మధ్య దోపిడీ కుల స్త్రీల మధ్య ఏర్పడిన "ప్రతి మానవ" సంబంధాన్ని "అగ్రకుల స్త్రీలపై" అత్యాచారాలుగా ప్రచారం చేశారు. కాని ఒక్క కేసులో కూడ ఫలానా స్త్రీపై ఫలానా పురుషుడు దాడి చేశాడనే, ఆమెను అవమానపరిచాడనే చెప్పలేదు. ఒక వేళ అట్లా చెప్పినట్లైతే అట్లాంటి సంబంధంలో భాగస్వాములైన స్త్రీల పెండ్లిళ్ళు కావు. పెండ్లైె ఉంటే భర్త ఆమె నుంచుకోడు. అదే సందర్భంలో దోపిడీ కుల స్త్రీలు, బహుజన యువకుల్ని పెండ్లి చేసుకోవడానికి కూడ వాళ్ళు అంగీకరించరు ఎందుకంటే అటువంటి పెండ్లిళ్ళు 'కట్నం ఆర్థిక విధానం' పైన దెబ్బతీస్తుంది. (మనం గమనించాల్సిందేమంటే కట్నం ఆర్థిక విధానం, ఆంధ్రలో కమ్మ రెడ్డి, వెలమ కుటుంబాల్లో ఉన్నంత ఏ కులాల్లో లేదు. బ్రాహ్మణులు, కోమట్లు ఈ విషయంలో వీరితో సరితూగరు).

కట్నం ఆర్థిక విధానం ఒక ఆర్థిక సంస్థగా బ్రతికి బట్టకట్టాలంటే పెండ్లిళ్ళు కుల హద్దుల్లో మాత్రమే ఉండాలి. ఒక సారి కుల నిర్మూలనా ద్వారాలు తెరుస్తే దోపిడీ కులాలలోని స్త్రీల లైంగికత్వం మీద ఆదిపత్యం ద్వారా పెట్టుబడిని కొన్ని కుటుంబాల మద్యే తిప్పుకుంటూ వచ్చే ఆర్థిక విలువలకు పెద్ద దెబ్బ తగులుతుంది. అంటే కులం, కులం పునాదిగా జరిగే పెండ్లిళ్ళు పై పట్టు నడలిందంటే స్త్రీ లైంగికత్వంపె భారతీయ పురుషుని కుండే ఆధిక్యత సగం దెబ్బతినడమే కాక దోపిడీ ఆర్థిక సంబంధాలకు కూడ తీవ్రమైన దెబ్బ తగులుతుంది. దళితులు/ బహుజనులు కేవలం అణిచివేతకు గురౌతున్న కులాలుగానే తేరు మార్కెట్ సంబంధాలలో "అగ్ర" కులం వారు దోపిడీ దారులుగాను లేదా ఇచ్చే వారుగాను బహుజనులంతా దోపిడీ చెయ్యబడుతున్న వారుగాను లేదా పుచ్చుకునే వారుగాను ఉన్నారు. (అంటే దానర్థం రెడ్డి, వెలమ, కమ్మ కులాల్లో బీదలు లేరని కాదు. ఉన్నారు కాని వారి సంఖ్య తక్కువ. అయితే బ్రాహ్మణ, కోమటి కులాల నుండి కూలిపని చేశేవారు మనకొక్కరు కూడ కనబడరు.)

భారతదేశంలో కుల సామాజిక సంబంధాలకు మార్కెట్ సంబంధాలకు చాల దగ్గరి సంబంధం ఉంది. ఒకటి మరొకదాన్ని కాపాడుతుంది. ఒకదానిలో మార్పురానారంభిస్తే రెండోది కూడ మారనారంభిస్తుంది. ఇక్కడే కులం పునాది, ఉపరితలం కూడ. కులదొంతరులున్న సమాజంలో (ఈ దొంతర్లలలో అంబేడ్కర్ చెప్పినట్లు పైకిపోతున్నా కొద్ది గౌరవం, కింది కొస్తున్నా కొద్ది అగౌరవం, అవమానం, అసమానతలు అమలులో ఉంటాయి) జెండర్ అసమానతల హొదా, గౌరవస్థానంలో కూడ ఆమె కులం మీద ఆధారపడి ఉంటాయి) స్త్రీ లైంగికత్వాన్ని వస్తీకరించబడడమే కాకుండా ఆ వస్తువు విలువ దాని కులాన్ని బట్టి మారుతుంది. అంటే వాస్తవికతల స్త్రీ లైంగికత్వం, ఒక టి.వి. ఒక రేడియో ఎలాగైతే వాటి వాటి కంపెనీల బ్రాండ్ మీద ఆధారపడి అమ్ముడుబోతాయో స్త్రీ లైంగికత్వపు విలువ కూడ వారి వారి కులపు విలువలపై ఆధారపడి మారుతుంది. అదే విధంగా పురుష లైంగికత్వపు ధర కూడ, వరకట్న మార్కెట్‌లో, అతని కులాన్ని బట్టి మారుతుంది. ఒక కమ్మ డాక్టర్ ధర 10 లక్షలు, ఒక బ్రాహ్మణ డాక్టర్ ధర 3 లక్షలు, ఒక బి.సి. డాక్టర్ ధర లక్ష, ఒక ఎస్.సి. డాక్టర్ ధర 20 వేలు ఇలా మారుతుంది. అదే డిగ్రీకి (ఈ మార్కెట్‌లో మంచితనం, మానవత్వానికి విలువ లేదు) ఆ డిగ్రీ దారుడి కుల సమాజస్థాయిని బట్టి అతని లైంగికత్వపు విలువ మారుతుంది. అదే విధంగా దోపిడీ కుల స్త్రీలో సంబంధాల్లోకి పొయ్యిన పురుషుని కులం స్థాయిని బట్టి అతనికిచ్చే-శిక్ష ఉంటుంది. ఈ చట్రంలో అర్థం చేసుకుంటే తేలేదేమంటే దోపిడీ కుల స్త్రీతో ఒక మాలతనే, మాదిగతనే సంబంధం పెట్టుకుంటే ఉరిశిక్ష - లేదా హత్య చెయ్యడం న్యాయమని అగ్రకులాలలుగా చెప్పబడే దోపిడీ కులాలు నమ్ముతున్నాయి. అదే సందర్భంలో దళిత స్త్రీని దోపిడీ కుల పురుషుడు రేప్ చేసినా అది నేరం కాదనేది వారి న్యాయం.

పై వాస్తవం దోపిడీ కుల పురుషులకు దళిత లేదా బహుజన స్త్రీల లైంగికత్వం పట్ల ఉండే అభిప్రాయాల్ని పరిశీలిస్తే తెలుతుంది. బహుజన స్త్రీలు సాధారణంగా దోపిడీ కులాల భూస్వాముల పొలాల్లోకి పనులకు పోతారు. దోపిడీ కుల భూస్వాముల దృక్పధం ఏమంటే వారు ఆ స్త్రీ శ్రమకిచ్చే వేతనంలోనే ఆమె సెక్సువాలిటీపై ఆధిపత్యం కలిగి ఉండడానికి కూడ ధర కట్టబడి ఉందని అనుకుంటాడు. అతను ఆమెను, ఆ కూలి రేటులో భాగంగానే, తిడుతాడు, అవమానిస్తాడు. అతను ఆమెను అడగ్గానే తన లైంగికత్వాన్ని అయనకు అప్పజెప్పాలని భావిస్తాడు. ఆమెకు ఇష్టమున్నా, లేకున్నా బలవంతం చేస్తాడు. అతని డబ్బు ద్వారా ఆర్థిక అధికారాన్ని, కులం ద్వారా సాంఘిక అధికారాన్ని ప్రదర్శించడం వల్ల దళిత బహుజన స్త్రీలు గత్యంతరం లేక లొంగిపోతారు. చాల అరుదుగా అలాంటి దోపిదీ కుల పురుషులపై దాడులు చెయ్యడం గాని, వారిని చంపడం గాని జరుగుతుంది. అట్లాంటి వారిని చంపితే అతని బంధువులు తమ ఆర్థిక సాంఘీక బలం వల్ల అట్లా చంపిన వారిని తిరిగి చంపగలరు, జైల్లో పెట్టించగలరు. వారి స్త్రీలకు పిల్లలకు రక్షణ లేకుండా చెయ్యగలరు. దళితుల్ని/బహుజనుల్ని చంపినప్పుడు పోలీసులు తమను అరెస్టు చెయ్యకుండా కాపాడుకోగలరు. కోర్టులు తమకు శిక్షనివ్వకుండా కాపాడుకోగలరు. ముత్తమ్మను చంపిన హంతకుడైన పర్వతరెడ్డికి ఇంతకు ముందు ఇటువంటి దురాగతం చేసినందుకు యావజ్జీవ కారాగార శిక్ష పడింది. కాని ఆ కాలంలో దేశంలోని అత్యున్నత పదవినలంకరించిన మరో రెడ్డి అతనిని

విడిపించాడు. ఉదాహరణకు దోపిడీ కుల పురుషులకు దళిత స్త్రీలకు ఉన్న సంబంధాన్నే చూద్దాం. దోపిడీకుల పురుషులు ఈ స్త్రీలు నీల్ళు తెస్తే తాగ నిరాకరిస్తారు. ఆమె ఆహారం తెస్తే తినరు. ప్రజల మధ్య ఆమె శరీరం తాకుతే స్నానం చేస్తారు. కాని రహస్యంగా ఆమెను లైంగికంగా లొంగదీసుకున్నప్పుడు మాత్రం ఈ అంటు, ముట్టు అడ్డం రాదు. అంటే వారి శరీరం అంటరానిది కాని వారి లైంగికత్వం మాత్రం కాదు. తెలంగాణలోని గ్రామీణ ప్రాంతంలో ప్రతినిత్యం ఉదయమే దోపిడీ కుల భూస్వాముల ఇండ్లల్లకు (తెలంగాణలో ఎక్కువ మంది భూస్వాములు రెడ్లు లేదా వెలుమలు) కొట్టాల దగ్గరికి పెండతియ్య లేదా శుభ్రం చెయ్య బోతారు. అటువంటి సమయంలో భూస్వాములు ఆ స్త్రీలను రేప్ చెయ్యడం సర్వసాధారణం. వారు చేండ్ల-ల్లో పనికి పొయ్యినప్పుడు కూడ వారిని రేప్ చెయ్యడం మామూలే కాని అటువంటి ఒక్క భూస్వామిని కూడ తమ కులస్తులు కాని దళిత కులస్తులు గాని చంపిన సంఘటనలు నాకు మాత్రం తెలియవు. లేదా ఈ వ్యక్తుల దాడికి గురైన వారిని ఆ దళిత స్త్రీతో జీవించమని గాని లేదా ఆమెకు ఆర్థికంగా అండగా ఉండాలని కూడా ఒత్తిడి తెచ్చిన సంఘటనలు చాలా తక్కువ. అందుకు భిన్నంగా ఇటువంటి ఎన్ని ఎక్కువ సంఘటనల్లో పాల్గొంటే అతని అధికారమంతా పెరుగుతుంది. ఎంత ఎక్కువ మంది దళిత స్త్రీలను తను అధీనంలో ఉంచుకుంటే అంత సాంఘీక అధికారం అతనికి పెరుగుతుంది. టంగుటూరు సమీపంలో ఇందిర అనే దళిత స్త్రీపై జరిగిన దాడి ఈ సంబంధాల్ని మరింత స్పష్టం చేస్తుంది.. ఇందిర ఒక ప్రయివేటు కంపెనీలో పనిచేసే ఒక అందమైన దళిత స్త్రీ. తాను సంపాదించుకుంటున్న వేతనంతో ఆమె తనను తాను కాస్త మంచిగా పోషించుకుంటుంది. ఒక కమ్మ భూస్వామి ఆమె తనకు స్వాధీనం కావాలని పదే పదే కబుర్లు పంపాడు. ఆ కబుర్లు తనతో అక్రమ సంబంధం పెట్టుకోమని కాని తనను పెండ్లి చేసుకోమని కాదు. కాని ఇందిర అందుకు గట్టిగా అడ్డు తిరిగింది. ఒక రోజు ఆ భూస్వామి ఇందిరను బలవంతంగా పట్టుకొని ఆమెను రేప్ చేసి ఆమెను చంపి, ఆమె నగ్న శవాన్ని గ్రామపు నడీ రోడ్డు మీద వేశాడు. 24 గంటలకు పైగా ఆ నగ్న శవం అట్లాగే రోడ్డు మీద ఉండింది. రాజ్యాంగానికి సంబంధించిన పోలీసులు గానీ, దోపిడీ కులస్తులు గానీ ఆ శవాన్ని తొలగించలేదు. కనీసం ఆమె బంధువులకు కబురు కూడా పంపలేదు. దోపిడీ కులస్తులంతా కలిసి ఆ భూస్వామిని చంపారా మరి? లేదు. వారు అతన్ని సాంఘీకంగా బహిష్కరించారా? లేదు. పోలీసులతన్ని అరెస్టు చేశారా? లేదు. సంఘటన జరిగిన రెండు సంవత్సరాల తర్వాత (అది 1989లో జరిగింది) కూడ హంతకుడు యధేచ్ఛగా తిరుగుతున్నాడు

మరి రాజ్యం కులాతీతంగా వ్యవహరిస్తుందా? చుండూర్‌లో దళితుల హత్యాకాండ జరిగాక దోపిడీ కులస్తులు చేసిన ప్రచారాన్ని ఉపయోగించుకొని అక్కడి ఎస్.పి. వారిని సమర్థించాడు. 10 సెప్టెంబర్ 1991 జరిగిన పోలీస్ కాల్పులను దళిత స్త్రీలు పోలీసుల ఛాతిపై గుండు సూదులు గుచ్చారని, వారి పురుషాంగాలు పట్టుకున్నారని సమర్థించాడు. ఈ కాల్పుల్లోనే ఆగస్టు 6 హత్యాకాండకు ముఖ్యమైన సాక్షి అయిన అనిల్‌కుమార్ చంపబడ్డాడు. ఈ విధంగా దోపిడీ కుల స్త్రీల గురించి మాట్లాడి ఎస్.పి. ఒక్క రోజు కూడ పదవిలో ఉండగలడా? దోపిడీ కులస్తులు దళిత పురుషులు తమ స్త్రీలతో అసభ్యంగా ప్రవర్తించారంటే ఎస్.పి. దళిత స్త్రీలు పోలీసు వారితో అసభ్యంగా ప్రవర్తించారంటాడు. ఎస్.పి. దళిత కులం నుండి వచ్చినా గిరిజన తెగ నుండి వచ్చినా తేడా ఏమీ ఉండదు. ఇక్కడి ఎస్.పి. (మీనా) గిరిజనుడు. ఐనా దోపిడీ కుల సంస్కృతికి లోనై దళిత స్త్రీలు అసభ్యంగా ప్రవర్తించారని చెప్పడానికి ఆయన ఏమీ వెనుకాడలేదు. దీన్నే మనం దోపిడీ కుల సంస్కృతిని అంతర్లీనం చేసుకోవడమంటాము. చెలుకుర్తి ముత్తమ్మ విషయంలో పోలిసులు ముందు కేసు నమోదు చేసుకోడానికి నిరాకరించారు. ముత్తమ్మ పోలీసు స్టేషనుకు తాను స్వయంగా పొయ్యి కేసు నమోదు చేసుకోవాలని డిమాండ్ చేసింది. అప్పుడు నామ మాత్రంగా నమోదు చేసుకున్నారు. ఇందిర హంతకున్ని ఇంత వరకు అరెస్టు చెయ్యలేదు. అందుకు భిన్నంగా చుండూరు దళితుల్ని రెడ్డి భూస్వాములు చంపినప్పుడు పోలీసులు ప్రభుత్వ యంత్రాంగం హంతకులకు అన్ని రకాల సహాయ సహకారాలందించింది. ఈ విధంగా బహుజనులకు వ్యతిరేకంగా స్త్రీలకు వ్యతిరేకంగా పనిచెయ్యడంలోనే ఈ రాజ్యపు కౌటిల్యతత్వం బయట పడుతుంది. ఈ కౌటిల్య రాజ్యాన్ని కూలదోసి బహుజన రాజ్యాన్ని స్థాపించుకునేందుకు స్త్రీలు, దళితులు

బహుజనులంతా సంఘటిత ఉద్యమాలు నిర్మించాలి. ప్రపంచ శ్రమ జీవుల సిద్ధాంతమైన మార్క్సిజాన్ని, స్త్రీ విముక్తి ఉద్యమ సిద్ధాంతమైన ఫెమినిజాన్ని భారతదేశ ప్రత్యేక కుల నిర్మూలనకు ముందుకొచ్చిన అంబేద్కరిజాన్ని జోడించితే తప్ప భారతదేశంలో కౌటిల్య రాజ్యాన్ని కూలదొయ్యడం కష్టం.

డా॥ కె. ఐలయ్య

---

## స్వీకారం

1. **నెత్తుటి జెండాలు**
(కవితలు-పాటలు) వెల: 8.00
ప్రచురణ: ప్రజారస, అరుణోదయ,
ప్రతులకు: నవోదయ బుక్ హౌస్,
సుల్తాన్ బజార్, హైదరాబాద్.

2. **విద్యార్థులుగా మార్క్సిస్టు మహోపాధ్యాయులు**
రచన: డా. శివరామిరెడ్డి, వెల: 6.00,
ప్రతులకు: మేనేజర్ ప్రజాపంథా
ఇం. నెం. 4-13-14, కొరిటిపాడు,
గుంటూరు - 522 007

3. **జాబిలి నేర్పిన వెన్నెల పాట**
(బాలగేయాలు) వెల: 6.00 రచన:
పి. కుసుమా కుమారి, ప్రతులకు:
శ్రీ హిమానీ పబ్లికేషన్స్, ఫ్లాట్ నెం.
102, రాజీవ్‌నగర్ కాలనీ,
యూసుఫ్‌గూడా పోస్ట్, హైదరాబాద్
- 500 045.

# దైనందిన జీవితంలో కులతత్వం– స్త్రీల అనుభవాలు

"మామూలుగా మనం ఎంత హైస్థాయిలో ఉన్నాగాని కాస్ట్ ఫీలింగ్ చాలా చూపిస్తారు. ఇక్కడ మా ఆఫీసులోనే మా ఇన్‌ఛార్జ్ వాళ్ళు వాళ్ళకి మాత్రం పర్మిషన్ ఇస్తాడు. మాకేమో ఇవ్వడు. మేమెంత కష్టపడి వర్క్ చేసినా మమ్మల్ని తిడతానే ఉంటాడు. కాస్ట్ పేరు పెట్టి తిడతాడు. ఒక్కొక్కసారైతే కొంచెం పైన... టెన్ మినిట్స్ పర్మిషన్ పెట్టినా గానీ తిట్టేస్తాడు. ఆడవాళ్ళం గాబట్టి ఇంకా ఎక్కువ...."

"ఇప్పుడు మా ఇన్‌స్టిట్యూట్‌ల ఉన్న డాక్టర్లు, ఎట్లయిన కొంచెం నెగ్లెక్ట్ చేసినట్లే మాట్లాడతరు. ఏదన్నా డిస్కషనొచ్చినా గానీ హీనంగా జూసినట్లు మాట్లాడతరు. ఇప్పటికీ... మనమేం చేయగల్గుతం. కామ్‌గా కూసోవాలె. మళ్ళీ మంచి ఎడ్యుకేటెడ్స్..."

పైన చెప్పిన అనుభవాలు హైదరాబాద్‌లోని రెండు వేరు వేరు ఆఫీసుల్లో పని చేస్తున్న ఇద్దరు స్త్రీలవి. వ్యక్తిగత అనుభవాల నుంచీ మాట్లాడిన మాటలు. ఇంకా చెప్పుకోవాలంటే దైనందిన జీవితంలో బయట పనిచేసే చోట స్త్రీలుగా కుల వివక్షతకు గురవుతున్న దానికి స్పష్టమైన ఉదాహరణ.

కులతత్వం, దాని అణిచివేత మన సమాజంలో వేళ్ళూనికొని ఉన్న దనేది వాస్తవం. అయినప్పటికీ చాలా మంది అగ్రకులస్థులు తమలో ఉన్న అగ్రకుల తత్వాన్ని ఒప్పుటానికి అంగీకరించరు. కులం కొంతమందికి అసంఖ్యాకమైన సౌకర్యాలనీ, అధికారాలనీ పుట్టుక ద్వారా కల్పిస్తే, మరి కొంతమందికి అది రోజువారీ ఎదుర్కొనే చేదునిజం. ఇది రకరకాల రూపాల్లో ప్రతిరోజూ తమ చుట్టు పక్కల ఉండే వ్యక్తులు, సంస్థలు ఒకటేమిటి సమాజంలోని అన్ని రంగాల నుంచీ ఎదుర్కొంటున్న సమస్య. అయితే ఇక్కడ వెంటనే మనకో ప్రశ్న ఎదురౌతుంది. అణిచివేత స్వభావాన్ని ఎలా అర్థం చేసుకుంటామనేది? బహిరంగంగా కంటికి కనిపించే విషయాలనే అణిచివేతగా గుర్తిస్తే, మరి కంటికి కనిపించకుండా మనందరి చుట్టూ సూక్ష్మ స్థాయిల్లో సమాజంలోని అన్ని రంగాల్ని ప్రభావితం చేస్తున్న ధోరణుల మాటే మిటి? అసలు, ముందు మన దైనందిన జీవితాలను అల్లుకుని ఉన్న ప్రతి చిన్న విషయంలోనూ కులతత్వ ధోరణులు న్నాయనే విషయం ఒప్పుకో బుద్ధి కాదు. కుల అణిచివేత, అసమానతలు, వివక్షత ఇవన్నీ ఎక్కడో మారుమూల గ్రామాల్లో ఉంటాయి కానీ, పట్టణాల్లో, నగరాల్లో జీవిస్తున్న మన విద్యావంతుల సెక్షన్లో ఉన్నాయని అతిగా ఊహిస్తున్నారని పిస్తుంది. లేని గొడవల్ని సృష్టిస్తున్నారని పిస్తుంది. అణిచివేత బహిరంగంగా లేనప్పుడు ఈ కులాల వాళ్ళు దాన్ని ఎలా నిరూపించగలరు? అసలు దాన్ని అణిచివేత అని ఎందుకనుకోవాలి? అనే ప్రశ్నలు వెంటనే ఎదురవుతాయి. సూక్ష్మ స్థాయిల్లో ఉన్న ఈ ధోరణులను గుర్తింప జేయటం చాలా కష్టమైన విషయంగా అనిపిస్తుంది. అందుకే సమస్యను అర్థం చేసుకోవటానికి వ్యక్తిగత అనుభవాలను పరిశీలించాలి. సమాజంలోని ప్రతి విషయాన్నీ ఈ సమస్యకు ముడిపెట్టి చూడాలి. దీన్ని కేవలం ప్రత్యేకమైన సాంఘిక సమస్యగానే లేదా సంస్కృతికి సంబంధించిన విషయంగానే ఆర్థిక పరమైన అంశంగానే చూస్తున్నంత కాలం సమస్యను అర్థం చేసుకోవటంలో ఒక పరిమితికి గురయ్యామనేది స్పష్టం. సమస్యను విభిన్న కోణాల నుంచీ అర్థం చేసుకోవటానికి ఇప్పటి వరకూ పరిమితుల్లో ఉన్న చర్చను విస్తృతం చేయాల్సిన అవసరం ఉంది. వ్యక్తిగత అనుభవాల నుంచీ అణిచివేత స్వభావాన్ని అర్థం చేసుకోవటానికి ప్రయత్నించాలి. అప్పుడు కొన్ని ప్రశ్నలకు సమాధానాలను గుర్తింప జేయటం సులభమౌతుంది.

ఇక్కడ సమస్యను స్త్రీలు గురయ్యే అణిచివేతతో మనం పోలిస్తే కొన్ని విషయాలు అర్థం చేసుకోవడం సులభమవుతుంది. గత కొన్ని సంవత్సరాలుగా స్త్రీ సమస్యను ఒక్క వర్గ దృక్పథంతో మాత్రమే అర్థం చేసుకోలేమనే విషయాన్ని స్త్రీ ఉద్యమం స్పష్టం చేసింది. స్త్రీల సమస్య రాజకీయాల్ని పరిగణనలోకి తీసుకోకుండా ఏవో కొన్ని ఆర్థిక అవకాశాల్ని కల్పించటం ద్వారా సమస్యను పరిష్కరించలేమనే అవగాహనను, వ్యక్తిగత అనుభవాలను విశ్లేషించటం ద్వారా సమాజానికీ, కుటుంబానికీ, వ్యక్తిగత జీవితాలకూ చెందిన సూక్ష్మస్థాయి రాజకీయాలను బహిర్గతం చేసి వ్యక్తిగతం కూడా రాజకీయమే (పర్సనల్ ఈజ్ పొలిటికల్) అనే ఒక కొత్త దృక్పథాన్ని సమాజంలోని ప్రతి అంశంలోనూ, మనలోనూ జీర్ణించుకుపోయిన అధికార ధోరణులను అడుగడుగునా ఎదుర్కో వలసి ఉంటుందనీ, తద్వారా స్త్రీ అణిచివేతకు, ఇతర అణిచివేతలకు మధ్య ఉన్న సారూప్యతలను అర్థం చేసుకోగలమనే స్పృహను స్త్రీ ఉద్యమం కలగజేసింది.

ఆ అవగాహనతో ఈ కులాలకు సంబంధించిన అనుభవాలను ముఖ్యంగా స్త్రీల అనుభవాలను పరిశీలించాలి. మన సాంఘిక ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక అంశాలలో స్త్రీల స్థానం ఏమిటి అని స్త్రీ ఉద్యమం నిలదీసినట్లే ఈ అన్ని అంశాలలో ఈ కులాల స్థానం ఏమిటి అని ప్రశ్నించాలి. దైనందిన జీవితంలో స్త్రీలుగా కుటుంబంలోనూ, ఆఫీసుల్లోనూ, విద్యా సంస్థల్లోనూ, ఇంకా అన్ని రంగాల్లోనూ ఏ విధమైన వివక్షతలను ఎదుర్కొం టున్నారు. వాటి ప్రాధాన్యతను గుర్తించటం ద్వారా మొత్తం అణిచివేత స్వభావాన్నీ, కులతత్వం గురించీ విస్తృత అవగాహనను పెంచుకోగల్గుతాం. ముఖ్యంగా ఈ కారణం వల్లే ఈ కులాలకు చెందిన స్త్రీల అనుభవాలు చాలా ముఖ్యమైనవి.

అగ్రకుల మనస్తత్వం తమను తాము అధికులుగా, నాగరికులుగా భావించుకుంటూ మిగతా వారినందరినీ అనాగరికులుగా చిత్రిస్తూ మిగిలిన

వారికంటె సమర్థులుగా, ఇతరుల మీద ఆధిపత్యం చేయటానికి హక్కు ఉన్నట్లు ప్రవర్తిస్తుంది. వీరికి సంబంధించిన నమూనాలు, విలువలు అన్నీ కూడా సరైన విషయాలుగా, ఇతరుల సంస్కృతి, ఆచారాలు అన్నీ తక్కువే అని చిత్రీకరిస్తూ, తన ఆధిపత్యాన్ని స్థిరపర్చుకుంటుంది.

చిన్న పిల్లల కథల పుస్తకాల్లో ఈ ధోరణి ఎక్కువగా కనిపిస్తుంది. సాధారణంగా కథల్లో దొంగతనాలు, దోపిడీలు చేసేవాళ్ళు సోమరుల్లాగా ఉండేవాళ్ళు అందరూ కింది కులాల వారే. అబద్ధాలు చెప్పే వాళ్ళుగా, అజ్ఞానులుగా, మూర్ఖులుగా ఆడవాళ్ళు ఉంటారు. అంటే చెడ్డతనం, అజ్ఞానం, మూర్ఖత్వాలకి ప్రతీకలుగా ఈ కులాల వాళ్ళని, ఆడవాళ్ళని చిత్రీకరించటం. అయితే మంచి ఎలా ఉండాలి అనే విషయం కూడా కొన్ని నమూనాల్లో మనకు కన్పిస్తాయి. అణుకువ, ఓర్పు, సహనం కల్గిన స్త్రీలు వినయ విధేయతల్లో యజమానులకు జీవితాంతం సేవజేసే సేవకులు. ఇవి కొన్ని పాత్రల ద్వారా నిర్దేశించబడతాయి. ఇంకొక ముఖ్యమైన విషయం ఏమిటంటే భాష సాధరణంగా రాజులు, మునులు, బ్రాహ్మణులు అయితే గౌరవ వాచకం వాడటం. ఆయన, గారు లాంటివి. వేరే వ్యక్తులయితే వాడు, వీడు అని ఉంటుంది. స్త్రీల విషయానికి వచ్చేసరికి అసలు ఎక్కడా గౌరవ వాచకం ఉండదు. ఇది కేవలం పిలుపులకు సంబంధించిన విషయం మాత్రమే కాకుండా, సమాజంలో ఎవరి పట్ల గౌరవంగా ఉండాలి అని నియంత్రించటం. ఈ విషయాలన్నీ పిల్లల ఆలోచనల మీద తెలియకుండానే వాటి ప్రభావం కలగజేస్తాయి. ఇంకో అంశాన్ని గమనిస్తే సామెతలకు మన నిత్య జీవితంలో చాలా ప్రాధాన్యత ఉంది. చాలా భాగం సామెతలన్నీటినీ, ఈ కులాలలని కించపరిచేవిగానే ఉన్నాయి. ఆ సామెతల సారం మనకు పసితనం నుంచే నరనరాన జీర్ణించుకు పోతాయి.

"కులం తక్కువ దానికి నీటు ఎక్కువ".

"కూటికి తక్కువైతే కులానికి తక్కువా" ?

"మాలదాన్ని వెంకటమ్మా అంటే మరికాస్త ముందరింట్లోకి వచ్చిందట".

(వెంకటమ్మా అని పిలవడం మర్యాద సూచకం. లేకపోతే ఎంకటి, ఎంకటమ్మా ఇలా ఉంటాయి.)

"మాలలకు మంచాలు, బాపలకు పీటలా" ?

"కులం తక్కువ వాడు కూటికి ముందు"

"నన్నంటుకోకు నా మాలకాకి"

ముందు చెప్పినట్లుగా ఇతరుల సంస్కృతి, ఆచారాలు, అలవాట్లు అన్నీ తక్కువే అని స్థిరపరిచే అగ్రకుల ధోరణులకు ఇవి ఒక ఉదాహరణ మాత్రమే. ఫలానా కులానికి సంబంధించిన వ్యక్తులతోగాని మొత్తం కులం పట్లే ఉన్న తక్కువ భావంగానీ ఈ ధోరణుల నుంచే వస్తాయి. ఈ కులాలకు సంబంధించిన వాళ్ళు ఈ రకం గానే ఉండాలి అని స్థిరీకరించే ధోరణులకు ఇవి అద్దం పడతాయి. వేసుకునే బట్టల నుంచీ, ముఖ ఆకృతులు, శరీరాకృతుల వరకూ ఎప్పుడు ఏదో ఒక విసుగు, అసహ్యాంగా ఉంటారనో, నల్లగా ఉంటారనే, అందంగా లేరనే, గాయిది బట్టలు వేసుకుంటారనే ఇలా ఉంటూనే ఉంటుంది.

సాంస్కృతిక పరమైన ఎన్నో రకాల తేడాలు మనకు అన్ని కులాల్లోనూ కన్పిస్తాయి. వేదకాలం నాటి కుల వ్యవస్థ మచ్చుతునకలు కావు ఇప్పటి కులాలు. మన చరిత్రలో వర్గ సంబంధాలు కులంతో ముడిపడి ఏర్పడుతూ మారుతూ వస్తున్నాయి. అదేవిధంగా అగ్రకుల పెత్తనం, ఆధిపత్య వర్గాలలో పటిష్టం చేయబడుతూ కొత్త రూపాలతో ఏర్పడుతూ వస్తోంది. మారుతున్న పెట్టుబడిదారీ వ్యవస్థలో భాగంగా మారుతూ తనకు అనుకూలంగా భావజాలాన్ని రూపొందిస్తుంది. మన ప్రాచీన వేద సంస్కృతి గొప్పదనాన్ని పరిరక్షిద్దాం. తద్వారా దేశాన్ని మరింత అభివృద్ధి పరుద్దాం. శతాబ్దాల ప్రాచీన ఆచారాలు, శతాబ్దాలు మారినా కొన్ని ఎన్నటికీ తమ గొప్పతనాన్ని పోగొట్టుకోవు. ఈ రకమైన నినాదాలతో వస్తున్న అడ్వర్టైజ్‌మెంట్లు ఏ భావజాలానికి ప్రాతినిధ్యం వహిస్తున్నాయి? జీవిత భీమా గురించైనా, పర్యాటక స్థలాల గురించైనా, బట్టల గురించైనా, టెక్నాలజీ గురించైనా. ఏ విషయమైనా సరే ఇప్పుడు అన్నీ ప్రాచీన వేదకాల సంస్కృతితో పోలుస్తూ రూపొందిస్తున్నారు. అక్కడ వస్తువు ప్రాధాన్యత కన్నా చెప్పే విషయమే ఎక్కువ ప్రాధాన్యతని సంతరించు కుంటుంది. ఇవి పిల్లల పెరుగుదలలో, ఆలోచనల్లో అత్యంత ప్రభావాన్ని చూపుతూ అంతర్భాగమవుతాయి. ఈ ఆలోచనల మీద తమకే మాత్రం అదుపు లేకుండా పాపులర్ అభిప్రాయాల ఒరవడిలో పిల్లలు కొట్టుకుపోతుంటారు. ఇతర పిల్లల్తో మాట్లాడే మాటల్లో, బడిలో, ఆటల్లో తమ తమ జట్టుల్లో ఉన్నపుడు ఈ రకమైన సంభాషణలు దొర్లిపోతుంటాయి. సాధారణంగా ఇళ్ళలోనూ, బడిలోనూ, పాఠాల్లోనూ ఇవే విభిన్న తరహాల్లో ఉంటూ వారి ఆలోచనల మీద ప్రభావం చూపిస్తాయి. క్రమంగా వాళ్ళూ ఈ ధోరణిలో భాగంగా మారిపోతారు. మనం కూడా మనకు తెలియకుండానే ఆ భావజాలానికి అనుగుణంగా ప్రతిస్పందిస్తాం.

లోతుగా విశ్లేషిస్తూ పోతే మన దైనందిన జీవితంలో ఈ నూతన తరహా ధోరణులు అగ్రకుల భావజాలంలో ఎలా అంతర్లీనమయ్యాయో అర్థమవుతుంది. మామూలుగా వీటి ప్రభావం ఏమిటి అనేది చూసిన వెంటనే అర్థం కాకపోవచ్చు. సాంస్కృతిక పరమైన ధోరణులు ఎప్పటికప్పుడు తమ ఆధిపత్యాన్ని నిలబెట్టుకోవటానికి ప్రయత్నిస్తూ తమ వాదనకు బలం చేకూర్చుకోవటానికి ఈ కులాల మీదకు తమ దాడిని ఎక్కుపెడతాయి. అందులో భాగంగా వచ్చిందే రిజర్వేషన్లను వ్యతిరేకించడానికి ముందుకి తీసుకు వచ్చిన ప్రతిభ, సామర్థ్యత, దేశప్రగతి చర్చలన్నీ. కేవలం కొన్ని విషయాల గురించే మాట్లాడుతున్నట్లు కన్పించినా, సమాజంలోని అన్ని రంగాలనూ సైద్ధాంతిక పరమైన అగ్రకులతత్వం ప్రభావితం చేస్తుంది. అధికార ధోరణులను సాధన చేస్తుంటుంది. కుటుంబం, విద్యా, వైద్య, న్యాయ,

సంక్షేమ వ్యవస్థలన్నీ కూడా ఈ ధోరణులకు ప్రాతినిధ్యం వహిస్తాయి. కులతత్వం ఒక వర్గానికో, సమూహానికో సంబంధించిన సమస్యగా చూస్తున్నంత కాలం వ్యక్తిగత స్థాయిలో నడిచే కులతత్వం ఏమిటి అనేది గందరగోళ పరచక మానదు. అగ్రకుల ఆధిపత్య భావజాలం ఈ కులాలకు సంబంధించిన వ్యక్తుల అలవాట్లను, సంస్కృతులను ఎగతాళి చేయటం, కించపరచటం, వానికి లెక్కలోకి తీసుకోకపోవటం ద్వారా ఇది ప్రారంభమవుతుంది.

"మనం కొంచెం మంచి చీర కట్టుకుని పోయినం అనుకో ! ఏదో విధంగా దాన్ని గురించి ఎగతాళిగా అంటుటే. మనకు తెలుస్తది ఇలా అంటున్నారని. ఇంక వాల్లయితే 500, 600 రూ||ల చీరలే కడ్తరు. దానికన్నా తక్కువుండదు. అంటే అటువంటి ఫీలింగ్సుంటయి. కొంతమంది పట్టించుకుంటరు. కొంతమంది పట్టించుకోరు."

"ఆ అమ్మాయి బ్రామ్మిన్. తను మిగతా అందరి కూరలు తింటది గానీ. నేనెప్పుడైనా కూరేస్తననుకో. నేను గానీ, భాగ్య గానీ, వద్దంటే వద్దని ఖచ్చితంగా చెప్తుంది. అస్సలు తినది. ఇప్పటికీ మాది గింత కూర తినలే. తీసుకోండి అంటే వద్దులే నాకుంది అంటది. మనకు పెడ్తరు. వద్దన్నా గానీ మనకు పెడ్తరు. వద్దంటే ఏమన్నా అనుకుంటరేమో అని భయం. ఎంత సీరియస్‌గా పెడ్తరో మొహం అసలు. ఆ అమ్మాయికి అసహ్యం ఇట్ల ముట్టుకోను కూడా ముట్టుకోదు. కూరలు గానీ, మా గిన్నెలు గానీ ముట్టుకోను కూడా ముట్టుకోదు".

"ఇక్కడ ఈ ఆఫీసులో జాయినయినపుడు ఫస్ట్ రోజు అంతా కొత్త. నన్ను జూసి క్రిస్టియననుకున్నారో. కాస్ట్ గుర్తు పట్టారేమో అస్సలు ఎవరూ మాట్లాడలేదు. అసలు ఈ ఊరే కొత్త. అందులో కాలేజీ నుంచి రావడం, ఎవరితో ఎట్లా మాట్లాడాలో తెలియదు. నేను ఎన్నిసార్లు ఏమండీ ఎక్కడ కూర్చోవాలి, ఈ పని ఎట్లా చేయాలి అని అడుగుతున్నా ఎవ్వరూ పట్టించుకోలేదు."

"ఇల్లు అద్దెకి కావాలి అని అడిగితే, కాస్ట్ చూస్తారు ముందు. కాస్ట్ చూసీ ఎస్.సి., బి.సి., అని అంటే ఇక వెంటనే మీకు ఇవ్వము అని డైరెక్ట్‌గా మొహం మీదే చెప్పేస్తారు. మనకు అద్దె కట్టే స్థోమత ఉన్నాగానీ వాళ్ళకు కాస్ట్ ఫీలింగ్ అన్నమాట"

"ఇప్పుడు నాతో చేసే రజని ఉన్నది చూడు. కొంచెం డామినేట్ చేస్తది. ఆమెకు తెలుసు. నేను ఎస్.సి. అని. కొంచెం డామినేట్ చేసి మాట్లాడతది. గట్టిగా బెదిరించినట్లు చెప్తుంది. 'పర్టిక్యులర్‌గా నాతోనే అలా చెప్తుందన్నమాట".

పైన చెప్పిన ఈ అనుభవాలన్నీ వ్యక్తిగత స్థాయిల్లోనే ఉంటాయి. కాబట్టి వాటిని ఎదుర్కోవటం కష్టమవుతుంది. వ్యక్తిగత సంబంధాలలో ముఖ్యంగా ఇంటి చుట్టుపక్కల వాళ్ళు, తోటి విద్యార్థులు, తోటి ఉద్యోగులు, స్నేహితులు వీరితో రోజువారీ సంబంధాలలో ఈ ధోరణి ఏదో ఒక సందర్భంలో కనిపిస్తూనే ఉంటుంది. సమాన హోదాలో ఒకే చోట పనిచేస్తూ అధికారయుతంగా మాట్లాడటం, కించపరచటం, సాధారణమైన కొన్ని పనులకు కూడా ఆహ్వానించకపోవటం, వారికి సంబంధించిన ఆహార పదార్థాలనేవీ తీసుకోక పోవటం, అద్దెకు ఇల్లు ఇవ్వకపోవటం ఇవన్నీ కూడా దైనందిన కులతత్వంలో భాగమౌతాయి.

ఇది ఇప్పుడూ ఒకే రకమైన ధోరణిలో ఉంటాయని చెప్పలేం. తమ అవసరాలకు అనుగుణంగా అగ్రకుల తత్వం వ్యవహరిస్తుంది. ఇవి ఒకసారి మందకొడిగానూ, ఒకసారి చురుకుగానూ కనిపించవచ్చు. మండల్ కమీషన్ ఆధారంగా రిజర్వేషన్లను అమలు పర్చాలని వి.పి. సింగ్ ప్రభుత్వం ప్రయత్నం చేసినపుడు ఈ చర్చల తీవ్రత చాల చురుకుగా వ్యక్తమైంది. రిజర్వేషన్లకు వ్యతిరేకంగా విద్యార్థుల ఆందోళన, వాటికి వత్తాసుగా ప్రచార సాధనాల హోరూ రిజర్వేషన్ల వల్ల వ్యక్తిగత ప్రతిభ నాశనం అవుతోందనే ధోరణి అన్నీ కూడా వ్యక్తిగత స్థాయిల్లో ప్రభావితం చేసి ఆ ధోరణులను ఇంకొంచెం బహిరంగ పర్చటానికి దోహదపడ్డాయి. ప్రధానంగా జరిగే చర్చను బట్టి వీటి గమనం ఉంటుంది ఏ చర్చా లేకుండా కూడా ఈ ధోణులు తమ ప్రభావాన్ని చూపిస్తూనే ఉంటాయి. డైరెక్ట్‌గా వాళ్ళు ఎస్‌సి ఎనే, బి.సి అనే స్థానం కల్పించకపోవటం, నేర్చుకునే అవకాశం ఇవ్వకపోవటం ఓ రిజర్వేషన్ వాళ్ళా! మీకు మార్కులు తక్కువొచ్చినా ఉద్యోగాలొచ్చేస్తాయి 'అనటం, అసమర్థులుగా, తెలివి తక్కువ వాళ్ళుగా ముద్రవేయడానికి ఏ మాత్రం సంబంధం లేని పనులను అప్పగించటం, వీళ్ళకు అవకాశాలు ఇచ్చినా గానీ ఉపయోగించుకోరు. వీళ్ళకేం చేసినా బూడిదలో పోసినట్లే. ఉద్యోగాలు ఇచ్చినా సరిగా పనిచేయరు. వీళ్ళ బదులు మంచి వాళ్ళకు ఇస్తే దేశం చాలా అభివృద్ధి పొందుతుంది లాంటి ఆరోపణలతో అనుక్షణం మానసిక వేధింపుకు గురిచేయటం జరుగుతుంది. ఇవి కేవలం వ్యక్తిగతమైనవే కాదు. సామూహికమైనవి కూడా. మామూలుగా చూస్తే ప్రచ్ఛన్నంగా, సూక్ష్మాతి సూక్ష్మంగా, స్పష్టమైన రూపు లేకుండా, ఏదో మామూలు సంఘటనగా అప్పటికప్పుడు అనుకోకుండా జరిగిన చాలా చిన్న విషయంగా ఏమాత్రం ప్రాధాన్యత లేనట్లు, అసలు దాన్ని గుర్తించవనసరం లేదన్నట్లుగా అగ్రకుల ధోరణి వ్యవహరిస్తుంది.

అగ్రకుల భావజాల ప్రభావం ఎక్కువగా విద్యా వ్యవస్థ మీద ఉంటుంది. విద్యాసంస్థల్లో గనుక ఎక్కువ శాతం ఎస్.సి., బి.సిలకు సంబంధించిన విద్యార్థులుంటే ఆ విద్యా సంస్థ ప్రమాణాలు చాలా తక్కువగా ఉంటాయి. ఆ విద్యార్థులకు మంచి పేరు ఉండదు. దానికి కారణం బహిరంగంగా చెప్పక పోయినా, పరోక్షంలో ఈ కులాలకు సంబంధించిన వాళ్ళు ఎక్కువగా ఉండటమే అని ఉపాధ్యాయులు చెప్తారు. దానికి స్పష్టమైన రుజావు ఉండదు. 'ఆ... వాళ్ళకసలు తెలివి లేదు. చదవటానికి ప్రయత్నించరు. వాళ్ళకు చెప్పటం కూడా దండగండీ' అని నిస్సిగ్గుగా మాట్లాడ తారు. పాఠ్య ప్రణాళిక, పాఠ్యాం శాలు, పాఠశాల పద్ధతులు, ఉపాధ్యా యులు మొత్తం విద్యా వ్యవస్థను పరిశీలిస్తే అగ్రకుల పురుషాధిక్య భావజాలం నియంత్రిస్తుందనటంలో సందేహం లేదు. ప్రార్థన మొదలుకొని పరీక్షలు, ఉత్తీర్ణత, ఉపాధ్యాయులకు, పిల్లలకు మధ్య నుండే సంబంధం ఇవన్నీ కూడా కనిపించకుండా విభజింప బడి ఉన్నాయి. "మా స్కూల్లో ఎప్పుడూ నేనే పాటలు పాడేదాన్ని. ఆ రోజేమయ్యిం

దంటే ఏదీ గుర్తు రాలేదు తొందరగా. మా క్రిస్టియను పాంక్సు ఉంటాయి గదా. ఏద్వైతేనేం దేవుని పాటే గదా అని పాడాను. ఇంక అందరూ ఒకటే అరస్తూ ఉన్నారు. ఆ పాట పాడుతూ ఉంటే. టీచర్స్ కూడా అలానే చేశారు. ఇంకెప్పుడూ క్రిస్టియన్ పాటలు పాడొద్దు అన్నారు. మళ్ళీ అక్కడెందుకు... హిందూ శ్లోకాలు పాడొచ్చుగానీ. క్రిస్టియన్స్‌వి ఎందుకు పాడకూడదు అదే అడిగాను. ఈ అనుభవం గమనిస్తే మనకు ఈ విషయం అర్థమవుతుంది.

ఈనాటి విద్యా విధానం సాంఘిక అధికార యంత్రాంగాన్ని అకడమిక్ అధికార యంత్రాంగంగా మార్చటంలో చాలా చురుకైన పాత్ర వహిస్తోంది. ఉన్నత, మధ్య తరగతి వర్గం తమను తాము ప్రతిభ గలవాళ్ళుగా చిత్రీకరించుకుంటూ, శ్రామిక వర్గానికి సంబంధించిన వాళ్ళు (భారత దేశంలో శ్రామిక వర్గం ఎప్పుడూ అణిచివేయబడ్డ కులాల వాళ్ళేనన్న విషయం స్పష్టం) వాడుకుంటుంది. సాధారణంగా ప్రతిభగల విద్యార్థులుగా ఉపాధ్యాయులు పేర్కొనే విద్యార్థులందరూ అగ్రకుల ఉన్నత, మధ్య తరగతి వాళ్ళే ఉంటారు. అమలులో ఉన్న సామర్థ్యతా పరీక్షలు పిల్లలను చురుకైన వాళ్ళుగానూ, మందకొడిగానూ విడదీయటానికి పనికొస్తుంది గానీ, పిల్లల్లో సృజనాత్మకతని వెలికి తీయటం లేదు. సాధారణంగా తరగతి గదిలో అబ్బాయిలు ఆధిపత్యం చెలాయిస్తారనటం అవాస్తవం కాదు. "ఆడపిల్లలు సబ్జెక్ట్స్ మీద చర్చించటం, వాళ్ళకంటే ఎక్కువ స్థాయిలో ఉండటం అనే భావననే అబ్బాయిలు భరించలేరు. వెంటనే ఏవో కామెంట్స్ చేస్తారు. మన ఉత్సాహం చచ్చిపోయి మెదళ్ళకు పక్షవాతం వచ్చేలాగా చేస్తారు. ఇది కేవలం అమ్మాయిల గురించి కాదు. ఎస్.సి., బి.సి. వాళ్ళతోనయినా అంతే" బహుశా చాలామంది అమ్మాయిలు ఈ రకమైన అనుభవాన్ని ఎదుర్కొనే ఉంటారు. టీచర్స్ వైపు నుంచి కూడా ఈ రకమైన ప్రవర్తనకి ప్రోత్సాహం లభిస్తుంది. మనం ఏ కులానికి చెందిన వాళ్ళం, ఏ తరగతికి చెందిన వాళ్ళం, ఏ జండర్‌కి సంబంధించిన వాళ్ళం అన్న విషయం మీద ఆధారపడి ఉంటుంది టీచర్ మనతో వ్యవహరించే పద్ధతి.

"లెక్చరర్స్ అప్పర్ కాస్ట్ వాళ్ళే ఎక్కువున్నారు. ప్రాక్టికల్స్‌లో మార్కులు తక్కువేస్తుండె. మళ్ళా అందరికీ అలా కాదు. ఎస్.సి., ఎస్.టి., వాళ్లకు తక్కువొచ్చాయి. కాని ఈ విధంగా ఫెయిల్ చేయడం అనేది మా ఫ్రెండ్ ఒకతను ఉండే అతను ప్రాక్టికల్స్ బాగా చేస్తుండె. అతన్ని పాస్ చేయలేదు. అతనూ ఎస్.సి. స్టూడెంట్. అట్ల జేస్తరు".

"రిజర్వ్‌డ్ కాటగిరిలో అమ్మాయిలు ఒకరిద్దరే వస్తారు. వచ్చిన ఒకరిద్దరు అమ్మాయిలు ఫస్ట్ సెమిస్టర్ అయ్యేసరికి వెళ్ళిపోతారు. ఎందుకంటే మార్కులు తక్కువొచ్చి ఫెయిలవుతారు. మా ఇంగ్లీష్ డిపార్ట్‌మెంట్‌లో ఇంతవరకూ ఒక్క ఎస్.సి. అమ్మాయి కూడా కోర్స్ పూర్తిచేసి వెళ్ళలేదు".

"క్లాసులో అంతా బాగానే ఉన్నట్టుంటుంది. బయటి కెళ్ళేసరికి గ్రూపులు వేరయి పోతాయి. క్లియర్‌గా ఆ డిస్టింక్షన్ ఉంటుంది".

"అసలు అంబేద్కర్ పుస్తకాలే లైబ్రరీలో ఉండవు. అంబేద్కర్ పుస్తకం చదువుతున్నాడంటే... అలా చూస్తారన్న మాట. అంబేద్కర్ పుస్తకం చదువుతున్నాడంటే వీడెవడో తక్కువ కాస్ట్‌కి సంబంధించిన వాడయి ఉంటాడు. అందుకని... ఓ రకమైన చూపు చూస్తారన్నమాట. అంబేద్కర్ పేరెత్తితేనే అలా చేసేవాళ్ళు ఇంక అంబేద్కర్ మీద రిసెర్చి చేస్తున్నామంటే ఎలా చూస్తారో ఊహించండి. అంబేద్కర్ మీద ఇంతవరకూ ఒక్క పేపర్ లేదు. ఎవ్వరూ ఒక్క రిసెర్చి చేయలేదు".

"మా లెక్చరర్ ఒకాయన ఉండేవాడు. బ్రాహ్మిన్. నేను కూడా బ్రాహ్మిన్ అనుకుని చాలా ఇష్టపడేవాడు. అయితే ఇంకోకామె కూడా ఉండేది వనజ అని. ఆమె కూడా నేను బ్రాహ్మిన్ అనుకుని చాలా ఇష్టపడేది. ఎందుకట్లా అనుకునేవారో నాకు తెలియదు. ఒకసారేమయిందంటే ఏదో దానికి అప్లై చేస్తూ ఆయన దగ్గర కూచుని ఫిలప్ చేస్తున్నాను. కాస్ట్ రాస్తున్నపుడు చూశాడు. కాస్ట్ తెలిసింతర్వాత ఎట్లాగైనా వేరేగా ఉండేది ఆయన బిహేవియర్".

ఇవన్నీ కూడా మన సమాజంలోనూ విద్యా వ్యవస్థలోనూ నెలకొని ఉన్న అసమాన ధోరణుల ప్రతిబింబాలే. మగవాళ్ళు అధికులు. ఆడవాళ్ళు లొంగి ఉండాలి. కొన్ని కులాలు, మతాలు ఆధిక్యత కల్గి ఉంటాయి. కొన్ని కులాలు లొంగి ఉండాలి అనే ధోరణులు వివిధ రకాలుగా మన చుట్టూ ప్రతిఫలిస్తాయి. ఏ రకమైన చర్చగానీ, ఆలోచన గానీ లేకుండానే ఇవి సమాజమైన విషయాలుగా చెలామణీ అవుతుంటాయి. మనం దేనికి సంబంధించిన వాళ్ళం అన్న విషయం మీదే మన గెలుపు, ఓటములు నిర్ణయించబడతాయి. ఆ దృష్టితోనే మన సంస్కృతిని, అలవాట్లను ఎగతాళి చేసే క్రమం మనకు ఎదురౌతుంది.

అనుక్షణం మన అలవాట్లు, ఆలోచనలు, సంస్కృతి ఇవన్నీ అవహేళనం పాలవుతున్నపుడు, సర్వత్రా ఈ ధోరణులు నడుస్తున్నపుడు, ఆస్థితి నుండీ బయట పడాలనే తపన, ఆలోచనలు నొక్కి వేసుకునే ధోరణి, బలవంతంగా కృత్రిమ వాతావరణంలో ఇమిడి పోవాలనుకునే ఆలోచన, మనకు మనమే మన చైతన్యాన్ని అణిచి వేసుకునే స్వభావం మొదలవుతుంది. కుల వివక్షతను గుర్తించటం, దానికి వ్యతిరేకంగా పోరాడటం, ఎంత చిన్న స్థాయిలోనైనాసరే మానసిక ఉద్రిక్తతను ఎదుర్కొనటమే. ప్రచ్ఛన్న ధోరణులతో నడిచే ఈ కులతత్వం యొక్క ప్రభావం వెంటనే ఏమీ చూపించకపోయినా, చాలా తీవ్రంగా ఉంటుందనే విషయాన్ని గ్రహించాలి. చేస్తున్న ఉద్యోగాలకు రాజీనామా చేయటం, చదువు మధ్యలో మానేయటం ఇందులో భాగమౌతాయి.

కంటికి కనిపించకుండా మన జీవితాన్ని ప్రభావితం చేస్తున్న ఈ అధికార ధోరణుల్ని అర్థం చేసుకోవటానికి ప్రయత్నించాలి. మన అనుభవాలను క్రోడీకరించి ఈ ధోరణులను అడుగడుగునా ఎదుర్కోవాలి. వ్యక్తిగతంగా, సామాజికంగా, రాజకీయంగా ఒకటేమిటి సమాజంలోని అన్ని అంశాలతో అనుక్షణం పోరాడాలి. సంస్థాగత విషయాలలో, సామాన్య జనజీవన సంఘటనల్లో ఇంకా ముందుకి వెళితే పాలనా నిర్ణయాధికారాలు, ప్రసార, విద్యా, వైద్య, న్యాయ, సంక్షేమ వ్యవస్థలు, సాహిత్యం ఇవన్నీ కూడా కింది స్థాయి నుంచి ప్రతి చిన్న విషయం కూడా మౌలికమైన మార్పులకు గురికావలసిన అవసరం ఉంది. ఇది కేవలం కొద్ది రోజుల్లో జరిగే హఠాత్ మార్పు కాదు. ఒక తరం నుంచి ఇంకో తరం అభివృద్ధి పరచుకోవల్సిన అంశం.

—కె. సజయ

# ఎంగెల్స్ పునర్దర్శనం: స్త్రీలు–ఉత్పత్తి వ్యవస్థ, స్వంత ఆస్తి

(ఎంగెల్స్ రచించిన "కుటుంబం, వ్యక్తిగత ఆస్తి....."కి ఒక చారిత్రక ప్రాముఖ్యత ఉంది. ఆనాటి నిర్దిష్ట సామాజికార్థిక పరిస్థితుల ఆధారంగా స్త్రీ, పురుష అసమానతల పుట్టుక మూలాల్లోకి ఎంగెల్స్ వెళ్ళి వాటిని వెల్లడించాడు. ఎంగెల్స్ చేసిన ఈ మహత్తర కృషికి, నేటి అభివృద్ధి చెందిన పెట్టుబడిదారి సంక్లిష్ట, సంక్షుభిత సమాజంలో స్త్రీ, పురుష నంబంధాలు, అసమానతలకు కారణాలు, వాటి విముక్తి మార్గాలను 'కారెన్ సాక్స్' మార్క్సిజం వెలుగు బాటలో ఘరింత ముందుకు పోయి అన్వయించారు. అయితే 'కారెన్ సాక్స్' అన్ని అభిప్రాయాలు ఆమోదయోగ్యం కాకపోయినా నమకాలీన సామాజికార్థిక పరిస్థితులకు మార్క్సిజాన్ని సృజనాత్మకంగా అన్వయించడంలో ఒక ప్రయత్నంగా 'ఎంగిల్స్ పునర్దర్శనం' అనే వ్యాసానికి సహగామి చేసిన స్వేచ్ఛానువాదాన్ని పాఠకులకు అందిస్తున్నాం. -సంపాదకుడు)

స్త్రీల సాంఘిక స్థితి గతులు పురుషుల సంఘిక స్థితి గతులతో పోల్చి చూసినపుడువేరుగా ఉన్నాయి. ఈ తేడా పునాదుల గురించిఎంగెల్సు చెప్పిన భావాలను మరోసారి పరిశీలించడమే ఈ వ్యాసం ఉద్దేశ్యం. స్త్రీల స్థితి గతుల గురించిఎంగెల్సు మాత్రమే ఒకభౌతికవాదసిద్ధాంతాన్ని అందించాడు. సమాజాలను బట్టీ, యుగాలను బట్టీస్త్రీల స్థితి గతులు మారుతూ వచ్చాయి అని ఈ సిద్ధాంతం చెప్తుంది. అంతేకాక, ఈమార్పు అయా సమాజాలలో ఆనాడు ఉనికిలో ఉన్న ఆర్థిక-రాజకీయ సంబంధాలను బట్టి ఉంటుందని కూడా ఈ సిద్ధాంతం చెప్తుంది. ఎంగెల్సు అలాంటి సిద్ధాంతాన్ని అందించినప్పటికీ అతని భావాల్లోలోపాలున్నాయి. మానవ పరిణామ వివరాల విషయంలో అతని నుండి ఈ లోపాలువ్యక్తమయినాయి. ఏదిఏమైనా, అతని భావాలలోని ప్రధానాంశాలుసరైనవనేనా అభిప్రాయం. అతను ఈ భావాలు ప్రకటించిన తర్వాత చాలా క్రొత్త విషయాలు వెలుగులోకి వచ్చాయి. మానవ పరిణామ శాస్త్రం, చరిత్ర రంగాల ద్వారా ఈ వియాలు తెలిశాయి. స్త్రీల సామాజిక స్థితిగతులు అన్నివేళలందూ, అన్నిచోట్లాలేదా చాలా నందర్భాలలో పురుషులకు లోబడి ఏమీలేవు అని ఈ విషయాలు నిరూపిస్తున్నాయి. ఈ విషయాలను వివరించుకోవడానికి ఎంగెల్సు భావాలలోని ప్రధానాంశాలు ఈనాటికీ అత్యుత్తమమైన పద్ధతి నందిస్తాయనే నా అభిప్రాయం.

అనేక ప్రపంచ దేశాల ప్రజల సామాజిక వ్యవస్థలపై పెట్టుబడి దారీ విధానం పెత్తనం చేసింది. వాటిని మార్చింది కూడా. అందువల్ల, వర్తమాన స్థితిగతులను అర్థంచేసుకోవడానికి భవిష్యత్తును తీర్చిదిద్దుకోవడానికి మానవ పరిణామ శాస్త్రమూ, చరిత్రా అందించిన పలువిషయాలను పరస్పరం జోడించుకుంటూ ఎంగెల్సు మాదిరిగా గతంలోకి తొంగి చూడడం వల్ల ఎంతో ఉపయోగం ఉంది. ఆర్థిక - రాజకీయ సంబంధాలను నడిపించే పెట్టుబడిదారి యేతర పద్ధతులనీ ఈ పద్ధతులు ఆడ - మగల సాపేక్షిక (సామాజిక) స్థితిని ఏవిధంగా ప్రభావితం చేశాయనే విషయాలను ఎంగెల్సు పరిశీలించాడు. ఈ పరిశీలన ద్వారా ఎంగెల్సు రెండు ప్రశ్నలకు సమాధానం పొందగలిగాడు. ఒకటి ; పెట్టుబడీదారీ నమాజంలో స్త్రీలు మగవారికిఎందుకు లోబడి ఉన్నారు? రెండు : ఆడ - మగ అసమానతను అంతం చేయడానికి ఏలాంటి ఆర్థిక - రాజకీయ మార్పులు కావాలి ?

## కుటుంబం, వ్యక్తిగత ఆస్తి – రాజ్యాంగ యంత్రాల పట్టుక (1891)

స్త్రీల (సామాజిక) స్థాయిపై చేసిన ఒక విశ్లేషణ మాత్రమే కాదు, ఈ రచనకు అంతకు మించినప్రాముఖ్యత ఉన్నది. వర్గ సమాజానికీ, వర్గ రహిత సమాజానికీ మధ్య గల గుణాత్మక తేడాకు ఇది అద్దం పడుతుంది. ఒక పరిణామాత్మక చట్రంలో ఈ రచన సాగింది. స్వంత ఆస్తి పుట్టిన తీరును అది వివరిస్తుంది. ఒకటి రంగం మీదకంటూ వచ్చిన తర్వాత స్వంత ఆస్తి అనేది ఒకవైపు ఆర్థిక విభాగాలుగా కుటుంబాలనూ మరోవైపు, స్వంత ఆస్తులలో అసమానతలను సృష్టిస్తూ చివరకు అక్కడనుండి దోపిడీ వర్గ సమాజాలనే సృష్టిస్తూ అప్పటి వరకూ సమానత్వ ప్రాతిపదికన నడుస్తున్న గణతంత్ర సమాజాలను ఏవిధంగా చెడగొట్టివేసిందీ అనే విషయాలను ఈ రచన వివరిస్తుంది. స్వంత ఆస్తి అనేది సమాజాన్ని నడిపించే ఒక సూత్రంగా బలం పుంజుకున్న తర్వాత స్త్రీల సామాజిక స్థితి ఎలా దిగజారిందో ఈరచన వివరిస్తుంది. (స్వంత) ఆస్తి వల్ల ఈ ఫలితాలు మాత్రమే ఎందుకుతప్పని సరిగా వచ్చాయనే దానికి ఈ రచన ఒక విశ్లేషణను కూర్పు చేస్తుంది. స్త్రీల పనిని నడిపించడంను ప్రత్యేకంగానూ, ఇక మొత్తంగానేమో వర్గం అదలేదామగ అనే వాటితో ఆస్తి సంబంధాలను వ్యక్తిగత ఆస్తి ఎలా మార్చుతూ వచ్చిందనే విషయ విశ్లేషణను కూడా కూర్పు చేస్తుంది.

ఆడవారి పనిలో వచ్చిన మార్పుల వల్లనూ ఒక ప్రధాన విభాగంగా కుటుంబం ఎక్క రావడం వల్లనూ వర్గాలు ఏర్పడక ముందున్న సమాజాలలో ఆడ - మగల మధ్య ఉంటూ వచ్చిన సమానత్వం అనేది ఎలా క్షీణించి పోయిందో ఎంగెల్సు చెప్పాడు. ఎంగెల్సు చెప్పిన ఈ విషయంలోని కొన్నికీలక అంశాలను ఒక దగ్గరకు లాగి చూసే ప్రయత్నం ఈ వ్యాసం మొదటి భాగంలో జరిగింది. విశేషించి ఎంచుకున్న అన్వయ సారాంశం కూడా. విశేషించి ఎంచుకున్న కొన్ని అంశాల సారాంశం అని ఈ క్రింది కారణాల వల్ల అనడం జరిగింది. ఒకటి స్త్రీల (సామాజిక) స్థితితో జోడించి చూపినపుడుసార్వజన శ్రమ పైనా, కుటుంబంపైనా, స్వంత ఆస్తిపైనా

ఎంగెల్సు వెలిబుచ్చిన భావాలపై ఈ భాగం కేంద్రీకరిస్తుంది. రెండు : వావివరుసలతో నిమిత్తంలేని లైంగిక సంబంధాలపైనా, బహిర్వివాహ పద్ధతిపైనా, మానవ సమాజం సాధారణ పరిణామంలోని మొదటి దశలపైనా ఎంగెల్స్ చేసిన చర్చను ఈ భాగం మినాహాయిస్తుంది. పోతే, ఎంగెల్సు ఈ రచన చేసిన తర్వాత వెలుగులోకి వచ్చిన కొన్ని విషయాలను నేను దర్శినిగా ఉపయోగించాను కాబట్టి ఈ భాగాన్ని అన్వయ సారం అని కూడా పైన అనడం జరిగింది. రెండువ భాగంలో, వర్గ రహిత సమాజాల సంబంధించి ఎంగెల్సు ఎంచుకున్న పరిభాషనూ, చట్రాన్ని కొంత పునర్నిర్వచించడం జరిగింది. ఒక మూడవ భాగంలోనేమో, స్త్రీల (సామాజిక) స్థాయిని నిర్ణయించడంలో సార్వజన శ్రమ, స్వంత ఆస్తి, కుటుంబం ప్రాముఖ్యత గురించి ఎంగెల్సు ప్రకటించిన భావాలను పరీక్షించి చూడడం జరిగింది. మానవ సమాజ పరిణామానికి సంబంధించిన వివరాలతో బోదిస్తూ ఎంగెల్సు భావాలను పరీక్షించడం జరిగింది. సార్వజన శ్రమా, స్వంత ఆస్తీ, కుటుంబం అనేవి స్త్రీల (సామాజిక) స్థాయిని నిజంగానే నిర్ణయిస్తాయి. అయితే, వీటి ప్రాముఖ్యతను పరీక్షించిచూసినపుడు ఎంగెల్సు భావనను కొంత సవరించవలసి ఉందని అనిపిస్తుంది. ఆ సవరణ ఏమిటంటే, స్త్రీలు సామాజిక పౌరులుగానీ లేదా భార్యలుగా పరాధీనలుగానీ అయి ఉన్నారని. చివరగానాల్గవ భాగంలో, అడవారి చుట్టూ గీతగీసి వారిని లోబరుచుకోవడానికి వర్గ సమాజాలు కుటుంబాన్ని వాడుకున్నాయి అని ఎంగెల్సు చెప్పిన దానికి మరో ప్రత్యామ్నాయ వివరణ - ఈ పైన చెప్పిన సవరణ మీద ఆధారపడి మరో ప్రత్యామ్నాయ వివరణ - ఇవ్వడం జరిగింది.

## ఎంగెల్సు సిద్ధాంతంలో స్త్రీలు. ఒక పునర్నిర్మాణం

సమాజంలో స్త్రీలు స్వేచ్ఛా, సమానత్వాలను అనుభవించే సభ్యులుగా ఉండేవారు. వారు ఆస్థాయి నుండి బానిసలుగానూ, పరీధీనలుగానూ ఉండే పెళ్ళాలు, ఆయాల స్థితికినెట్టబడ్డారు. వారు ఈ స్థితికి నెట్టబడిన తీరు తెన్నుల మీద ఎంగెల్సు ఒక చారిత్రక క్రమాన్ని ప్రతిపాదించాడు. పురుషులకు మాత్రమేస్వంతం అయిపోయిన ఆస్తి పెరగడం ఈ మార్పుకు కారణం. కుటుంబం ఆస్తిని తనస్వాధీనం చేసుకుంటుంది. ఆపైన దానిని కొనసాగిస్తుంది కూడా. సమాజం తొలి దశలలో ఉత్పత్తివనరులు తెగ లేదా గణం ఆస్తిగా ఉండేవి అనిఎంగెల్సు అంటాడు. ఏరోజుతిండిని ఆరోజే తెచ్చుకుని వండుకు తినవలసి వచ్చేది. ఉత్పత్తి వినియోగం కోసం మాత్రమే జరిగేది. అంటే, నిలుపుకోవడానికి అవసరమైన స్థాయిలోనేఉత్పతి జరిగేది. మారకం కోసం అదనంగాఉత్పత్తి జరిగేది కాదు.

భార్యా భర్తలు వారిపై ఆధారపడి ఉన్న పిల్లలూ అంతా కలిపి ఒక గ్రూపు అనుకుంటే -- ఈ గ్రూపు ఉత్పత్తి చేసే విభాగంకాదు. ఇంటి పనిచేసే విభాగం కూడాకాదు. ఈ గ్రూపుకు స్వంత ఆస్తి అనేది అంతకన్నా ఉండేది కాదు. ఆర్థిక కార్యకలాపాలు (అంటే - ఉత్పత్తి, వినిమయం, స్వంత ఆస్తి) కుటుంబాన్ని నిర్వచిస్తాయనిఎంగెల్సు అనుకున్నాడు కాబట్టీ పై గ్రూపు ఆనాటికి ఒక ఆర్థిక విభాగం కాదు కాబట్టీ ఆ దశలో కుటుంబం ఉనికిలో లేదు. చాలా మంది ఉన్న ఒక గృహ పరివారాన్ని వడబోసినప్పటికీ కుటుంబం అనేదేదీ మిగిలేది కాదు. ఈ గృహపరివారమే అత్యంత ప్రాథమికమైన ఆర్థిక-రాజకీయ విభాగం. ఇందులో ఆహార నిల్వలు సమిష్టిగా ఉండేవి కాబట్టీ ఏపనైనా వ్యక్తుల కోసమో లేదా జంటల (దంపతుల) కోసమో కాకుండా మొత్తం గృహ పరివారం కోసం జరిగేది కాబట్టీ ఈ విభాగానికి కమ్యూనిస్టు స్వభావం ఉన్నదని చెప్పడం జరిగింది. స్త్రీలు ఇంటి పనిని చేస్తూ ఈ పరివారాలను నడిపించే వారు.

*'పురాతన కమ్యూనిస్టు పరివారంలో ఎన్నో జంటలూ, ఎందరో పిల్లలూ ఉండేవారు. దానిని నడపించే పని ఆడవారికి అప్పగించబడి ఉండేది. మగవాళ్ళు తిండి సంపాదించడంలాగే కుటుంబాన్ని నడపడం కూడా సాంఘికంగా అవసరమైన పరిశ్రమ అయి ఉండింది''*

స్త్రీపురుషుల బ్రతుక్కీ, శ్రమకీ కుటుంబం పరమార్థం కాదు. రక్త సంబంధం ప్రాతి పదికగానే లేదా అంతా ఒక చోట కలిసి బతికే దాని ప్రాతి పదికగానే ఏర్పడిన ఒకచోట కలిసి బతికే దాని ప్రాతిపదికగానే ఏర్పడిన ఒక పెద్ద సమూహమే వారి పరమార్థం. ఆస్తిపై సమిష్టి హక్కు కలిగిన ఈ సమూహాన్నే ఎంగెల్సు 'తెగ 'అన్నాడు. స్త్రీలకు పురుషులకు కొన్ని స్వంత పనిముట్లూ, మరికొన్ని వస్తువులూ ఉన్నాగానీ వారి మరణానంతరం అవి అదే తెగలోని సభ్యులకు - ఆడవారివి ఆడవారికీ, మగవారివి మగవారికి మాత్రమే - దఖలు చేయబడేవి అవి వారి పిల్లలకు మాత్రమే ఖచ్చితంగా దఖలు పడాలని కూడా ఏమీ లేదు. అన్ని రకాల ఆర్థిక - రాజకీయ విషయాలపై జరిగే నిర్ణయాలలో ఈ స మూహంలోని సభ్యులందరూ ఆడ, మగ తేడా లేకుండా పాల్గొనేవారు. ఆడ మనిషిగానీ. మగ మనిషిగానీ ఇద్దరూ సమూహం ఆర్థిక మనుగడకు కీలకమైన సవలు చేస్తుండేవారు కాబట్టి ఇద్దరికీ కూడా సమాన హక్కులు ఉండేవి.

స్వంత ఆస్తి అనేదాని ఊసే లేదు కాబట్టి మగవారి ఉత్పాదక శ్రమకుగానీ, స్త్రీలు పరివారంలో చేసే పనికిగానీ సామాజికంగా సమానమైన ప్రాముఖ్యత ఉండేదని ఎంగెల్సు నిర్ధారించాడు. స్త్రీలుపురుషులు ఒకే మాదిరి సరుకుల ఉత్పత్తి - అంటే, ఊపిరి నిలుపుకోవడానికి మాత్రమే అవసరమైన ఉత్పత్తి - వేరువేరు దశలలో పాల్గొనడం మట్టుకే జరిగేది. మొత్తం ఉత్పత్తికీ ఒకే స్వభావం ఉండేది. వాడుకోవడం కోసం మాత్ర/ ఉత్పత్తి జరుగుతుండేది.

సమాజం మొట్టమొదటి దశలలో స్త్రీలు అనుభవించినసార్వజన హక్కులపై ఎంగెల్సు కేంద్రీకరించాడు. ఆ హక్కులు ఉదాహరణకు : రాజకీయ నిర్ణయాలు చేయడంలో స్త్రీల పాత్ర తమ గణ పెద్దను క్రిందకు దించడంలో స్త్రీలకున్న సమిష్టి హక్కు (ఇరాక్వ్యూ తెగలో) మొ॥వి. గణాలలో సభ్యత్వాన్ని బట్టి స్త్రీలకు ఈహక్కులు

సంక్రమించాయి. అయితే గణంలో సభ్యత్వం కూడా ఆయా వ్యక్తులు చేసేసార్వజన శ్రమ లేదా సామాజికశ్రమ పై ఆధారపడి ఉండేది. పురుషుడితో పోల్చినపుడు స్త్రీకి (అనాడు) ఉన్న ఉన్నత (సాంఘిక) హోదా ఎంగెల్సును ఆకట్టుకున్నది. గృహ పరివారంలో కీలకమైన చోటుండేది. అలాంటి ఆడవారి మధ్య కలిసికట్టు తనమూ, రక్త సంబంధాలూ రెండూ కూడా వారికి ఈ ఉన్నతహోదా రావడానికికారణాలయినాయనిఎంగెల్సు చెప్పాడు.

సమాజంలో సమాన హక్కులు ఉన్న స్త్రీల స్థితి బానిసల లాంటి పెళ్ళాల స్థితికి మారిపోయింది. విలువైన ఉత్పత్తి వనరుల అభివృద్ధి అనేది ఈ మార్పుకు వస్తు పునాదిగా పనిచేసింది. ఇలాంటిమొట్టమొదటి ఉత్పత్తి వనరుల అభివృద్ధి అనేది ఈ మార్పుకు వస్తు పునాదిగా పనిచేసింది. ఇలాంటి మొట్టమొదటి ఉత్పత్తి వనరు పెద్ద జంతువులను మచ్చిక చేసుకుని వాటినిస్వంత ఆస్తిలాగా ఉంచుకోవడం. "స్వంత", "ఆస్తి" అనే ఈ రెండు పదాలకు ఎంగెల్సు ఒకప్రత్యేకమయిన అర్థంచెప్పుకున్నాడు. ఉత్పాదక శక్తి కలిగిన వస్తువులను గానీ లేదా వనరులను గానీ ఆస్తి అనడం జరిగింది. జనం దగ్గర వ్యక్తిగతంగా స్వంత వస్తువులు ఉన్న విషయం ఎంగెల్సుకు తెలుసు. ఈ వస్తువులు కూడా విడివిడి వ్యక్తుల స్వంతమే అయినప్పటికీ ఎంగెల్సు "ఆస్తి" అనేపదానికి చెప్పుకున్న అర్థంప్రకారం ఇవేవీ ఆస్తులు కావు. ఉత్పాదక శక్తికలిగిన వస్తువులనే ఆస్తిగా పరిగణించవచ్చు. పనిముట్లుప్రధానం కావు. ఎందుకంటే, వాటి తయారీకి అవసరమైన వస్తువులూ, నేర్పూ అందరికీ సమానంగా అందుబాటులో ఉంటాయి. పారిశ్రామికీకరణ లేని సమాజాలలోనయితే మచ్చిక చేసుకోబడిన జంతువులూ, సాగు చేయబడిన భూమీ అనేవి అత్యంత ప్రాధాన్యత గల స్వంత ఆస్తి రూపాలవుతాయి. ఇవి ఉత్పత్తి వనరులు.

పెట్టుబడిదారీ విధనాంలో వాడబడుతున్న దానికంటే విశాల అర్థంలో "స్వంతం" అనే పదాన్ని ఎంగెల్సు వాడాడు. పెట్టుబడీ దారీ విధానంలో హక్కుదారు తన ఆస్తిని ఏ విధంగా వాడుకోదల్చినా అడ్డంకులు ఉండవు ఒకానొక ఆస్తి (ఉత్పాదక వనరు) ఒక వ్యక్తి లేదా ఒక కుటుంబం స్వంతమై ఉండి దానిని నిర్వహించే హక్కు ఏదో ఒక హక్కు దారు చేతిలో ఉంటే అలాంటి ఆస్తిని స్వంత ఆస్తి అని ఎంగెల్సు అంటాడు. అంతేకాక, అలాంటి వస్తువులను (ఆస్తిని) కొంత మేరకు అమ్ముకోగల అవకాశమూ ఉంది. పెళ్ళాలను గానీ, వ్యాపార వృత్తి సంబంధాలను గానీ, సేవలను గానీ పొందుటకు ఈ అమ్మకం జరుగవచ్చు. "జీవన భృతి సంపాదించడం" ఎప్పుడూ పురుషుల పనిగానే ఉందనీ, ఉత్పత్తి సాధనాలను ఉపయోగించేవారే ఎల్లప్పుడూ వాటి స్వంత దారులనే ఎంగెల్సు పరిగణించాడు. (వాటిపై వారసత్వపు హక్కు మాత్రం మొత్తం తెగకు ఉందనే ఒక నిబంధననుఎంగెల్సు దీనితో జోడించాడు.) ఈ విధంగా పరిగణించిన ఎంగెల్సు దీనిని కారణంగా చూపుతూ ఒక నిర్ధారణకు వచ్చాడు. తొట్టతొలి స్వంత ఆస్తి అయిన మచ్చిక చేయబడిన జంతువులు ఖచ్చితంగా పురుషుల స్వంత ఆస్తే అయిఉండాలని అన్నాడు. జంతువులను మచ్చిక చేసుకోవడానికి కొంతనేర్పు కావాలి. అలాగే, గణనీయమైన కాలంతో పాటు శ్రమ ఉత్పాదకత నిలిచి ఉండే రీతిలో దానిని (శ్రమను) భూమిపైవెచ్చించడానికి కూడా కొంత నేర్పుకావాలి. ఇటువంటినేర్పును ఒకసమాజం సమకూర్చు కోవడానికి సాంకేతిక అభివృద్ధి, సహజవనరులూ అవకాశం కల్పించాయి. ఆ అవకాశం దొరికినప్పుడే మానవ జాతి చరిత్రలో స్వంత ఆస్తి సాధ్యం కాగలిగిందని ఎంగెల్సు అభిప్రాయం. నిరంతరం వర్ధిల్లే ఉత్పాదకతయే నిరంతరం వర్ధిల్లే స్వంత ఆస్తికి దారినిచ్చిందని ఎంగెల్సు నమ్మకం.

అప్పటి దాకా పనిముట్లపై వ్యక్తిగత యాజమాన్యం ఉన్నది. మచ్చికైన జంతువులను కూడా ఇదే యాజమాన్య రూపం కిందకు తీసుకురావడం జరిగింది. అయితే, సరికొత్తగా జాబితాలోకి చేరిన ఈ జంతువులనేవి గుణాత్మకంగా భిన్నమైన పనిముట్లు: ఊపిరి నిలుపుకోవడానికుండే అవసరాలను అవి తీర్చాయి. పైగా అవి తమనితాము పునరుత్పత్తి చేసుకున్నాయి. ఈవిధంగా పెరుగుతూ వచ్చిన స్వంత ఆస్తివల్ల తెగల సమిష్టి రాజకీయార్థికం చిన్నాభిన్నమై పోయింది. ఉత్పాదక ఆస్తులపై సమిష్టి యాజమాన్యం అనే లక్షణం తెగలలోని సమానతా విధానానికి పునాది. ఇక ఎప్పుడైతే ఆస్తిపై (పురుషుల) వ్యక్తిగత యాజమాన్యం మొదలయిందో అప్పటి నుండి కుటుంబం ప్రాముఖ్యత పెరిగింది. అప్పటిదాకా తెగ అనేది మాత్రమే కీలకమైన ఆర్థిక విభాగం. నిర్ణయాలు తీసుకునే విభాగం కూడా అలాంటి తెగ మీద కుటుంబం పైచేయి సాధించింది. తెగ అంతరంగిక చట్రానికి సమానతా విధానమనేది ప్రాతిపదిక కాగా కుటుంబానికి అలాంటి ప్రాతిపదిక గల చట్రం లేదు. కుటుంబంలో నిరాస్తి పరులయిన పరాధీనుల (యావన్మంది స్త్రీలూ, పిల్లలతో పాటు నిరాస్తిపరులయిన కొందరు పురుషులు కూడా) ఉన్నారు.

బయటి విశాల సమాజంలోని రాజకీయార్థిక సంబంధాలనుస్వంత ఆస్తి సమూలంగా మార్చివేసింది. అలా మార్చివేసింది కాబట్టి గృహ పరివారం లోపల స్త్రీల పురుష సంబంధాలనుకూడా స్వంత ఆస్తి మార్చివేసింది. మచ్చికైన జంతువలరూపంలోనిక్రొత్త సంపద ఎంగెల్సు దృష్టిలో ఒక ప్రాముఖ్యత కలిగిఉన్నాయి. ఉత్పత్తి చేసే విభాగాలమధ్య మారకానికి వీలైన అదనపుసరుకులుగా అవి ఉపయోగపడతాయి. కాలక్రమేణా మగవారి యాజమాన్యంలో ఉత్పత్తి, ప్రత్యేకించి మారకం కోసం జరిగే ఉత్పత్తి పెరిగిందీ, విస్తరించిందీ. వాడుకకోసం గృహ పరివారం చేస్తున్న ఉత్పత్తి మీద అది ఆవిధంగా పైచేయి సాధించింది. పారిశ్రామిక పెట్టుబడిదారీ విధానం ఈనాడుఒక ప్రత్యేక దశకు చేరుకుంది. ఈదశలో ఉత్పత్తి దాదాపు పూర్తిగా సామాజిక స్వభావం కలిగి ఉంటుంది. గృహ పరివారానికి అవతల సాగుతుంది. అలాగే, మారకం కోసమేఉత్పత్తి సాగుతుంది. ఈ మార్పులన్నీ స్త్రీల

పనినికుటుంబ వినియోగానికి సంబంధించిన స్వంత వ్యవహారంలాగా వదిలివేశాయి.

మారకం కోసం సాగేఉత్పత్తి వాడుక కోసం సాగేఉత్పత్తిని మింగివేసింది. తద్వారా అది గృహ పరివారం స్వభావాన్ని మార్చేసింది. గృహ పరివారంలోపల స్త్రీల పని స్వభావాన్ని మార్చేసింది ఇక అక్కడ నుండి మొత్తం సమాజంలో ఉన్న స్త్రీల స్థానాన్ని మార్చేసింది. స్త్రీలు అంతకుముందు మొత్తం సమాజం కోసం పనిచేశారు. పై మార్పుల తర్వాత వారిపని లక్ష్యమే మారిపోయింది. అప్పటి నుండి వారు తమ భర్తల కోసమూ, కుటుంబాల కోసమూ పనిచేశారు. స్వంత ఆస్తి తనయజమానినే గృహ పరివారం పాలకునిగానిలబెట్టింది. గృహ పరివారపుయజమానిఆస్తినినిలబెట్టుటకూ, వృద్ధి చేయుటకూ స్త్రీలూ, ఆస్తిలేనిఇతరపరాధీనులూ శ్రమించారు. ఎందుకంటే, అతడు (గృహ పరివారపు యజమాని) ఇతర గృహపరివారపు యజమానులతో ఉత్పత్తి, మారకాల పోటీలో అప్పటికే మునిగి తేలుతున్నాడు. అప్పుడు కూడా స్త్రీలు ఒక అవసరం గానే ఉన్నా కానీ, మారకానికి అనువయిన అదనపు సంపదనుత్పత్తి చేయడంలో అది (ఆడవారిశ్రమ) సామాజికంగా తక్కువప్రాముఖ్యత గల భాగంగానే ఉండింది. (ఆవిధంగా) ఆడవాళ్ళు సమాజంలో పౌరులుగాకాక అయాలు గానే, పెండ్లాలుగానే,బిడ్డలుగానే మిగిలిపోయారు.

ఆస్తిని వారసత్వంగా పొందుతూ కుటుంబాలు తమని తాము అన్ని కాలాలలో కొనసాగించుకున్నాయి. ఆవిధంగా పిల్లలకిచ్చే నిర్వచనంలో మార్పులువచ్చాయి. సంఘంలో ఉండే సమూహాలలోనూతనతరానికి సంబంధించిన వారుగా పిల్లల స్థాయి ఉండేది. పిల్లలకున్న అలాంటి స్థాయి పై మార్పుల వల్లపూర్తిగా మారిపోయింది. వ్యక్తులకు (మగవారికి) వారసులుగా మాత్రమే పిల్లలు మిగిలిపోయారు. లేదా తక్కువ ప్రాముఖ్యతగల, పరాధీనశ్రామికులయ్యారు. ఈ పరిణామాలు మరొక ప్రభావాన్ని కలుగజేస్తున్నాయి. అదేమంటే, స్త్రీల (వస్తు) ఉత్పాదక శ్రమకున్న సామాజిక ప్రయోజనమనేస్వభావం పోయి వ్యక్తిగత ప్రయోజనమనే స్వభావం ఎలాగైతే వచ్చిందో అదేమాదిరిగా వారిపునరుత్పాదకశ్రమ (పిల్లలనుకని, పెంచే శ్రమ) కు కూడా అలాంటి స్వభావమే వచ్చింది. అంటే, పురుషుల ఆస్తికీ, సాంఘిక హెూదాకీ కావల్సిన వారసులను స్త్రీలు (కడుపులోనూ, గుండెల మీదనో) మోశారు. ఈ మార్పుకుపూర్వం కూడా పిల్లల్ని కనిపెంచింది స్త్రీలే అయినా ఆ శ్రమ లక్ష్యాలే వేరు. స్త్రీలు ఈ ప్రత్యేక శ్రమైకనూతనతరం కోసం జరిగేది. ఆడా, మగా ఇద్దరూ సమానభాగస్తులయిన సాంఘిక సమూహం నూతన తరాన్ని కనిపెంచడం కోసమే ఆశ్రమ జరిగేది. ఈనాడు ప్రజలూ స్వంత ఆస్తీ అనేవి ఒక దానినొకటిపెనవేసుకు పోయాయి. ఒకదాని నిర్వచనంలోమరొకటి భాగం అయింది.

సాంకేతిక పరిజ్ఞానం అభివృద్ధి అవుతూ వచ్చింది. స్వంత ఆస్తికూడా పోగుపడుతూ వచ్చింది. ఈ క్రమంలో ఆస్తిపరులుతమ రక్త సంబంధీకులలోని తక్కువ ప్రాముఖ్యత గలవారితోతమని తామూ వేరు చేసుకున్నారు. నిరాస్తి పరులు హక్కులకు వ్యతిరేకంగా తమలాంటి ఆస్తిమంతులతో పొత్తు కుదిరారు. రక్త సంబంధాల పై ఆధారపడిన ఉత్పాదకసాంఘిక సమూహాలు ఇంతటితో అంతమై పోయాయి. వర్గ సమాజమూ రాజ్యమూ మొదలయ్యాయి.

## ఎంగెల్సు సిద్ధాంతమూ– వర్గ రహిత సమాజాలూ

ఎంగెల్సు చెప్పిన సామాజిక శ్రమ, మారకం కోసం ఉత్పత్తి అనే అవగాహనలను ఉపయోగించడానికి వర్గ రహిత సమాజాలకు వాటిని అన్వయించడానికి నేను వాటిని పునర్నిర్వచించవలసిఉన్నది. ఈ (వర్గ రహిత) సమాజాలు నడిచే తీరుతెన్నులకు అనుగుణంగా ఈ నిర్వచనాలను చేయవలసి ఉన్నది. వర్గ రహిత సమాజాలలో సామాజిక లేదా సార్వజన శ్రమ అనే పేర్లను ఉపయోగించినపుడు ఉమ్మడి ఆస్తిగల సమూహాలకోసమూ, ఆ సమూహాల లోపలా జరిగే శ్రమ గురించే అతను నొక్కి చెప్పుతాడు. కానీ, (వాస్తవానికి) పెండ్లి కార్యాలు రెండుసమూహాలను తరుచుగా కలుపుతుంటాయి. అంటే, దీని అర్థం, పెండ్లి కుమార్తేనో లేదా పెండ్లి కొడుకో, కనీసం ఈ ఇద్దరిలోఎవరో ఒకరు, తన మాతృ సమూహం కోసం గానీ దాని లోపలగానీ ఈ శ్రమ చేయడం లేదన్న మాట. అదే సందర్భంలో ఆమె లేదా అతడు చేసేది స్వపరివారపు పని (ఈపదం ఎంగెల్సుకు ఇష్టమైన పదం) మాత్రమే అని కూడా ఖచ్చితంగా చెప్పలేము. తన గృహపరివారం కోసమే వారు ఆశ్రమ చేయడంలేదు. అందువల్ల ఎంగెల్సు చెప్పిన సామాజికశ్రమ అనే అవగాహనను నేను మరికొంచెం లాగిపొడిగిస్తాను. మరో గృహ పరివారం లోనిఎవరోఒకరుస్వంతం చేసుకునేదిగా లేదా ఎవరో ఒకరికిఉపయోగపడేదిగా స్వభావం ఉన్న శ్రమ కూడా ఉంది. ఈ శ్రమను ఒక్కరుగా చేయవచ్చు. లేదా సామూహికంగా చేయవచ్చు. ఇటువంటి శ్రమను కూడా తనలో ఇముడ్చుకొనే మాదిరిగా ఎంగెల్సు చెప్పినసామాజిక శ్రమ అనే అవగాహనను పొడిగిస్తాను. వ్యాసం తరువాయి భాగంలో సామాజిక శ్రమకుసంబంధించిన కొన్ని ఉదాహరణలనుచూపించాను. ఆ సామాజిక శ్రమ విస్తరించి ఉన్న పలురకాల నిర్మాణాలు ఇవి సూచన ప్రాయంగా తెలియ జేస్తాయి. అవి: సహకారశ్రమ సమూహంలోపాల్గొనడం, గణపెద్దకు నజరానాగా చేసే శ్రమ, వెట్టి, ఉమ్మడి ఆస్తిగా ఉన్న పశుపక్షాదులను పెంచడం, మొ॥వి.

వర్గ రహిత, సమాజాలను గురించి మాట్లాడుతున్నప్పుడు మారకంకోం ఉత్పత్తి అనే దానిపై ఎంగెల్సు చేసిన చర్చను కొంచెం విస్తరించి చెప్పుకోవల్సిన అవసరం ఉంది. అదనపు సంపదను ఉత్పత్తి చేయుటకు జనం తమంతతామే ఉన్న పలంగా పూనుకుంటారు అనే భావం ఎంగెల్సు చెప్పిన మాటల్లో (1891 : 264) అంతర్లీనంగా ఉంది. కానీ, జనం అలా పూనుకోరు. జనులు తమకు ఖర్చయ్యేదానకన్న ఎక్కువగా ఉత్పత్తి చేయాలంటే వారిని అందులోకి

బలవంతంగా నెట్టే అధికార శక్తి ఏదో ఒకటి ఉండాలి. ఒకరి కు అతిథ్యం, కానుకలూ ఇచ్చుకోవడం ఏసమాజంలో ఉన్న జనులకైనా అలవాటే. ఉపకారం పొందినవారు ఉపకారులకు తిరిగిఏదో ఉపకారం చేయవల్సిన బాధ్యత ఉంటుంది.

ఊపిరి నిలబెట్టే ఉత్పత్తి సాధనాలు అందరికీ అందుబాటులో ఉన్నంతకాలం సాధారణంగా అతిథ్యాన్నీ, కానుకలనూ దృష్టిలో ఉంచుకునే ఉత్పత్తి జరుగుతుంది. పైగా సృష్టించనూ వచ్చు లేదా సృష్టించగలమని అయినా ఆశించవచ్చు. కానీ, ఎప్పుడైతే ఊపిరి నిలబెట్టే ఉత్పత్తి సాధనాలు వ్యక్తుల స్వంతమయిపోతాయో లేదా వాటిపై యాజమాన్యంలో అసమానతలుంటాయో అలాంటప్పుడు ఉపకారంపొందిన వారు ఉపకారులకు తిరిగి సమాన విలువగల వస్తువులను ఇవ్వలేదు. అలాంటి బలహీనులనుండి వారు పొందిన ఉపకారానికి బదులుగా ఏదో ఒక చాకిరీని ఆశించవచ్చు. ఆవిధంగా వారు ఒక నమ్మిన బంటుగా, లేదా సేవకుడుగా తయారుకావచ్చు. అసమాన మారకపు విధానాలను పెంచి పోషించే మందీ మార్బలంలో ఒక భాగం కావచ్చు.

ఒకరి నుండిపొందిన ఉపకారానికి బదులుగా సమాన విలువగల వస్తువులైనా ఇవ్వవచ్చు లేదా చాకిరీనైనా చేయవచ్చు అని పైనా చూశాం. వస్తువులిచ్చినా గానీ, చాకిరీ చేసినాగానీ ఈ రెండుసందర్భాలలోనూ జరుగుతున్నది మారకం మాత్రమే. అయితే, రెండవ సందర్భంలోని వారి శ్రమ శక్తిని తమ స్వంత ప్రయోజనాలకు వాడుకోగలరు. ఇతరుల సేవలపై అజమాయిషీని సంపాదించ గల ఉత్పత్తినికూడా మారకం కోసం జరిగే ఉత్పత్తిలో భాగంగానే అందుమూలంగా చూడాలి. జంతువులను మచ్చిక చేసుకోవడం వల్లా, అవి స్వంత ఆస్తిగా మారినందువల్లా క్రమ ఉత్పాదకతా జంతువుల ఉపయోగమూ పెరిగాయనీ; ఈ పరిణామం తిరిగి సంపన్నులకు ఉపయోగపడే విధంగా శ్రమపై అధిపత్యం సాధించిదనీ; శ్రమను అమ్మకపు సరుకుగా మార్చిందనీ నిజానికిఎంగెల్సు వివరించాడు కూడా (పెరచన : 265)

స్వంత ఆస్తిలేని సమాజాలలో ఒక సమూహానికి మరొక సమూహానికి మధ్య వ్యాపారం కోసమో లేదా మార్పిడి కోసమే కూడా సరుకులుత్పత్తి జరుగుతుంది. అయితే, ఈ సరుకులుత్పత్తి ఒక ప్రత్యేకమైన రాజకీయార్థికచట్రానికి లోబడి ఉంటుంది. వాడకం కోసమే ఉత్పత్తి అను సూత్రానికే ప్రధానంగా లంకెవేయబడిన రాజకీయార్థికచట్రంలో స్వంత ఆస్తి రావడంతో సంపదలను ఉపయోగించి అనుచర బృందాలను పెంచుకోవడానికి అవకాశం దొరికింది. పోతే, అనుచర బృందం విధేయతను నిలబెట్టుకోవలసినా గానీ, మరిన్ని సంపదలను సృష్టించు కోవాలన్నా గానీ అదే అనుచర బృందం ఉత్పాదక శ్రమనూ, యుద్ధ శక్తినీ వాడుకోవాల్సిన అవసరం ఉంది. స్వంత ఆస్తి రాకడతో ఈ అవసరం కూడా తీరే అవకాశం దొరికింది. స్వంత ఆస్తి రాకతో ఎప్పుడైతే పై రెండుఅవకాశాలను కల్పించిందో అప్పుడు రాజకీయార్థిక రంగంలో అంతవరకూ కొనసాగుతూ వచ్చిన చట్రం చినిగి ముక్కలయ్యింది. ఏదిఏమైనా, వర్గ రహిత సమాజాలలో సాగే(ఇప్పటి దాకామనం చర్చించుకున్నటువంటి) మారకం కోసం ఉత్పత్తి ఈ ప్రత్యేక స్వభావం ఇటువ్యక్తిగత ఆస్తితోనూ, అటు రాజకీయార్థిక అసమానతలతోనూ చేయిచేయి కలుపుతుంది.

ఉదాహరణకు, మచ్చికైన జంతువులున్న వర్గ రహిత సమాజాలలో సంపదల తారతమ్యాలూ, ఒకరుమరొకరికి బంటుగా ఉండే పద్ధతి అమలులో ఉన్నాయి. ఈ జంతువుల అవసరం కేవలం మనుషుల ఊపిరి నిలబెట్టే ఉత్పత్తి చేయడం మట్టుకే కాదు. ఒక మగవాడుపెళ్ళి చేసుకోవాలన్నా, అతనికి ఏదో ఒక రాజకీయ గుర్తింపు కావాలన్నా కూడా ఈ జంతువులు అతనికి అవసరమే. సామ్రాజ్యవాద పాలనకు పూర్వం తూర్పు ఆఫ్రికాలో ఇలాంటిది అమలు జరిగేది. అక్కడి పురుషులు తమకు కావల్సిన పశువులను తమ రక్త సంబంధీకుల దగ్గరనే, లేదా గణ పెద్దకో, మరో సంపన్నునికో సేవలందించి వారి దగ్గర తెచ్చుకునేవారు. తమకుఈ ఉపకారం చేసిన వారికి అప్పటి నుండి వీరు విధేయులుగా ఉండేవారు. పురుషులు తాము పొందిన పశు పక్షి సంపదకు మారుగా ఆ ఉపకారులకు సేవలు కూడా అందించేవారు. పశువుల ఉత్పత్తినిఈ కోణం నుండి చూసినపుడు అది మారకం కోసం జరిగే ఉత్పత్తి లాంటిదే. పశుపక్షి సంపద పట్ల జనులందరికీ ఉన్న హక్కులూ, బాధ్యతలూ ఒకటినొకటి అస్పష్టం చేసుకుంటున్నాగానీ పశువులు మాత్రం వ్యక్తిగత ఆస్తిగానే ఉండేవి. ఎందుకంటే, అవికేటాయించబడే తీరుతెన్నులలో విచక్షణ ఉండేవి. అంతేకాక, ఈ విచక్షణ చేయగల పర్యాధికారాలు ఎవరో ఒకవ్యక్తి చేతిలో ఉండేవి.

**పౌరులుగా, భార్యలుగా ఆడవారు : నాలుగు ఆఫ్రికా సమాజాలు.**

ఎంగెల్సు సిద్ధాంతం సమగ్రంగానే ఉన్న నేను దానిని రెండు సమూహాలున్న భావాలుగా విడగొడతాను. దీని వల్ల అతని సిద్ధాంతం కొంత వక్రీకరణకు గురి అయ్యే ప్రమాదం ఉండవచ్చు. రెండు సమూహాలుగా విభజించాలనే అనుకుంటున్నాను. (1) స్త్రీల (సాంఘిక) హోదాను తక్షణం నిర్ణయించే అంశాల గురించిగానీ, వారిహోదా వస్తు పునాదుల గురించి గానీ అతనుచెప్పిన భావాలు మొదటి సమూహం. ఆ భావాలనుకొంచెం చెప్పుకుందాం. మగవాళ్ళనుగానీ ఆడవాళ్ళను గానీ సమాజం దృష్టిలో పౌరులుగా నిలబెట్టేది సామాజిక లేదా సార్వజనశ్రవం అని ఎంగెల్సు అంటాడు. అంతేగాక, స్వంత ఆస్తిపై మగవారికున్న యాజమాన్యం సంఘంలోనూ ఆడవాళ్ళపై వారి (మగవారికి) పెత్తనాన్నినెలకొల్పిందనీ ఎంగెల్సు అన్నాడు. 2) పరిణామాత్మకమార్పు గురించిన భావాలు ఈ రెండవ సమూహం. అభావం : పురుషుల స్వంత ఆస్తీ, మారకం కోసంఉత్పత్తీ, వర్గ సమాజమూ - ఈ మూడింటి అభివృద్ధితో పాటు స్త్రీల ( సాంఘిక) హోదా పూర్తిగా ప్రాముఖ్యతను కోల్పోయింది. ఇంటి నాలుగు గోడలకు పూర్తిగా పరిమితమైపోయింది.

స్త్రీల (సాంఘిక) హోదాను తక్షణంనిర్ణయించే అంశాలను ఈ

భాగంలో చర్చిస్తాను. మానవ పరిణామ శాస్త్రం చెప్తున్న కొన్ని విషయాలను ఈ చర్చలో ఉపయోగిస్తాను. స్త్రీల (సాంఘిక) హోదా వస్తు పునాదులపై మొట్ట మొదటగా కేంద్రీకరించే ప్రయోజనాన్ని ఈ చర్చ ద్వారా పొందవచ్చు. వర్గ రహిత సమాజాలలో కన్నా వర్గ సమాజాలలో స్త్రీల బ్రతుకులు అత్యంత నికృష్టంగా ఉన్నాయిని ఎంగెల్సు అన్నాడు. మొత్తంగా చూస్తే ఎంగెల్సు చెప్పిన ఈ విషయం నిజమే అయినా ఆడవాళ్ళు ఈ దయనీయ స్థితి ఎందుకుతలెత్తిందో మనం తెలుసుకోవలసిన అవసరం ఇంకా మిగిలే ఉంటుంది మానవ పరిణామ శాస్త్రం చెప్పే విషయాలను ఒక దానితో ఒకటి జోడిస్తూ వాటిని పునర్నిర్మించితే స్త్రీల (సాంఘిక) హోదాకు సంబంధించిన కొన్ని వాస్తవాలు చూడగలం. పెట్టుబడి దారీ యేతర వర్గాలు ఉన్నట్టి లేదా లేనట్టి పెట్టుబడిదారీ యేతర సమాజాలలో స్త్రీలకు ఉన్న రకరకాల (సాంఘిక) హోదాలను చూడగలం. ఈ విభిన్న హోదాలను ఒకదానితో ఒకదాన్ని పోల్చడం ద్వారాఎంగెల్సు భావాలపై మరింత వెలుగును ప్రదర్శించగలం.

ఎంగెల్సు అందించిన పరిణామాత్మక వివరణను ఉన్నదున్నట్టుగా చూస్తే అది సరైనదని నేను అంగీకరించను. స్వంత ఆస్తి లేని అనేకవర్గ రహిత సమాజాలలో కూడా ఆడవాళ్ళు మగవారికిపూర్తిగా సమానులు కారని చూపించే వాస్తవాలుఎన్నో ఉన్నాయి. వర్గాలు ఉన్నట్టి లేదా లేనట్టి అనేక సమాజాలలో ఆడవాళ్ళకు కూడా స్వంత ఆస్తులూ ఉన్నాయి. వారసత్వపు హక్కులు కూడా ఉన్నాయి. వ్యాసం చివరి భాగంలో వర్గసమాజాలనుండి కొన్ని ఉదాహరణ లివ్వడం జరిగింది. ఎంగెల్సు చేసిన నిర్ధారణలకు మరొక మార్గాన్ని సూచించే ఉద్దేశ్యంలో ఈ ఉదాహరణలను అక్కడ వాడడం జరిగింది.

క్రింద వివరించ బోయే ఉదాహరణ స్త్రీల (సాంఘిక) హోదా పునర్నిర్మాణం. సామ్రాజ్య వాదం తన పెత్తనాన్ని పకడ్బందీగా నెలకొల్పడానికి ముందు ఒక నాలుగు ఆఫ్రికా సమాజాలలోని స్త్రీల (సాంఘిక) హోదా పునర్నిర్మాణం ఇది. ప్రధానంగా మానవ పరిణామ శాస్త్రం అందిస్తున్న వివరాల ఆధారంగా ఈ పునర్నిర్మాణం జరిగింది.

జైరి దేశంలో బుటి అనే తెగ ఉంది. అందరూ కలిసికట్టుగా బ్రతికే గుంపు సమాజంగా ఈ తెగను చెప్పుకోవచ్చు. ఊపిరి నిలబెట్టుకొనే స్థాయిలోనే వీరి ఉత్పత్తి ఉంది. సమిష్టిగా వలలు పన్ని పశు పక్ష్యాదులను పట్టుకోవడం, శాఖాహార తిండిపదార్థాలను ఏరుకొచ్చుకోవడం పై వీరి మనుగడ ఆధారపడి ఉంది. దక్షిణాఫ్రికాలో లోవేడు అనే తెగ ఉంది. వీరు పార లాంటి సాధనం ద్వారా మాత్రమే వ్యవసాయం చేస్తారు. వీరి ప్రధాన ఉత్పత్తి కార్యకలాపం ఇదే. పోతే, అదే దక్షిణాఫ్రికాలోనే పొండో అనే మరో తెగ ఉంది. వీరు ఇటు వ్యవసాయాన్ని, అటు పవుపక్ష్యాదుల మచ్చికనూ జోడించి నడిపిస్తున్నారు. చివరగా ఉగాండా దేశంలోని గాండా తెగను తీసుకుందాం వీరి ప్రధాన ఉత్పత్తి కార్యకలాపం కూడా పారతో వ్యవసాయమే.

సమసమాజ (ఆదిమ) దశనుండి వర్గ సమాజం దాకా ఉన్న క్రమంలో ఈ సమాజాలను వరుసగా నిలబెట్టినట్టయితే వీటిని మనం మూడు ప్రధాన ప్రాతిపదికలపై విభజించవచ్చు. మొదటిది: బుటి, లోవేడు అనే తెగలు వాడుక కోసం ఉత్పత్తి అనే ఆర్థిక వ్యవస్థను కలిగి ఉన్నారు, పొండోలలోనేమో పశు పోషణ కేంద్రంగా మారకం కోసం ఉత్పత్తి అనే ఆర్థిక వ్యవస్థ అప్పుడప్పుడే మొదలవుతోంది, గాండాలలోనేమో మారకం కోసం ఉత్పత్తి అనే దానికి చాలా ప్రాముఖ్యత ఉంది. రెండవది: వాడుక ప్రాతిపదికన ఉన్న ఆర్థిక వ్యవస్థలైన బుటి, లోవేడు తెగలలో ఆడా, మగా ఇద్దరూ కూడా సాంఘిక శ్రమ చేస్తారు, పొండో తెగలోనేమో ఇది స్త్రీల పనిని నడిపించే మట్టుకే ఉన్నాగాని, మారకం ప్రాతిపదికన ఉన్న ఆర్థిక కార్యకలాపాలలో మగవాళ్ళు కొంతమైరకైనా సాంఘిక శ్రమ చేస్తారు, గాండా తెగలో స్త్రీల పని ఇంటి నాలుగు గోడలకు పరిమితమై గృహ పరివారం అవసరాలతో ముడిపడి ఉండిపోగా, మగవాళ్ళేమో మారకం కోసం సాగే ఉత్పత్తిలో గుంపులు గుంపులుగా దాదాపు మొత్తం శ్రమనూ వెచ్చిస్తారు. మూడవది: ఉత్పత్తి వనరులపై బుటి గుంపు మొత్తానికి సమిష్టి యాజమాన్యం ఉందేడు పొంటే తెగలలో ఈ వనరులు చాలా మట్టుకు పితృస్వామికకుటుంబ ఆస్తులుగా ఉన్నాయి; గాండాలలోనేమో ఈ వనరులుకుటుంబ కట్టుబాట్లకు అంత గట్టిగా బంధించబడి లేకుండా మగవారి చేతుల్లోనే ఉన్నాయి.

బుటి, లోవేడు, పొండో తెగలలో స్త్రీల ఉత్పత్తి కార్యకలాపాలు సాంఘిక స్వభావం కలవి. వాటిలో స్త్రీలకు పౌరుల సాంఘిక హోదా ఉంది., గాండా తెగలో ఆడవారి ఉత్పత్తి కార్యకలాపం ఇంటి నాలుగు గోడల మధ్యనే అని ఇదివరకే చెప్పుకున్నాం. విచిత్రమైన విషయమేమంటే అత్యధిక భాగం ఆహారాన్ని ఆడవాళ్ళే ఉత్పత్తి (ఉడకేయడం అనే అర్థంలో కాదు. సంపాదించడం అనే అర్థంలో) చేస్తారు. సాంఘిక పౌర సత్వానికి సామాజిక లేదా సార్వ జన శ్రమనే పునాదిగా చూడాలని ఎంగెల్సు చెప్పిన విషయం సరైనదేనని పిస్తుంది. అయినప్పటికీ, పై వాస్తవాలను ఇంకా వివరంగా చూసినపుడు ఒకటి స్పష్టంగా కనిపిస్తుంది. అదేమంటే, స్త్రీలని సామాజిక పౌరులగానో లేదా పెళ్ళాలూ, అయాలుగానో చిత్రీకరించ వలసిన వనిలేదు. ఆడవారు ఏకకాలంలో రెండుసాంఘిక హోదాలూ కలిగి ఉండవచ్చని పై వాస్తవాలు సూచిస్తున్నాయి. అంతేకాక, విశాల సమాజంలో స్త్రీలకున్న స్థానం పై ఏమాత్రం ఆధారపడకుండానే వారి (సాంఘిక) హోదా అనేది పెండ్లిళ్ల వల్ల ఏర్పడే సంబంధాలను బట్టి మారుతూంటుందని కూడా సూచిస్తున్నాయి. గృహ పరివారం ఆస్తిపాస్తులతో అలువుగలకు ఉండే సంబంధం పై ఆధారపడి భార్యల (సాంఘిక) హోదా ఉంటుంది. భర్తల హోదాతో సాపేక్షికంగానే భార్యల హోదా గురించి మాట్లాడుకోగలం భార్యలకున్న ఈ సాపేక్షిక (సాంఘిక) హోదాను ఎంగెల్స్ సరిగ్గానే అర్థం చేసుకున్నాడు. పెండ్లామో, మొగుడో

ఇద్దరిలో ఎవరి చేతిలో ఆస్తి ఉంటే వారే గృహపరివారాన్ని పాలిస్తారని ఎంగెల్సు సరిగ్గాచెప్పాడు. పట్టిక 1 లో కొన్ని సూచికల సారాంశాన్ని పొందుపరచడం జరిగింది. కుటుంబంలోనూ, సమాజం లోనూ ఆడవారి హోదాను ఈ సూచికలుతెలుపుతాయి. అంతేకాక, ఉత్పత్తి కార్యకలాపాలలో స్త్రీలు సమీకరించబడిన తీరుతో వారికి (ఆడవారికి ) ఉన్న సంబంధాన్నీ, ఆస్తి పాస్తుల యాజమాన్యంతో ఉన్న సంబంధాన్నీ ఈ సూచికలు తెలుపుతాయి. సారాంశంలో చూస్తే బుట్టి, లోవేడు తెగలలోని ఆడవాళ్ళుమగవాళ్ళతో సమానులు ; గాండా తెగలోని ఆడవారేమో మగవారికి అధీనులు; పొండో తెగస్త్రీల సాంఘిక స్థాయి పైరెండింటి మధ్య ఏదో ఒకచోట ఉంటుంది. పట్టిక1 లోని మొట్టమొదటి తొమ్మిది ప్రమాణాలు సాంఘిక పౌరసత్వానికి ప్రాతినిధ్యం వహిస్తాయని నేనుపరిగణిస్తాను. ఈ తొమ్మిదింటిలోని మొదటి ఐదు ప్రమాణాలు ఆడ - మగలకు గృహపరివారం బయట ఉన్న వారితో కూడా ఉండే సమానత్వపు సంబంధాలను ప్రతిబింబిస్తాయి.

పరస్పర సహకార సంబంధం అనేమొదటి ప్రమాణాన్నే చూద్దాం. ఉమ్మడి సాంఘికశ్రమను చేసే దానిపై ఆధారపడి సాంఘిక పౌరసత్వం ఉంటుందని ఇది సూచిస్తుంది. ఈ ప్రమాణం క్రిందికి వచ్చే ప్రత్యేక బుటి తెగలో ఏవీ లేవు. లోవేడు తెగలో మాత్రం జిల్లా పెద్దకూ, రాణికీ కొంత పనిచేయుటకు యుక్తవయసు గల వాళ్ళను ఆడ, మగ ఇద్దరినీ సమీకరిస్తారు. మనిషినిఎవరైనా కష్టపెట్టినపుడు ఆ ఆడమనిషి వయసు వాళ్ళూ, కొంచెం ఎక్కువ లేదా తక్కువ వయసున్న ఆడవాళ్ళ సమూహమూ ఆ కష్టపెట్టిన వ్యక్తి సమూహానికి వ్యతిరేకంగా సమష్టి చర్యను తీసుకుంటారు. పొండో తెగ స్త్రీలలో ఇరుగు పొరుగు నున్న వాళ్ళు పరస్పరం సహకరించు కుంటారు. ఒక ఆడ మనిషి, పెండ్లి బంధం బయట శారీరక సంబంధం ఏర్పరుచుకోవడానికి అదే గృహ పరివారంలోని స్త్రీలు సహకరిస్తుంటారు. ఎవరైనా ఆడమనుషులూ, బాలికలూ చేసే పనులు ఏవైనా లైంగిక నేరాలని స్త్రీలంతా అనుకుంటే అలాంటి నేరస్తులను వారు ఉమ్మడిగా శిక్షిస్తారు. స్త్రీలు చేసే ఈ ఉమ్మడి చర్యను మగవాళ్ళు ఆమోదిస్తారు. గాండాతెగ పురుషులు తమ రక్త సంబంధీకులుకాని వారితో కూడా అనేక సార్లు పరస్పర సహకార సంబంధాలను ఏర్పరుచు కుంటారు. గాండా తెగ బయటి వారితో కూడా మగవాళ్ళు ఇలాంటి సంబంధం ఏర్పరుచు కుంటారు. స్త్రీలకు మాత్రం ఇలాంటి ఏ సంబంధాలూ లేవు.

చట్ట వ్యవహారాలలో స్త్రీలు తమను తాము స్వతంత్రంగా హాజరు పరుచుకుంటున్నారంటే దానికొక ప్రత్యేక అర్థం ఉంది. స్త్రీలను కూడా నేరస్తులగానే లేదా నేరం చేయగల వారుగానే పరిగణించుటకు సంఘం దృష్టిలో వారికి ఆ శక్తి ఉందని గుర్తించినట్టు అవుతుంది. బుట్టి, లోవేడు, పొండోతెగలలో ఆడవాళ్ళు అలా తమని తాము స్వతంత్రంగా హాజరుపరుచు కుంటారు. గాండా తెగలో నేమో ఇందుకు పూర్తి వ్యతిరేకమైన ఆడ మనిషికి సంబంధించిన వ్యవహారం న్యాయస్థానానికి రావాల్సి ఉంటే ఎవరో ఒకమగ సంరక్షకుడు (సాధరణంగా భర్తో, తండ్రో) అవసరం అవుతాడు. ఆమె చర్యలకు ఆ సంరక్షకుడే తీరుస్తాడు. ఆమెకు జరిగిన నష్టానికి అంటే పరిహారం ఏదైనా ఉంటే దానినికూడా సంరక్షకుడే అందుకుంటాడు.

బుటి, లోవేడు, పొండో తెగలలో ఆడా, మగా అందరూ ఒక రకమైన సామాజిక కార్యాకలాపాలందు దాదాపు అన్నింటిలో పాల్గొంటారు. అయితే లోవేడు, పొండో తెగలలో యవ్వనంలో ఉన్న భార్యలు ఇంటి పనులకే ఎక్కువగా పరిమితం చేయబడతారు. సామాజిక కార్యకలాపాలలో పాల్గొనే తమ శక్తిని ఈ ఆడవారు వినియోగించడానికి వారి ఇంటి పని చాలా మట్టుకు అడ్డమొస్తుంది. వయసు మళ్ళిన భార్యలుగా రక్త సంబంధీకులను కలవడానికి వచ్చే అక్క చెల్లెళ్ళుగా, దేవపూజల్లో పాల్గొనే వాళ్ళుగా ఉన్నప్పుడు మాత్రం ఈ తెగల

**పట్టిక - 1**

నాలుగు ఆఫ్రికా సమాజాలలో మగవారితో పోల్చినపుడు సమాజంలో, ఇంటిలో స్త్రీల హోదా

| | స్త్రీల పాత్రకు వ్యతిరేకంగా విచక్షణ | | | |
|---|---|---|---|---|
| స్త్రీల హోదాకు సూచికలు-సామాజికం | బుటి | లోవేడు | పొడో | గాండా |
| పరస్పర సహకారం | -- | ఏమీలేదు | ఏమీలేదు | ఎక్కువ |
| స్వంత - ప్రాతినిధ్యం | ఏమీలేదు | " | " | " |
| అవకాశాలను సమాజ పరం చేయడం | " | " | " | " |
| పెండ్లి బంధం బయట లైంగిక కార్యకలాపం | " | " | " | " |
| విడాకులు | " | " | " | " |
| సంపదలు సమాజ పరం చేయడం | " | " | ఎక్కువ | " |
| రాజకీయ అధికారం | " | " | " | " |
| కుటుంబేతర తగాదాల పరిష్కారం | " | " | " | " |
| కుటుంబేతర దేవపూజ వగైరా | " | " | " | " |
| **ఇంటిక సంబంధించినవి** | | | | |
| అత్తవారి ఆస్తి పై భార్య వారసత్వం | ఏమీలేదు | ఎక్కువ | ఎక్కువ | ఎక్కువ |
| ఇంటి వ్యవహారాలపై భార్య అధికారం | " | " | " | " |
| వారసుల్ని కనిపెంచే ఆమెగా భార్య | " | " | " | |
| (అక్రమ సంబంధాలకు పరిహారం) | | | | |
| బహిష్టు, గర్భధారణలకు సంబంధించిన కట్టుబాట్లు | " | తక్కువ | తక్కువ | " |

అడవాళ్ళు కూడా మగవాళ్ళలాగే అన్ని సామాజిక కార్యక్రమాలలో స్వేచ్ఛగా పాల్గొంటారు. గాండా తెగలో జరిగే అత్యధిక సామాజిక కార్యకలాపాలు ప్రావకం సంపాదించుకోవడానికో, పరిపాలనా సంబంధితమో అయి ఉంటాయి. వీటి నుండి ఆడవారిని మినహాయిస్తారు.

పెండ్లి బంధం బయట లైంగిక వ్యవహారాలపై బుటి, లోవేడు తెగలలో ఒకే ప్రామాణిక నియమం ఉన్నది. పొండో తెగలో ఆడవాళ్ళు ఇలాంటి లైంగిక వ్యవహారాలను సరైనవే అనుకుంటారు. కానీ, ఈ తెగమగవాళ్ళు ఈ వ్యవహారాలను నీతిలేనివిగా పరిగణిస్తారు. ఇక గాండా తెగలో మగవాడు తన పెండ్లానికి ఇలాంటి వ్యవహారం నిజంగా ఉన్నా, లేదా అతనికి అనుమానం వచ్చినాఆమెను చంపవచ్చును. కానీ, ఈతెగలోని ఆడవారు తమ మొగుళ్ళు చేసే ఇలాంటి వ్యవహారాలను వ్యతిరేకించాలంటే ఆడవారికి ఏ అండాలేదు. తమ పెండ్లాల ప్రేమికులపై కక్ష సాధించుటకు మగవారున్యాయస్థానాలనుపయోగించి తీవ్రమయిన శిక్షలే విధింపచేయవచ్చు. మొత్తానికి, ఇతర సమాజాలకన్నా గాండా తెగ సమాజంలో పెండ్లి బంధం బయట లైంగిక సంబంధాలపై ఎక్కువ ఆంక్షలున్నాయి. ఉన్నత హోదాలో ఉన్న మగవారు రైతాంగ శ్రామిక ఆడవారితో ఇలాంటి సంబంధం కలిగి ఉంటే వారిని పట్టించుకోరు. ఆడ - మగల హోదాలు తలకిందులైతే మాత్రం ఇద్దరినీ చాలా తీవ్రంగా శిక్షిస్తారు. యేహుది కోహెన్ (1969) అను రచయిత చెప్పిన విషయం ఈ పరిస్థితి నుంచే పుట్టుకొచ్చినట్లనిపిస్తుంది. ఆ రచయిత ఇలా అంటారు "వర్గ సమాజాలలో కొన్ని బంధాలు తిరుగుబాట్లకు మంచి పునాదిగా ఉపకరిస్తాయి. లైంగిక సంబంధాలలో ఆంక్షలు ఇలాంటి బంధాలను నాశనం చేసి పెండ్లి బంధాన్ని బలోపేతం చేస్తాయి."

అలుమగల బంధంలో వారి వారి హోదాగానీ, ఒకదానితో ఒకటి దగ్గరి సంబంధం కలిగి ఉంటాయి. అలుమగల మధ్య విడాకుల సౌలభ్యం కూడా వారి వారి సాంఘిక దాంపత్య హోదాల ప్రాముఖ్యతను సూచిస్తుంది. గాండాలలో మగవాళ్ళు పెండ్లి బంధాన్ని పూర్తిగా తెంచివేయాలనుకుంటే తమ భార్యలను పట్టించుకోకపోతే చాలు. కానీ, అదే ఆడవాళ్ళ విషయంలో చాలా కష్టం. వారు తమ మొగుళ్ళతోనేకాక, తమ అన్న, తమ్ముడితో కూడా ఘర్షణ పడవలసి ఉంటుంది. అన్న తమ్ముడు ఒక పాక్షిక సంరక్షకుడు ఆ పెండ్లి బంధాన్ని అలా నిలబెట్టాలనే సాధారణంగా ప్రయత్నిస్తాడు.

రాజకీయాధికారాన్ని చెలాయించాలంటే ఇతరులకు ఆహారాన్నీ, సాంఘికంగా మారకం చేసుకోగల వస్తువులనూ ఇవ్వగలగాలి వారి నుండి తిరిగి పొందగలగాలి. మారకం కోసం సాగే ఉత్పత్తి, స్వంత ఆస్తి అనే ఈ రెండింటితోపాటే నిజమైన అధికారం పెరిగి పెద్దదవుతుందని ఎంగెల్సు సూచిస్తాడు. ఇవి రెండూ లేని అంటే వాడుక కోసం ఉత్పత్తి జరిగే పునాదిపై ఉన్న సమాజాలను తీసుకుందాం. సామాజిక శ్రమలో ఒక వ్యక్తి పాల్గొంటే ఆ వ్యక్తికి ఇతర పౌరులతోపాటు కొన్ని హక్కులు సంక్రమిస్తాయి. రాజకీయ నిర్ణయాలు చేయడంలో తగాదాలను పరిష్కరించడంలో ఇతర పౌరులతోపాటు ఈ వ్యక్తి కూడా చేరే హక్కు సమకూరుతుంది. ఎందుకంటే రాజకీయ నిర్ణయాలు చేయడమూ, తగాదాలను పరిష్కరించడమూ అనే ఈ రెండూ కూడ (ఆదిమ) సమ సమాజాలలోని పౌరుల బాధ్యతలుగా పరిగణించబడతాయి. బుటి, లోవేడు తెగలలో ఆడ, మగ ఇద్దరూ ఆహారాన్ని ఒకరికి ఇస్తారు. తిరిగి పొందుతారు. లోవేడు తెగ ఆడవారు పశువులను మరొకరికి ఇస్తారు. తిరిగి పొందుతారు. ఆ పశువుల ఆసరాతో ఒక పెండ్లామును కూడా పొందవచ్చు. అలా పెండ్లి చేసుకున్న పశువుల యజమాని మొగుడు అనే సాంఘిక హోదాను పొందుతుంది. పొండో తెగ ఆడవారు సామాజిక ఉత్పత్తిదారులయినప్పటికీ వారు తమ అత్యంత ప్రధానమైన మారకపు సరుకును అంటే పశు పక్ష్యాదులను అమ్ముకోలేరు. పొండో తెగలో మారకం కోసం జరిగే ఉత్పత్తి ప్రత్యేక స్వభావమే దీనికి కారణం. దీర్ఘకాలిక స్వల్పకాలిక దశలు రెండింటిలోను గృహపరివారాల అవసరాలకు అనుగుణంగా పని జోడించబడుతుంది. స్వల్పకాలిక దశలో చూస్తే చాలామట్టుకు తెగ పెద్ద పదవీ అవసరాలకు అనుగుణంగా యుద్ధం జోడించబడుతుంది. ఈ తెగ పెద్ద తన వద్ద కొన్ని పశువులను ఉంచుకొని కొంత అనుచర వర్గాన్నిసంపాదించుకొని ఉంటాడు. పోతే, యుద్ధం గృహపరివార అవసరాలతో అంతగా జోడించబడదు. దీర్ఘకాలిక దశలో చూస్తే, పశువులను దాదాపు విస్తృతంగా పంపిణీ చేస్తూ తెగ పెద్దతన అధికారాన్ని నిలుపుకుంటాడు. యుద్ధాలలో గెలుచుకున్న పశువులపై యాజమాన్యం అతనిదే. అయితే ఆ పశువులను ఎత్తుకొచ్చిన దాంట్లో యుద్ధ వీరుల పాత్ర కూడా ఉంది కాబట్టి కాస్త వెనుక ముందుగా ఆ వీరులకే తిరిగి వాటిని పంపిణీ చేస్తాడు. ఈ పశు పక్షి సంపదను పంపిణీ చేయడం చేయకపోవడం తెగ పెద్ద ఇష్టం. ఎందుకంటే ఇవి తెగ పెద్ద స్వంతం. మారకానికి ఉపయోగపడే వాటిలో ఈ సంపద అత్యంత ముఖ్యమైనది. (పెండ్లి కుమార్తెకు కానుకలుగా, అప్పులుగా, విందుల కోసం ఇవి ఉపయోగించబడతాయి). అంతేగాక దీర్ఘకాలిక సంబంధాలను నెలకొల్పడానికి కూడా ఈ సంపద బాగా ఉపయోగపడుతుంది. (పెళ్ళి సంబంధాలూ సేవలూ సంపాదించుకోవచ్చు). పొండో తెగ ఆడవాళ్ళు మారకం కోసం ఉత్పత్తి (పశువులకై దండయాత్రలు)లో పాల్గొనరు కాబట్టి వారు ఈ అధికార సంబంధాలను నెలకొల్పే ఆస్తిని అమ్మడానికి వీలు లేదు. ఈ విధంగా బహిరంగ రాజకీయాధికారం వారి చేతులో లేదు.

లోవేడు తెగ ఆడవారు రాజకీయ అధికారంలో పాలుపంచుకుంటారు. సమాజంలో నిర్ణయాలు తీసుకొనే విభాగాలలో ప్రవేశిస్తారు. వారి వంశ సంబంధమైన పూజా కర్మ కాండలను నిర్వహించడంలో ఆడవారే ఆధిపత్య స్థానంలో ఉంటారు. గాండా తెగలోనేమో రాజకీయ హోదాలనందుకోవడంలో

మగవారికున్న కనీస అవకాశాలు కూడా రైతాంగ ఆడవారికి లేవు. మరోవైపేమో రాజు తల్లి, అక్క, చెల్లెళ్ళలో ఒకరు మాత్రం ముఖ్యమైన అధికార హోదాలలో ఉంటారు. రాజుతో ఉన్న రక్తసంబంధం వల్ల వారు కొంత అధికారాన్ని చలాయిస్తారు.

మొగుడితోపాటు పెండ్లాముకు ఉండే హోదాను నిర్ణయించేది అత్తవారింటి ఆస్తిపై ఆమెకు కూడా యాజమాన్య హక్కులు ఉన్నాయా లేదా అనేది మాత్రమే. లోవేదు, పొండో, గాండా తెగలలో ఉత్పత్తి వనరులు పితృస్వామిక వారసత్వపు పద్ధతిలో తర్వాతి వారికి సంక్రమిస్తాయి. ఇక్కడ ఒక వైరుధ్యం లేదా పరస్పర వ్యతిరేకాంశాలు ఉన్నాయి. ఒకవైపు, ఉత్పత్తి సమాజికంగా లేదా సార్వజన పద్ధతిలో నడిపించబడుతుంది. మరోవైపు, ఉత్పత్తి వనరులను కుటుంబాలో, వ్యక్తులో స్వంతం చేసుకోవడం లేదా వారసత్వంగా పొందడం జరుగుతోంది. అత్తవారింటి వనరులపై యాజమాన్యంలో పెండ్లాముకు ఎలాంటి పాత్ర లేదు. ఈ తెగలలో ఇలా ఉండగా బుటి తెగలో ఈ సంబంధాలు పూర్తి భిన్నంగా ఉన్నాయి. ఇతర తెగ సమాజాలలో మారకం కోసమూ, వారసత్వపు హక్కు కోసమూ స్వంతం చేసుకునే పద్ధతికంటే బుటి తెగలో వాడుక కోసం కుటుంబాలు స్వంతం చేసుకునే పద్ధతి గుణాత్మకంగా భిన్నమైనదిగా నాకు అగుపిస్తుంది. ఒక ప్రదేశంలో ఉండే గుంపు మొత్తం తన వనరులపై సమిష్టి యాజమాన్యం ఉంచుకునే బుటి తెగలో ఉంది. ఆ ప్రదేశంలో నివాసం ఉంటే చాలు ఏ వ్యక్తి అయినా ఆ వనరులను వాడుకోవచ్చు. కానీ వారసత్వపు హక్కు మాత్రం లేదు. ఆ విధంగా, బుటి తెగలో ని భార్యలు, భర్తలూ తమ గుంపు వనరులతో ఒకే రకమైన సంబంధాన్ని కలిగి ఉన్నారు.

లోవేదు, పొండో, గాండా తెగలలో భార్యలు తమ భర్తల కోసమూ మొగుళ్ళ వారసుల కోసమూ చాకిరీ చేస్తారు. కానీ వీరు తమ శ్రమ సృష్టించే సంపదను స్వంతం చేసుకుంటున్న ఆ సమూహానికి చెందిన వారు కారు. భార్యలు వారసులనుకంటారు. పిల్లల్ని పెంచుతారు. మొత్తం ఇంటి చాకిరీనంతా చేస్తారు. ఈ అన్ని పనులూ తమ మొగుని, మొగుని వారసుల అధికార నేతృత్వం క్రింద చేస్తూ పోతారు. బుటి తెగలో ఈ సంబంధమైన విషయం పూర్తి భిన్నంగా ఉంది. బుటి తెగలో జరిగే పెళ్ళి ఆడమనిషి పనిపైగానీ, పిల్లలపైగానీ, ఆమె సాంఘిక కార్యకలాపాపై గానీ ఏలాంటి ఆంక్షలూ విధించదు. ఆమె గర్భధారణా శక్తి ఎవరి స్వంతమూ కాదు. ఎందుకంటే ఆమె పెండ్లి బయట లైంగిక సంబంధాల నుండి ఆమె భర్తకు ఎలాంటి నష్టపరిహారమూ రాదు.

బహిష్టూ, గర్భధారణకు సంబంధించిన ఆంక్షలు లోవేదు, పొండో, గాండా తెగలలో ఎలా ఉన్నాయో చూద్దాం. ఆడవాళ్ళ పునరుత్పత్తి కర్తవ్య నిర్వహణను మారకపు సరుకుల ఉత్పత్తితో ఏ సంబంధం లేకుండా విడదీయడం కోసమే వీరిలో ఈ ఆంక్షలున్నట్టనిపిస్తుంది. ఈ ఆంక్షలు ఉదాహరణకు యుద్ధ వీరులతో, పశువులతో, చేతి పనులలో కొన్ని వైద్య సంబంధ పనులతో సంబంధం లేకుండా వేరు చేస్తారు. ఈ మూడు తెగల సమాజాలలోనూ పిల్లలు ఆస్తికి వారసులవుతారు. వంశాన్ని నిలబెడతారు. ఆడవాళ్ళ ఉత్పాదక కార్యకలాపాల నిర్వహణ మాట ఎలా ఉన్నా, వారి పునరుత్పాదక శక్తి స్వంత ఆస్తి మాత్రమే. కానీ బుటి తెగ పద్ధతులు వేరుగా ఉంటాయి. ఈ తెగ పిల్లలు వ్యక్తిగత వారసులుగా కాదు, సంఘంలో సభ్యులుగా పరిగణించబడతారని ఇదివరకే చెప్పుకున్నాం. పోతే బహిష్టూ, గర్భధారణకు సంబంధించిన ఏ ఆంక్షలు కూడా ఈ తెగలో కనబడవు. ఈ పూర్తి వైవిధ్యం ఒక విషయాన్ని సూచిస్తుంది. బహిష్టూ, గర్భధారణలకు సంబంధించిన ఆంక్షలు స్వంత ఆస్తిపై ఆధారపడి ఉంటాయనీ, ఆ ఆంక్షలు ఒక వైరుధ్యానికి వ్యక్తీకరణ అనీ సూచిస్తుంది. బుటి తెగలో ఈ పద్ధతి పూర్తి భిన్నమైన పద్ధతి అమలు అవుతుంది. ఉమ్మడిగా వేటాడుటకు బయలుదేరిన సందర్భమే లైంగిక కార్యకలాపాలకు ఎంతో అనువైన సమయంగా వారు పరిగణిస్తారు.

చివరికి ఒకే ఒక అంశం మిగిలింది. గాండా తెగ సమాజం వర్గ సమాజం అయినప్పటికీ పరిపాలక కుటుంబాల ఆడవారికీ రైతాంగ కుటుంబాల ఆడవారికీ మధ్యనున్న తేడాల గురించి నేను చర్చించలేదు. రాజు భార్యలకూ, అక్క చెల్లెళ్ళకూ, కుమార్తెలకూ ఎన్నో ప్రత్యేక ప్రయోజనాలు దాఖలు పరచడం జరిగింది. పాలక వర్గాలలోని ప్రతి ఒక్క రకం ఆడవాళ్ళు పాలక వర్గాల మగవాళ్ళతో పాటు కొన్ని ప్రత్యేక ప్రయోజనాలలో భాగం పంచుకుంటారు. రైతాంగంలోని ఆడవారినీ పాలక వర్గాల ఆడవారినీ విభజించే తేడా ఇదే. పాలక వర్గాల ఆడవాళ్ళలో కొందరికి ఉత్పాదక శ్రమ నుండి స్వేచ్ఛ ఉంటుంది. అక్కా చెల్లెళ్ళకూ, కుమార్తెలకూ లైంగిక స్వేచ్ఛ ఉంటుంది. తల్లికీ, సోదరికీ ఆర్థిక రాజకీయ అధికారం ఉంటుంది. ఇవన్నీ ఉన్నప్పటికీ ఈ వర్గం ఆడవాళ్ళలోని ఏ ఒక్కరికి కూడా ఆ వర్గం మగవాళ్ళకు ఉన్న అన్ని అవకాశాలు లేవు. పాలక వర్గాలలోనే ఆడవాళ్ళ విరుద్ధమైన స్థానాన్ని ఈ చిన్నచూపు ప్రతిబింబిస్తుంది. పాలకవర్గ ఆడవాళ్ళు ఉన్నత వర్గానికి చెందినవారైనప్పటికీ ఆడ మగ ప్రాతిపదికన చూసినపుడు క్రింది స్థాయికి చెందిన వారు. వారి గురించిన లోతుపాతుల్లోకి నేనెందుకు వెళ్ళలేదంటే రైతాంగంలోని ఆడవాళ్ళ స్థితిగతులపై ఆధారపడి వేసుకున్న సాధారణ అంచనాలు వీరి (ఈ పాలక వర్గ ఆడవాళ్ళ) ఉనికి వల్ల మారిందేమీ ఉండదు. విక్టోరియా రాణిని ఇంగ్లండులో ఆమె పరిపాలనను జ్ఞప్తికి తెచ్చుకుంటే మనం పైన చెప్పుకున్న విషయం పెద్దగా ఆశ్చర్యం కలిగించదు. పైగా ఉన్నత స్థానాలలో ఉన్న ఎవరో కొందరు ఆడవాళ్ళ స్థితిగతులపై ఆధారపడి సాధారణ అంచనాలు వేసుకునే ధైర్యం అసలే పనికి రాదు.

స్త్రీలకు భార్యలుగా ఉండే హోదాను, సంఘ సభ్యులుగా వారికి ఉండే హోదా నుండి నేను వేరుచేసి చూసినాగానీ, వాస్తవంలో అవి రెండూ ఒకదానితో ఒకటి సంబంధం కలవి. లోవేదు, పొండో తెగల ఆడవారికి భార్యలుగా ఉండే అణకువ, ఒద్దికల

వల్ల తమకు సహజంగా ఉండే సాంఘిక హక్కులను అనుభవించే శక్తి కూడా వారిలో తగ్గిపోతుంది. సాంఘిక కార్యకలాపాల నుండి వారిని ఎంత దూరంగా నిలిపి ఉంచుతారంటే వాళ్ళని తమ మొగుడి లేదా మొగుడి వారసుని అధికారం క్రిందవని చేయిస్తుంటారు. పొండో తెగ ఆడవారి స్థితి కూడా ఇద విధంగా ఉంటుంది. ఈ తెగ ఆడవారు సోదె చెప్పేవారిగా అయ్యే అవకాశం ఉన్నా, నిజానికి సోదె చెప్పే వారిలో చాలామంది ఆడవాళ్ళే అయినా వారు ఆ పని చేయుటకు వారి మొగుళ్ళ అనుమతి కావాల్సి ఉంటుంది.

ఈ ప్రక్రియ మరోవైపు నుండి కూడా పని చేయవచ్చు. ఆడవారికి పౌరులుగా సాంఘిక గుర్తింపు ఉంటే పెండ్లాలుగా వారు క్రింది స్థాయికి నెట్టబడే పరిణామాన్ని ఈ గుర్తింపు ఒక మేరకు పరిమితం చేస్తుంది. ఉదాహరణకు ఒక పొండో తెగ ఆడమనిషి గర్భధారణా శక్తి ఆమె మొగుడి స్వంతం కాగా ఆమెకు ఉండే ఇతర లైంగిక సంబంధాలకు అతడు నష్ట పరిహారం కోరినా ఆ వ్యవహారమంతా మగవాళ్ళు తమ మధ్యనే తేల్చుకోవాలి. స్త్రీలకు ఇలాంటి ఇతర లైంగిక సంబంధాలు సబబుగానే అనిపిస్తాయి. పైగా వారి భర్తల రక్త సంబంధీకులయిన ఆడవారే ఇలాంటి ఇతర సంబంధాలలో సహకరిస్తుంటారు. అన్నింటినీ మించి ఒక ఆడమనిషి తన పెండ్లి బంధాన్ని తెగగొట్టుకోవాలనుకున్నా లేదా తన రక్త సంబంధీకులను కలవాలనుకున్నా ఆమె భర్త ఆమెను ఆపడానికి చేయగలిగింది చాలా తక్కువ.

స్త్రీల స్థితిగతులకు సంబంధించి సంఘంలో పౌరులుగా ఆడవాళ్ళూ, భార్యలుగా ఆడవాళ్ళూ అనే రెండు అంశాలు ఉంటాయని నేను ఇంతకుముందే సూచించాను. ఇవి ఒక మేరకు దేనికది స్వంతంత్రంగా మారవచ్చునని కూడా సూచించాను. తమ మొగుళ్ళతోపాటు ఆడవారి హెూదాను నిర్ణయించే అంశమూ ఆడవాళ్ళు పౌరులేనా, పౌరులే అయితే ఎలా అయ్యారు అనే వాటిని నిర్ణయించే అంశమూ ఒకటి కావు. తమ ఇంటి వ్యవస్థకన్న పెద్దదే లేదా ఇంటి వ్యవస్థ కానిదో అయిన ఒక ఉత్పాదక సమూహంలో భాగంగా ఆడవాళ్ళు పనిచేసే సమాజాలలో వారు ప్రధానంగా పౌరుల హెూదాను కలిగి ఉంటారు. ఏమైనా 'పెండ్లాము' అర్థమూ, హెూదా రెండూ కూడా ఎంగెల్సు చెప్పిన విధంగానే కుటుంబం స్వభావంపైన చాలా మట్టుకు ఆధారపడి ఉంటాయి. ఆస్తిపాస్తులు కుటుంబపరంగా ఉన్న పరిస్థితినే తీసుకుందాం. అలాగే, ఆ కుటుంబంలో భార్య ఆ ఆస్తి పాస్తుల వృద్ధి కోసం పనిచేస్తున్నా వాటిపై ఆమెకు ఏ హక్కులూ లేవనీ అనుకుందాం. అలాంటి చోట్ల ఆమెకూ, ఆమె భర్తకూ ఆమెకూ, ఆ భర్త వారసులకూ మధ్య ఉండే సంబంధం పనిచేసేవారికీ, యజమానికీ మధ్య ఉన్న సంబంధంలాగే ఉంటుంది. స్వంత ఆస్తిలేని చోట లేదా కుటుంబ ఆస్తిపై ఉమ్మడి యాజమాన్యం ఉన్నచోట ఇంటి లోపల సంబంధాలు కూడా సమానత్వ ప్రాతిపదికన ఉంటాయి (అని ఫ్రీడెల్ అనునతను 1967 లో చేసిన ఒక రచనలో అన్నాడు). ఇందులోని చివరి అంశం అతి అంచనా అనిపిస్తుంది. ఎందుకంటే, ఇంటి జీవితమూ, సామాజిక జీవితమూ వాస్తవంలో స్వతంత్రమైనవి కావు. గృహపరివారపు హద్దుల బయట పరిపూర్ణ పౌరులుగా కేవలం మగవారికే గుర్తింపు కొనసాగుతుంటే అమెరికా అనుభవం ఆధారంగా పూర్తి సమానత్వంగల గృహసంబంధాలను ఊహించడం చాలా కష్టం.

## వర్గ సమాజాలలో స్త్రీలు : మరొక వివరణ

బుటి, లోవేడు తెగల నుండి గాండా తెగదాకా వచ్చేసరికి ఆడవారి (సాంఘిక) స్థాయి క్షీణించింది అని పైన సోదాహరణంగా చెప్పుకున్నాం. ఆడవాళ్ళ పని ఇంటి నాలుగు గోడలకు పరిమితమైన మార్పుతోటే మారకానికి ఉత్పత్తి, స్వంత ఆస్తుల పెరుగులతోటే ఈ క్షీణతకు ఏకాకిన సంబంధం ఉందని మనం అంగీకరిస్తే ఒక సమస్య తలెత్తుతుంది. ఇదంతా చెప్పుకుని చివరకు ఎంగెల్సు చెప్పిందే సరైందనే నిర్ధారణకు మనం కూడా మొగ్గుతాం. స్వంత ఆస్తి, మారకానికి ఉత్పత్తి ఈ రెండూ స్త్రీలను ఇంటి నాలుగు గోడలకు పరిమితం చేయడానికి, వారిపై పెత్తనం చేయడానికి దారినిచ్చాయని ఎంగెల్సు కదా అంటాడు. పైవిధంగా అంగీకరిస్తే మనం కూడా అదే నిర్ధారణకు మొగ్గుతాం. చాలామంది మానవ పరిణామ శాస్త్రవేత్తలు దాదాపు ఇలాంటి నిర్ధారణకే వచ్చారు. నామట్టుకు నేను ఒక్క విషయాన్ని మాత్రమే అంగీకరిస్తాను. వర్గ సమాజాలలోకంటే వర్గరహిత సమాజాలలోనే ఆడవాళ్ళ స్థానం మొత్తానికి పురుషులతో సమాన స్థాయిలో ఉంటుందని అంగీకరిస్తాను. కానీ ఆస్తిపై మగవాళ్ళ యాజమాన్యమే వారి ఆధిక్యతకు పునాది అని నేను అనుకోలేక పోతున్నాను. (దీనిని వివరిస్తాను) మొదటిది : స్వంత ఉత్పాదక ఆస్తి మగవాళ్ళందరికీ లేదు. రెండవది మగవాళ్ళ పెత్తనం బలంగా కనబడే వాటితోసహా పలువర్గ సమాజాలలో ఆడ, మగా ఇద్దరికీ స్వంత ఉత్పాదక ఆస్తి ఉన్నది. అంతేకాక పెండ్లానికి ఉన్న స్వంత ఆస్తి వల్ల ఆమె మొగునితోపాటు ఆమెకు కూడా ఇంటి మీద కొంత అధికారం వస్తుంది. (ఫ్రీడెల్ రచన) కానీ, వర్గ సమాజాలతో ఇంటి జీవితానికీ బయటి జీవితానికీ మధ్య ఒక విలక్షణమైన ద్వంద్వం (వైరుధ్యం) ఉంటుంది. అయితే ఇంటిపైగల ఈ అధికారంను ఒక సామాజిక అధికారంగా గానీ, ప్రజా జీవితంలో ఒక హెూదాగా గానీ మార్చుకోలేము. పైగా, వర్గ సమాజాలలో గృహపరివారాల ఆర్థిక రాజకీయ స్వతంత్రతకు చాలా పరిమితులున్నాయి. ఈ విధంగా ప్రజా రంగంలోని అవశ్యకమైన వ్యవహారాల్లో స్త్రీలకు అవకాశాలను నేరుగానే, చాటు మాటుగానే నిరాకరించడం జరుగుతోంది. ఈ అన్యాయం ఇంటిలోపల సమానతకు వ్యతిరేకంగా కూడా చాలా గట్టిగా పనిచేయవచ్చు.

ఇందు నుండి మనకు కనిపించేదేమంటే వర్గ సమాజాలలో ఆడవారి పరాధీనస్థితి ఇంటిలోపలి ఆస్తి సంబంధాల నుండి పుట్టుకొచ్చింది కాదని. తద్భిన్నంగా, గృహపరివారం బయట

ఉన్న మరో కారణం ఏదైతే ఆడవాళ్ళను సంఘంలో పౌరులుగా గుర్తించరో అక్కడి నుండి ఉద్భవించిందని కనిపిస్తుంది. ఇప్పుడొక ప్రశ్న తలెత్తుతుంది. వర్గ సమాజాలలో మగవాళ్ళ సాంఘిక అధికారమూ, మగపెత్తనపు సాంఘిక భావాలు ఎందుకని బలంగా ఉన్నాయి? దీనికి జవాబు చెప్పుకోవాలంటే, మన దృష్టిని ఇంటిమీది నుండి సంఘం మీది మార్చాల్సి ఉంటుంది.

పౌరులుగా సాంఘిక గుర్తింపుకు వస్తు పునాదిగా ఉండేవి సామాజిక లేదా సార్వజన శ్రమ అని మనం ఇంతకు ముందు చెప్పుకున్నాం. ఆడవాళ్ళకు సంఘ పౌరులుగా గుర్తించే హక్కును ఎంతకాలంపాటు నిరోధించాలనుకున్నా ఆడవారిని సార్వజన శ్రమ నుంచి మినహాయించాల్సి ఉంటుందని అనుకోవచ్చు. లేదా ఇలాంటి శ్రమలో ఆడవారి పనితనాన్ని కించపరచవల్సి ఉంటుందని అనుకోవచ్చు. అసలైతే, మొదట ఊహించిన పనే అంటే ఆడవారిని... మినహాయించడమే జరిగి ఉంటుంది. కనీసం యూరోపియాలోని పెట్టుబడిదారీ పూర్వపు అనేక వ్యవసాయిక రాజ్యాలలోనైనా ఇది నిజమై ఉంటుంది. (బోసెరవ్ అనువారు 1970లో చేసిన రచనలో ఈ వివరాలున్నాయి). పారిశ్రామిక పెట్టుబడిదారీ విధానంకు మాత్రం ఈ స్వభావం లేదని స్పష్టంగా కనిపిస్తూనే ఉంది. ప్రస్తుతానికి ఈ సంగతలా వదిలివేద్దాం. ఆడవాళ్ళను సాంఘిక ఉత్పత్తి నుండి మినహాయించడానికి వర్గ సమాజాలను ప్రభావితం చేసిన పరిస్థితులు ఏవి? అనే ప్రశ్నకు సమాధానం చెప్పుకుందాం.

వర్గ సమాజాలకు దోపిడీ స్వభావం ఉంటుంది. అంటే, కొంతమంది ప్రయోజనాల కోసం అనేకమంది పనిచేయాల్సి ఉంటుంది. ఇంటిలో ఉత్పత్తి చేసే సరుకులపై విధించే పన్నులూ, నజరానాలూ ఈ దోపిడీ కర్తవ్యాన్ని నెరవేర్చగలిగినప్పటికీ వ్యవసాయ సమాజాలు ఇలాంటి ఉత్పత్తిపై పూర్తిగాగానీ, ప్రధానంగా గానీ ఆధారపడవు. ప్రజావసరాల కట్టడాలకు జీతం నాతం లేకుండా ఎంతో విలువైన ఉత్పాదకమైన పని చేయించుకోవడం జనాన్ని బలవంతంగా సైన్యంలో చేర్చుకొని మరొక పాలకులతో యుద్ధాలు చేసి కొల్లగొట్టడం పాలకులకు సమిష్టిగా వ్యవసాయ పనిగానీ కూలిపని గానీ ప్రజలచే చేయించడం అనేవి వర్గ సమాజాలలో ప్రాముఖ్యతగల ఉత్పాదక కార్యకలాపాలు. స్థానిక పరిధిలో చూసుకుంటే ఇవేమంత గొప్పగా కనిపించకపోయినా జాతీయంగా (లేదా ఒక రాజ్యం మొత్తంలో) మాత్రం ఇవి చాలా కీలకమైన కార్యకలాపాలు. పాలకులనూ, పాలకుల పాలనా యంత్రాంగాలనూ మేపడానికి అవసరమైన 'అదనపు సంపద'ను సృష్టించేది ఈ కార్యకలాపాలే.

స్త్రీలు ఇంటి దగ్గరి వ్యవసాయ పనుల్లో పాల్గొన్నా పాల్గొనక పోయినా సాంఘిక ఉత్పత్తి జరిగే భారీ రూపాలలో పాల్గొంటున్నట్టు పెద్దగా కనిపించదు. మగవాళ్ళ పనిని సమాజపరం చేయడానికీ, ఆడవాళ్ళ పనిని ఇంటికి పరిమితం చేయడానికీ వర్గ సమాజాలు పూనుకుంటాయని అనిపిస్తుంది. స్త్రీలను పౌరులుగా నిరాకరించడానికి ఈ పరిస్థితి వస్తుపరమైన సంస్థాగతమైన పునాదులను సృష్టిస్తుంది. అంతేకాక, స్త్రీలు మగవారి సంరక్షణలో మాత్రమే ఉండాలి అని ఒక నిర్వచనం చేయడానికి పాలక వర్గాలకు అవకాశమిస్తుంది.

అయితే వర్గ సమాజంలో ఇదంతా ఎందుకు జరుగుతుంది? ఒకానొక పాలక వర్గం కోసం జరిగే సామాజిక ఉత్పత్తి పెరగడంతోపాటే ఇంటిలో జరిగే ఊపిరి నిలబెట్టే ఉత్పత్తి పరిస్థితి మరీ అనిశ్చితంగా తయారవుతుంది. మారకం కోసం సాగే ఉత్పత్తిపై ఎక్కువగా ఆధారపడేటట్టు ప్రజలు బలవంతంగా నెట్టబడతారు. ప్రజలు తమ ఊపిరి నిలబెట్టుకునేందుకు పాలకులకు తమ శ్రమను మారకం చేస్తారు. (లేదా ప్రజలు తమ ఊపిరి నిలబెట్టుకోదలుచుకుంటే తమకు పని చేయవలసి ఉంటుందని పాలకులే బలవంతపెట్టవచ్చు) మగవారిని సామాజిక శ్రామికులుగా ఎంపిక చేసుకొనేవైపు పాలకవర్గాలు మొగ్గుతాయి. ఎందుకంటే, మగవాళ్ళు ఎక్కడికైనా రాగలరూ, పోగలరు వారివైపు మొగ్గడానికి ఇది కొంత కారణం. దీనిని మించిన మరో ముఖ్యమైన కారణమేమంటే ఆడవారికంటే మగవారిని మరీ తీవ్రంగా దోపిడి చేయవచ్చు కాబట్టి పిల్లల్ని సాకీ, పెంచే పని మగవారికి ఉండదు కదా! అందుకని, వారి శక్తి అంతా పాలకుల కోసమే ఎదురు చూస్తూండగలదన్నమాట.

అలిన్ క్లార్క్ అను రచయిత (1968లో తను చేసిన ఒక రచనలో) 17వ శతాబ్దపు ఇంగ్లండు గురించిన కొన్ని వివరాలిస్తాడు. ఈ వివరాలు మనసుని కలిచివేసేలా ఉంటాయి. 17వ శతాబ్దం అంటే పారిశ్రామికీకరణకు ముందు కాలమన్నమాట. ఇంకా చెప్పాలంటే, తదనంతర పారిశ్రామికీకరణకు కావలసిన సాంఘిక పరిస్థితులను నెలకొల్పుతున్న కాలమన్నమాట. ఆ కాలంలో రైతులు భూమి నుండి బేదఖలు చేయబడుతూ వచ్చారు. ఫలితంగా గ్రామీణ భూమిలేని కూలీల వర్గం నానాటికీ విపరీతంగా పెరిగిపోతుండింది. చేసినటువంటి ఏదో ఒక పనికి బదులుగా చెల్లించబడినది అనే అర్థంలో జీత, నాతాలు అనే భావం ఆనాటికింకా పూర్తిగా వ్యవస్థీకృతం కాలేదు. పనిచేసే వారు తమ ఊపిరి నిలబెట్టుకొనుటకు కావలసిన అవసరాలను తీర్చడం యజమాని బాధ్యత అనే భావమే అంతవరకూ ఉంటూ వచ్చింది. ఈ భావాన్ని జీత, నాతాల భావం వ్యతిరేకిస్తుంది. ఏమైనా పనికి దక్కే ప్రతిఫలం చాలా తక్కువగా ఉండేది. భూమిలేని కుటుంబం బ్రతకడం దుస్సాధ్యంగా ఉండేది. ఒక ఆడమనిషిగానీ, లేక మగమనిషి గానీ తోడుగా పిల్లలు లేకుండా ఉంటేనే బ్రతకగలిగారు. ఫలితంగా ఆనాడు పనికి దొరుకుతున్న ప్రతిఫలం శ్రమజీవుల తర్వాతి తరాన్ని కనీ పెంచడానికి అనుమతినివ్వలేదు. ఆ రోజుల్లో శ్రమజీవులు తమను తాము పునరుత్పత్తి చేసుకోలేదనేది పచ్చినిజం. కూలీల వర్గం నానాటికీ పెరగడానికి సర్వం కోల్పోయిన రైతులు ఎప్పటికప్పుడు ఈ వర్గంలో చేరుతూండడమే అసలైన కారణం అని క్లార్క్ తన రచనలో చూపిస్తారు. యజమానులు స్త్రీలనూ, పిల్లలనూ కూలీ పనుల నుండి

పని గట్టుకొని మినహాయించారు. అనుత్పాదక పరాధీనులను ఏదో సహకారం అందించాల్సిన బాధ్యత ఉందని ఈ యజమానులు అనుకున్నాగానీ వారది చేయలేకపోయారు. చేయలేదు. వీటన్నిటి ఫలితాలను మానవత్వపు పదాలలో చెప్పుకోవాలంటే ఆడవాళ్ళను వాళ్ళ కర్మకు వాళ్ళ నొదిలేయడం జరిగింది. అనతి కాలంలోనే అనేకమంది అడవాళ్ళు చచ్చిపోయారు. ఇక సంస్థాగత పదాలలోనేమో అత్యధికంగా మగవాళ్ళున్న సార్వజన శ్రామిక శక్తి మిగిలింది అని చెప్పుకోవచ్చు.

ఆడవాళ్ళను కుటుంబానికి అవసరమైన ఇంటి పనికి పరిమితం కావడం, మగవాళ్ళు మారకం కోసం జరిగే సామాజిక ఉత్పత్తిలో పాల్గొనడం అనే రెండు విభిన్న పద్ధతులు సమాజంలో ఒక ద్వంద్వంను (వైరుధ్యాన్ని) ముందుకు తెస్తాయి. ఈ వైరుధ్యం రావడంతోటే ఆడ మగలను వారి శరీర ధర్మాల ప్రాతిపదికన విభజించి పాలించే విధానానికి కావలసిన సంస్థాగత పునాది కూడా వచ్చినట్టే అవుతంది. ఈలాంటి విభజించి పాలించే విధానం ఏమైనా మేధోశిశువా? కాదా అనేది అప్రస్తుతం. ప్రధానంగా పాలక వర్గాలు రూపొందించిన రాజ్యాంగ న్యాయ వ్యవస్థ భావజాలానికి సంబంధించిన ఇతర అంశాల ప్రభావం ప్రత్యేకమైనది. ఉత్పత్తిలో ఆడా, మగలు నిర్వహించే పాత్రలతో ఉండే తేడాలను తప్పనిసరిగా ఉండవలసిన తేడాలుగా మార్చడానికే పై ప్రభావం పనిచేసింది. తాము చేస్తున్న శ్రమను బట్టి మగవారు సంఘంలో పౌరులయితే స్త్రీలు ఇంటి నాలుగు గోడలకు పరిమితమయ్యే పరాధీనులు.

మగవారు చాలా నేరుగా దోపిడీ చేయబడతారు. ఈ విషయమై ఏదో ఒకటి చేయుటకు ఆ పరిస్థితులే అవకాశాల్ని కల్పిస్తాయి. ఆడవాళ్ళ పని రంగమూ, వారి ప్రధాన బాధ్యతా గృహపరివారికే పరిమితం చేయబడింది. గృహ పరివారం అనే విభాగం ఎప్పుడూ కూడా ఇంటిలో వారు ఊపిరి నిలబెట్టుకునేందుకు అవసరమైన దానిని మించి ఉత్పత్తి చేయదు. అంతకు మించి ఉత్పత్తి చేయగల ఉత్పత్తి సాధనాలూ వాని యాజమాన్యంలో ఉండవు. వర్గ సమాజంలో సామాజిక మార్పును ఆరంభించుటకు ఈ గృహపరివారం అనే సాంఘిక నిర్మాణం స్థాయిలో చేయగలిగింది చాలా తక్కువ. ఈ పరిస్థితి నుండి ఉత్పన్నమయ్యే పర్యవసానాలు చాలా ఉన్నాయి. మొదటిది అందరూ నిత్యం రంధ్రాన్వేషణ చేస్తూ వేలెత్తి చూపే అత్యంత దిగువ స్థాయికి స్త్రీలు నెట్టివేయబడతారు (మగవాడికి తన ఇల్లే ఒక రాజప్రాసాదం). రెండవది సార్వజన రంగం నుండి స్త్రీలు దూరంగా ఉన్నందువల్లా, వారిని ఆ రంగం నుండి మినహాయించి నందువల్లా స్త్రీలు సంకుచిత స్వభావం గల శక్తిగా వాడుకోబడవచ్చు. ఎందుకంటే ఇల్లూ, కుటుంబమూ, పిల్లలూ వగైరాలను సంరక్షించే పనిలో ఉంటూ ఆ పని చుట్టూ పెరిగిన విలువల పట్ల నిబద్ధత పెంచుకున్నందువల్ల స్త్రీలు ఆ యధాతధ స్థితిని తమకు తెలియకుండానే సమున్నతంగా నిలబెట్టే ప్రయత్నం చేయవచ్చు. ఇక చివరిది కుటుంబ సభ్యులను వాడుకోవడానికి (అంటే వారి శక్తియుక్తులను బట్టి తగిన పని చూపించడానికి) పోషించడానికి బాధ్యత తీసుకోవల్సిన ఏకైక సంస్థ విభాగం కుటుంబం మాత్రమే. అంతేకాదు. శ్రమశక్తిని మారకం చేసుకునే భావితరమైన తమ పిల్లల్ని పెంచి పోషించుకోవల్సిన బాధ్యత కూడా కుటుంబానిదే. ఇదంతానేమో పాలకులకే అవసరమైనటువంటి శ్రమ. కానీ, ఈ శ్రమనంతా ఆడవాళ్ళతోనే బలవంతంగా చేయిస్తున్నారు. ఎలాంటి ప్రతిఫలమూ చెల్లించడం లేదు.

స్త్రీలు చేస్తున్న వ్యక్తిగత ఇంటి శ్రమను దోపిడీ చేసే ఈ పద్ధతిని ఆధునిక పెట్టుబడిదారీ విధానం కాపాడింది. అయినా కానీ, పారిశ్రామికీకరణ వల్ల స్త్రీలు కూడా సార్వజన లేదా వేతన శ్రమలో పెద్ద ఎత్తున చేర్చుకోబడినారు. శ్రమభారాన్ని మోసే పనిని పెట్టుబడిదారీ విధానం కుటుంబంపై పెట్టింది. అందువల్ల ఈ పనిని నెరవేర్చడం వాస్తవంలో స్త్రీలు సాంఘిక బాధ్యతగానే ఉంటుంది. ఇంటిపని పూర్తిగా స్త్రీలు బాధ్యత కావడంతో ధనార్జన కోసం పనిచేసే స్త్రీలు ప్రస్తుతం ఎదుర్కొంటున్న ఆటంకాల యొక్క వస్తుగత పునాదులలో పై బాధ్యత కూడా ఒకటి. అంతేకాక సార్వజన శ్రామిక శక్తిలో మగవాళ్ళకంటె ఎక్కువగా దోపిడికి గురి చేయబడే స్థానంలో స్త్రీలు ఉన్న ప్రస్తుత పరిస్థితి వస్తుగత పునాదులలో కూడా ఇదొకటి. ఈ ఇంటి పని నిజమైన పనిగా పరిగణించబడదు అని మార్గరెట్ బెన్‌స్టను అను రచయిత (తమ 1969లో చేసిన ఒక రచనలో) తేటతెల్లం చేస్తారు. ఎందుకంటే (మార్గరెట్‌గారి రచన ప్రకారమే) ఆ శ్రమ ఫలితానికి మారకపు విలువ లేదు. కేవలం వ్యక్తిగత వాడుక విలువ మాత్రమే ఉంది. ఆ శ్రమ సార్వజన శ్రమ కాదు. సార్వజన శ్రమ నుండి మినహాయించబడిన పరిస్థితికి పారిశ్రామికీకరణకు ముందు సమాజం అలవాటు పడి ఉంది. ఆధునిక వేతన శ్రామికుల సైన్యంలో ఆడవాళ్ళు ఎక్కువ దోపిడీకి గురిచేయబడే అవకాశం పై అలవాటునుండే పుట్టుకొచ్చి ఉంటుంది. (గమ్మత్తుగా కనపడేటట్టు చెప్పాలంటే, వేతన పూర్వపు పరిస్థితులో ఆడవాళ్ళను ఎక్కువగా దోపిడీ చేయలేకపోయేవారు కాబట్టి ఈ వేతన పద్ధతి వచ్చిన తర్వాత ఎక్కువగా దోపిడీ చేస్తున్నట్టున్నారు) సార్వజన శ్రమకు ఆడవాళ్ళు సరిపోరు అని పెట్టుబడిదారీ వర్గం ఒక నిర్వచనం చేసింది. పారిశ్రామిక పెట్టుబడిదారీ విధానం స్త్రీలను చవకగా దొరికే శ్రమ వనరుగా కనిపెట్టగల పరిస్థితులు పై నిర్వచనం తర్వాతనే అనుకూలించాయి.

పాతే పెట్టుబడిదారీ సమాజాలకు ముందు స్త్రీలు కూడా సామాజిక ఉత్పత్తిలో పాల్గొన్న సమాజాలున్నాయి. ఒకవైపు దీని అర్ధమేమిటంటే ఆడవాళ్ళను దోపిడీ చేయాలనుకుంటే వారిని ముందుగా (సాంఘిక ఉత్పత్తి నుండి) మినహాయించడం తప్పనిసరి అవసరమేమీ కాదు. లేదా లింగ ప్రాతిపదికన విభజించి పాలించుట కోసమైనా తప్పనిసరి అవసరమేమీ కాదు. ఇక రెండోవైపేమో, సాంఘిక పౌరసత్వానికి సాంఘిక శ్రమయే వస్తుగత పునాది అనే సిద్ధాంతాన్ని పై వాస్తవం మరింత

బలపరుస్తున్నది. సాంఘిక పౌరసత్వానికి ఆడ, మగ సమానత్వం వర్గ సమాజాలలో పర్యాయపదం కాదు అని కూడా పై వాస్తవం సూచిస్తుంది.

పెట్టుబడిదారీ దశకు ముందు భారత దేశంలో ఉన్న కొన్ని రాజ్యాల లోనైనా రాజ్యం క్రింద బానిసలుగా ఉండే ఒక వర్గం అత్యధిక సంఖ్యలో ఉండేది. ఉదా: చోళ సామ్రాజ్యం, విజయనగర సామ్రాజ్యం, కులంగాని కులాల నుండి లేదా అంటరాని కులాల నుండి ఈ వర్గాన్ని రూపొందించడం జరిగింది. ఈ వర్గంలోని ఆడ, మగా అందరూ కూడా మతాధికారులకు, సైన్యాధికారులకూ, ప్రభుత్వాధికారులకూ వ్యవసాయ కూలీలుగా పనిచేశారు. ప్రజావసరాలకు జరిగే కట్టడాలలో వీరి జీతం నాతం లేని వెట్టి చాకిరీ చేయించేవాళ్ళు. మామూలు అలవాటుగానే, ఆడవాళ్ళకు మగ వాళ్ళకంటె తక్కువ కూలీ ఇచ్చేవారు. ఈ విషయం గురించి గఫ్ తన రచనలో ఈ దిగువ పేర్కొన్న మరికొన్ని వివరా లిచ్చినారు. అదే సందర్భంలో అంటరాని వారిలోని కౌలు రైతు కులాల వర్గాల వారిలోనూ, గ్రామ సేవ (పలు వృత్తుల) కులాల/వర్గాల వారిలోనూ స్త్రీల పరిస్థితిని చూద్దాం. ఈ రోజు కూడా గ్రామ సమూహాల కోసం ఒకే విధమైన ఉత్పత్తి సంబంధాలలో ఈ కులాల/వర్గాల మహిళలు పని చేస్తున్నారు. అంతేకాక, ఈ మహిళలకు లైంగిక స్వేచ్ఛా, విడాకుల విషయంలో అధి కారమూ, కుల సమావేశాలలో మాట్లాడే, సాక్ష్యం చెప్పే అధికారమూ, పిల్లలపై అధికారమూ, తమ స్వంత వస్తువులను అమ్ముకోగల శక్తీ, తమపై జరిగిన తప్పుడు పనులకు నష్ట పరిహారం కోరే హక్కూ, తమకున్న తగాదాలను ఇంటి నాలుగు గోడల బయట కూడా పరిష్కారం చేసుకునే హక్కూ, సార్వజన కర్మకాండలలో ప్రాతినిధ్యమూ వగైరా వన్నీ ఎక్కువ మోతాదులోనే ఉన్నాయి. ఈ వాస్తవాల నుండి మనమొక అభిప్రాయానికి రావచ్చు. అదేమంటే కేవలం ఇంటిపనికే పరిమితమైన లేదా ఏ పనీ చేయని స్త్రీలకు తమ వర్గంలోని మగవాళ్ళతోపాటు సామాజిక శ్రమలో పాల్గొనే స్త్రీలకు తమ వర్గంలోని మగవాళ్ళతో పాటు లభించే హోదా ఎంతో ఎక్కువగా ఉంటుంది. సారాంశంలో చెప్పాలంటే, నేను రెండు నమూనాలు సూచిస్తున్నాను. 1. సామాజిక ఉత్పత్తిలో పాలక వర్గాల చేత పాలక వర్గాల కోసమూ సాగుతున్న తీవ్రమైన దోపిడీ ఒక పరిణామానికి అనుకూలించింది. తీవ్రమైన దోపిడీ సాగుతున్న ఆ ఉత్పత్తి రంగంలోని శ్రమనే అంటే సామాజిక శ్రమనే మగవాళ్ళ పనికూడా కావడానికి ఆ దోపిడీ అనుకూలించింది. దానికి తోడు, పాలక వర్గాలు ఈ అవకాశాన్ని సొమ్ము చేసుకున్నారు. ఖచ్చితమైన తేడాలుండే పాలక వర్గాలు ఈ అవకాశాన్ని సొమ్ము చేసుకున్నారు. ఖచ్చితమైన తేడాలుండే సంపూర్ణ వ్యవస్థనే నిర్మించి శ్రమ విభజనలో ఉన్న తేడాలను న్యాయ సమ్మతం చేశారు. మగవాళ్ళు కోల్పోయిన ఆర్థిక స్వాతంత్ర్యానికి పరిహారంగా పాలక వర్గాలు మగవారికి ప్రత్యేకమైన సాంఘిక పౌరసత్వాన్నీ, ఆడవాళ్ళు సంరక్షకుల హోదానీ కలుగజేశారు. ఈలాంటి పరిస్థితులలో ఆడవాళ్ళకు స్వంత ఆస్తి ఉన్నప్పటికీ ప్రయోజనం లేదు. ఎందుకంటే, ఆడవాళ్ళు అలాంటి తమ స్వంత ఆస్తితో ఇంటి బయట చేయగలిగిన దాన్ని పరిమితం చేయడానికి రాజ్యం జోక్యం చేసుకుటుంది. 2. పేదవర్గాల లేదా ఆస్తిలేని వర్గాల ఆడవాళ్ళను రాజ్యాలు సాంఘిక ఉత్పత్తిలో భాగ స్వాములను చేస్తాయి. ఇక్కడ వేతనాలలో తేడాల ఉంటాయి. ఇవి సమానతకు వ్యతిరేకంగా వ్యవస్థీకరించబడిన మరొక రక్షణ కవచం లాంటివి. ఈ ఆడవాళ్ళు తమ వర్గంలోని మగవాళ్ళతో సమానంగా సాంఘిక పౌరులే అయినా ఆర్థిక విధానాలు నిజమైన సమానత సాధ్యం కాకుండా చేస్తాయి. ఆడవాళ్ళ సాంఘిక హోదాకు సంబంధించి, మరీ ప్రత్యేకించి వర్గ సమాజాలలో సాంఘిక పౌరసత్వ మనేది కీలకమైన అంశం. సామాజిక ఉత్పత్తిలో పాల్గొనడం ద్వారానే ఈ పౌరసత్వం అందుబాటులోకి వస్తుంది.

ఆడవాళ్ళకు ఇంట్లోనూ, సంఘంలోనూ ఉన్న హోదా పునాదులను క్లుప్తంగా పరీక్షించాము. ఆడ, మగల మధ్య సంపూర్ణ సమానత్వం సాధించడానికి అవసరమైన ఆర్థిక రాజకీయ మార్పుల గురించి ఇప్పుడు ఉజ్జాయింపుగానూ, తత్కాలికంగానూ, కొన్ని నిర్ధారణలను సూచనప్రాయంగా చేసుకోవచ్చు. ఇంటి లోపల మగనితోపాటు ఆడవాళ్ళకుండే స్థానం విషయంలో ఆస్తిపై యాజమాన్యం అనేదానికి ప్రాముఖ్యత ఉన్నప్పటికీ ఇంటి లోపల తమ అధికారం అమలు కూడా మరీ ప్రత్యేకించి వర్గ సమాజాలలో, సంఘంలో ఆడవాళ్ళకు పౌరులుగా గుర్తింపు ఉన్నదా లేదా అనే దానిచే పరిమితం చేయబడుతుంది. ఇది అంటే సంఘంలో పౌరసత్వమనేది సామాజికోత్పత్తిలో వారి పాత్రద్వారా నిర్ణయించబతుంది. కానీ, కుటుంబము సమాజమనే ద్వంద్వం (వైరుధ్యం) సృష్టించబడింది. వర్గ సమాజాలలో ఇది మరీ బలంగా కనబడుతుంది. ఈ వైరుధ్యం ఆడా, మగలకు వేరు వేరు బాధ్యతలను నిర్దేశిస్తుంది. ఆడవారిని వ్యక్తిగత వాడుక (వినిమయ) విలువల ఉత్పత్తికి బాధ్యులను చేస్తూ, మగవారినేమో మారకపు విలువల ఉత్పత్తికి బాధ్యులను చేస్తుంది. వాడుక ఉత్పత్తీ మారకపు ఉత్పత్తుల మధ్యగల తేడా ఆడవాళ్ళ మీద బరువైన బాధ్యతలను మోపుతుంది. తమకు తావేం కాక శ్రమను మారకం చేసుకుంటున్న కార్మికులకు కూడా కావల్సిన ఏర్పాట్లను చూడవలసి వస్తుంది. ఇంకా, స్త్రీలు శ్రమను అమ్ముకునే సపర్యలు చేసే భవిష్యత్తు కార్మికులను కూడా పెంచి పోషించవలసి ఉంది. ఈ పరిస్థితులలో స్త్రీలకు వేతన శ్రమ (లేదా సామాజిక శ్రమ) అదనపు భారమే అవుతంది. ఇంటిపనిలో ఆడవాళ్ళ బాధ్యతను ఏ విధంగానూ ఈ వేతన శ్రమ మార్చదు. సంపూర్ణమైన సమానత్వం సాధించబడాలంటే ఆడవాళ్ళుగానీ, మగవాళ్ళుగానీ ఒకే విధమైన పనిచేయాలి. ఒక విధమైన పని అంటే, సామాజిక వాడుక విలువను ఉత్పత్తి చేసే పని అర్థం. ఇది సాధ్యం కావాలంటే కుటుంబం సమాజం రెండు వేరు వేరు ఆర్థిక జీవన రంగాలుగాఇక ఏ మాత్రం ఉండకూడదు. ఉత్పత్తీ, వాడుకా, పిల్లల పోషణా, ఆర్థిక విష యాల మీద నిర్ణయాలూ, మొదలగు నటువంటివన్నీ కూడా ఒకే ఒక సామాజిక రంగంలో జరగాలి. ఆ సామాజిక రంగం ఎంగెల్సు వివరించినటువంటి ఇరాక్వా తెగనైనా పోలి ఉండవచ్చు. లేదా చైనాలో గొప్ప ముందంజ కాలంనాటి ఉత్పత్తి దళాలనైనా పోలి ఉండవచ్చు. స్త్రీలు సంఘంలో సంపూర్ణమైన పౌరులుగా గుర్తించబడాలంటే ఈనాడు వ్యక్తిగత కుటుంబ పనిగా ఉన్న ప్రతిదీ సార్వజన పని కావాలి.

# సతి – అంబేద్కర్ విశ్లేషణ

భారతదేశంలో స్త్రీల పరిస్థితి ఎలాంటిది అనే ప్రశ్నకు జవాబు చెప్పటం చాలా కష్టం. ఎందుకంటే వర్గ వర్ణ తార తమ్యాలను బట్టి ఆయా వర్గాల స్త్రీల స్థాయి కూడా మారుతూ ఉంటుంది. వాస్తవం చెప్పదలచుకుంటే సమాజం స్త్రీ పట్ల గౌరవం చూపుతున్నట్లే నటిస్తూ ఆచరణలో ఆమెను అమర్యాదగా చూస్తున్నదని ఒప్పుకోవాలి.

స్త్రీ గృహదేవత అనీ ఆమెను పూజించాలనీ ఆమె కంట కన్నీరొలికితే శుభం కాదనీ చెప్పారు. స్త్రీ ప్రవృతి చాలా చంచలమైనదనీ ఆమెను స్వతంత్రంగా ఎప్పుడూ వదలకూడదని. ఏదశలోనైనా తండ్రీ, భర్త, సోదరుడు, కుమారుడు ఎవరైనా ఆమెను అదుపు చేస్తూ ఉండాలనీ కూడ వారే చెప్పారు. ఈ విధంగా ద్వంద్వ ప్రమాణాలతో స్త్రీని చూడటం భారతదేశంలో కనిపిస్తున్నది.

ఆదిమ సమాజాలలోనా వేదాలకు పూర్వపు కాలంలోనూ మాతృస్వామ్య వ్యవస్థ ఉండేదని శాస్త్ర వేత్తలు చెప్తున్నారు. ప్రకృతిని తల్లిగా భావించి పూజించటం అందులోంచే మొదలైంది. శక్త్యారాధనకు మూలం మాతృభావన. తల్లి ఏవిధంగా తమనూ కుటుంబాన్నీ రక్షిస్తూ నిర్వహిస్తూ ఉంటుందో అదే విధంగా ప్రకృతి తమను కాపాడాలని మానవులు కోరుకున్నారు. ప్రముఖంగా కనిపించే శక్తులను తల్లులుగా కొలిచారు. అమ్మదేవతల భావన ఇలాగే వ్యాప్తిలోకి వచ్చింది. ఈనాటి దుర్గా పూజలు దేవీపుజలు ఆ భావనతో వచ్చినవే. సృష్టికి మూలం ఆదిశక్తి అనీ ఆమె ఆజ్ఞచేతనే త్రిమూర్తులు, సృష్టి, స్థితి లయకారులై తమ తమ విధుల నిర్వహిస్తున్నారనీ ప్రచారం జరగడం కూడా ఈ కారణంగానే. మొదట్లో ఇంత ప్రముఖంగా ఉన్న స్త్రీల స్థానం ఎందుకు ఇంత దిగజారిపోయిందీ అంటే దానికి ఎన్నో సామాజిక రాజకీయ భౌగోళిక కారణాలున్నాయి. మాతృస్వామ్య వ్యవస్థ (కుటుంబానికి గాని ఆ గుంపుకు గాని స్త్రీ నాయకత్వం వహించే పద్ధతి) అంతరించి పోతూ పితృస్వామ్య వ్యవస్థ చోటు చేసుకుంటూ వచ్చిన క్రమంలో స్త్రీ స్థాయి తగ్గుతూ వచ్చింది. స్త్రీ కుటుంబ యజమానిగా ఉండే పద్ధతి పోయి పురుషుడు కుటుంబ యజమానిగా ఉండే పద్ధతి రావటం వారసత్వపు హక్కు మగ పిల్లలకే ఎక్కువగా రావటం వంటివన్నీ సమాజంలో స్త్రీల పరిస్థితి మారటానికి కారణమయ్యాయని అనుకోవచ్చు.

పురుషాధిక్య సమాజం కావటం వల్ల సమాజ ధర్మాలన్నీ పురుషులకు లాభించేటట్టుగానే ఏర్పడ్డాయి. సతి, బాలికా వివాహం లాంటి దురాచారాలు సమాజంలో ఏర్పడటానికి కారణం పురుషాధిక్య సమాజమనే అనుకున్నా అందుకు దారితీసిన పరిస్థితులు డా.బి.ఆర్.అంబేద్కర్ చెప్పిన ప్రకారం చాలా ఆసిక్తకరంగా ఉన్నాయి. డా. అంబేద్కర్ గొప్పమానవతావాది. సత్యశీలి. మేధావి. అపారమైన పాండిత్యంతో సమస్య లోతును తరచి చూసి పరిష్కారం చూపగల దిట్ట.

సతి, బాలికా వివాహం అనేదురాచారలకు, అంబేద్కర్ ప్రకారం ఒక్క మాటలో చెప్పాలంటే కారణం కులాల ఏర్పాటు. కులాల ఏర్పాటు భారతదేశ సమైక్యతకు ఎంతో హాని కలిగించిందని ఆయన చెప్పాడు. ఆ హానిని అంచనా వెయ్యలేము, అదీ ఇదీ అని చెప్పలేము. మొత్తం వ్యవస్థ నంతటినీ అది, వేరు పురుగులాగా సమూలంగా నాశనం చేస్తూ ఉన్నది. ముఖ్యంగా స్త్రీలనూ నికృష్టమైన స్థితికి దిగజార్చినవి కుల కట్టు బాట్లే - అవే స్త్రీ ప్రతిపత్తికి శాపంగా పరిణమించాయి. ఆస్తి లాగనే స్త్రీని కూడా సొంత వస్తువుగా చూసే పద్ధతి మొదలైంది. ఆమెను ఇతరుల నుంచి రక్షించు కోవటం - పరుల కంట పడకుండా చూడటం కట్టుదిట్టాలలో ఉంచటం మొదలయ్యాయి. ఎంత సేపూ పతివ్రతల కథలు చదివిస్తూ ఇంటికీ కుటుంబానికి పరిమితంచేసి ఆమెకు సమాజిక జీవనం లేకుండా చేస్తూ వచ్చారు.

అంబేద్కర్ అభిప్రాయం ప్రకారం సమజంలో బాహ్య వివాహాల పద్ధతి వదిలిపెట్టి అంతర్వివాహాల పద్ధతి అనుసరించడం ఎప్పుడైతే మొదలయిందో అప్పుడే వివాహ వ్యవస్థ క్లిష్టమై స్త్రీ నిషేధాలకు లోనయింది.

ఒక గుంపు గాని బృందం గాని తమలోపలి వారితో కాకుండా బయటి వారితో వివాహ సంబంధాలు పెట్టుకునే పద్ధతి ఒకప్పుడు ఉండేది. అది బాహ్య వివాహ పద్ధతి. కాశీమజిలీ కథల్లోనూ పేదరాసి పెద్దమ్మ కథల్లోనూ రాకుమార్తెల స్వయంవర గాధలు ప్రముఖంగా ఉంటూ ఉంటాయి. ఒక్కోసారి స్వయంవరాలకు కొన్ని కొన్ని షరతులు కూడా ఉండడం కనిపిస్తుంది. ఆ షరతులు తీరితే ఎవరైనా రాకుమారిని వివాహం చేసుకోవచ్చు. తమ వారిలోనే అని కాక చుట్టు ప్రక్కల రాజ్యాలనుంచి కూడా అర్హులైన పెళ్ళి కుమారులు అలాంటి స్వయం వరాలకు వస్తుండే వారు. వీటిలో కుల ప్రసక్తి లదు. ఇవి బాహ్య వివాహాలు. నిజానికి మొదట్లో ఇలాంటి బాహ్య వివాహాలే నియమంగా ఉండేవి. అంతర్వివాహాలు నిషిద్ధంగా ఉండేవి.

కాల క్రమంలో కొన్ని గుంపులు తమకు తాము ప్రత్యేకత చూపుకోవటానికి బాహ్య వివాహాలు వద్దనుకుని అంతర్వివాహాలు ప్రోత్సహించాయి. తమ గుంపులోనే దగ్గర దగ్గరగా నివసించే తమ సన్నిహిత కుటుంబాలలోనే పెళ్ళిళ్ళు చేసుకోవాలని నియమం పెట్టుకున్నాయి. అదిచాలక ఆ నియమాన్ని మరీ కఠినంగా అనుసరించేందుకు కొన్ని దండనలు: శిక్షలు కూడా పెట్టాయి. ఇదంతా తమ ప్రత్యేకత చాటుకోవటానికే, వివాహాలతో సరిపెట్టకుండా సహపంక్తి భోజనాలు మరికొన్ని ఇతర ఆచారాలూ తమలో తామే జరుపుకోవాలనీ గుంపు వెలుపలి వారిని కలుపుకోకూడదనీ నిర్ణయించుకున్నారు. ఈ రకంగా ఏర్పడిన ప్రత్యేక బృందాలు కులాలుగా రూపొందాయి. మొదట ఒక గుంపు ఇలా ప్రత్యేకంగా తనకు తాను దడి కట్టుకోవటం వల్ల

దడి బయట వారు తాము కూడా బల వంతంగా ఒక గుంపుగా ఈ రకమైన వ్యవహారంలో నియమం తప్పిన వారిని వెలి వేస్తూ గుంపు నుంచి బహిష్కరిస్తూ వచ్చారు.

ఇలా బహిష్కరణకు లోనైన వారు మళ్ళీ ఒక కులంగా ఏర్పడవలసి వచ్చింది. ఈ విధంగా ఒక వర్గం ఒక వర్గం, తమకు ఆధిక్యతను ఆపాదించుకోవటానికి చేసిన ప్రయత్నంలో కులాలు ఏర్పడ్డాయని డా॥ అంబేద్కర్ చెప్పారు. భారత దేశంలో కులాలు, పుట్టుక, వాటి విస్తరణ" అనే అంశాలను ఆయన తన పరిశోధనా పత్రంలో ఎంతో జాగ్రత్తగా విశ్లేషించారు.

ఆయన అభిప్రాయం ప్రకారం ఒక గుంపు మొదట ఈ పద్ధతికి పునాది వేసి ఉంటుంది. ఇలా ఒక గుంపు ప్రత్యేకంగా తయారైన తర్వాత వారు గుంపులోనే వివాహాలు జరుపుకోవలసి వచ్చేది. గుంపు బయటి వారితో వివాహ సంబంధాలు పెట్టుకోకూడదు. అలా పెట్టుకోకుండా ఉండాలంటే గుంపులోపల పెళ్ళి వయస్సు వచ్చిన స్త్రీలు, పురుషులు సమాన సంఖ్యలో ఉండాలి. ఏ ఒక్కరికైనా తగిన జంట దొరకక పోతే వారు గుంపు బయట వారిని పెళ్ళి చేసుకుని గుంపు నియమాలను ఉల్లంఘించే ప్రమాదం ఏర్పడుతుంది. అందుకని గుంపు పెద్దలు వివాహ వయస్కులను సమాన సంఖ్యలో ఉంచేట్టు జాగ్రత్త పడేవారు. మామూలుగా ప్రకృతిలోనే స్త్రీ పురుష జనాభా కొంచెం ఇంచుమించుగా సరి నిష్పత్తిలోనే ఉంటుంది. ఇప్పటి జనాభా లెక్కలు చూసినా స్త్రీ పురుష శాతం మరీ అంత తేడాగా ఉండనట్లు తెలుసు కోవచ్చు

వివాహాలు గుంపు లోపలనే జరిగే విధంగా ఏర్పాటు చేయటంలో బాలికా వివాహాలు వ్యాప్తిలోకి వచ్చాయి. ఒక పురుషునికి తగిన వధువును చూపే ప్రయత్నంలో యుక్త వయస్సు గల ఆడపిల్లలు లేనప్పుడు కొంచం చిన్న పిల్లలను కూడా ఇచ్చి వివాహం చేసే వారు. ఆడ పిల్లలు ఎక్కువైతే పురిట్లోనే చంపేయటమూ ఉండేది. పెద్దలు ఎంత జాగ్రత్త పడినా కొన్ని ఉత్పాతాల వల్లనే వ్యాధులవల్లనే భార్యా భర్తలలో ఒకరు మరణించినప్పుడు మిగిలి ఉన్న రెండో వారికి జంటను చూపవలసిన అవసరాలు తరచు ఏర్పడతుండేవి. వయస్సులో ఉన్న భార్యగాని భర్తగాని చనిపోయినప్పుడు రెండోవారు గుంపుకు సమస్యగా ఉండేవారు. వారిని అలా వదిలి వేస్తే. వారు గుంపులో నీతి నియమాలకు ప్రమాదకరం కావచ్చు. లేకపోతే గుంపు బయట వివాహం చేసుకొని గుంపు నియమాలను అతిక్రమించవచ్చు. అంచేత ఏదో విధంగా ఆ మిగులు స్త్రీ పురుషుల సమస్యను పరిష్కరించవలసి వచ్చేది. మొదట్లో ఎలా ఉండేదో గాని కొన్నాళ్ళకు ఆ 'మిగులుస్త్రీ'ని చనిపోయిన భర్త చితిమీద పెట్టి కాల్చేయటం ఉత్తమ పరిష్కారంగా తోచింది. కొందరికి ఆడపిల్లలను పురిట్లోనే చంపేయటమూ 'సతి పేరిట'. భర్త చితిమీదపెట్టి కాల్చేయటమూ ఇలా ఆచారాలుగా రూపొందాయి. సతి అమలులో కొన్ని ఇబ్బందులు వచ్చాయి. కొన్ని కొన్నికారణాల వల్ల భార్య గర్భవతిగా ఉన్నప్పుడు, రాజ్యం ఆస్తి ఆమె నిర్వహించవలసి ఉన్నప్పుడో, వారసులను సంరక్షించవలసిన బాధ్యత ఉన్నప్పుడు ఇలాంటి ఇతర పరిస్థితులలోనే 'సతి' చేయించటం సాధ్యమయ్యేది కాదు. కొందరు స్త్రీలు దీనికి వ్యతిరేకించిన వారు ఉన్నారు. మొత్తానికి 'సతి' కులవ్యవస్థ కారణంగానే వ్యాప్తిలోకి వచ్చిన దురాచారమని అంబేద్కర్ నిరూపించారు. 'మిగులు'స్త్రీని భర్తతో పాటు కాల్చి వేసినట్టు " మిగులు పురుషుణ్ణి" భార్య చితిమీద పెట్టి కాల్చేవారు కారు. ఎందుకంటే శాసనం చేసేది పురుషులే కాబట్టి పురుషుల అవసరం సమాజానికి చాలా ఉన్నదనీ యుద్ధాలలో పురుష యోధులు చాలా అవసరమనీ చెప్పి వారికావిధమైన ఆచారాలు పెట్టలేదు. పురుష శిశువులను చంపనూ లేదు. భార్య చనిపోయిన పురుషులకు సరైన జోడీ దొరక్కపోతే చిన్న వయస్సు బాలికలను ఇచ్చి పెళ్ళి చేసేవారు. వయసులో పెద్ద వాడైన ఆ పురుషుడు మరణిస్తే ఆ బాలికను అతనితో పాటు కాల్చేసే వారు. సమస్య పరిష్కారమై పోయేది. ఆమెను బతకనిస్తే చెడు నడవడికతో గుంపు నియమాలను భగ్నం చేస్తుందేమో అని బతకనిచ్చే వారు కాదు. ప్రత్యేక పరిస్థితులలో బతకనిస్తే అన్ని విధాలా కురూపిని చేసి ఇతరులను ఆమె ఆకర్షించ కుండా జాగ్రత్త పడేవారు

ఇది అంబేద్కర్ విశ్లేషణ. ఆయన దీన్ని చాలా యుక్తియుక్తంగా చెప్పాడు. ఆయన వివరణలలో స్త్రీ విముక్తికి ఎంతో ఉపకరించే విషయాలు చాలా ఉన్నాయి. వాటిని ప్రత్యేకంగా అధ్యయనం చేయవలసి ఉంది.

కులాల ఏర్పాటు. తక్కిన కులాల నుంచి తమ ప్రత్యేకతను చాటుకోవటానికి కొన్ని ఆచారాలు ఏర్పాటు చేసుకోవటం వాటిని ఆదర్శంగా చూపటానికి ప్రయత్నించటం ఇవన్నీ ప్రధానంగా స్త్రీలను దుర్దశలో పడవేశాయి. ఇలాంటి దుష్ట సంప్రదాయాలు, మూఖ్యంగా, తమను ఆదర్శంగా ప్రకటించుకోటానికి ప్రయత్నించిన కులాలలోనే ఉండటం గమనించ వచ్చు

అంబేద్కర్ చెప్పినట్టుగా మానవులలో ఉన్న 'అనుకరణ తత్వం' ఈ ఆచారాలను తదితర కులాలు కూడా గ్రహించేటట్టు చేసింది. ఆయన విశ్లేషణ చూస్తుంటే 'కులం' సహస్ర పురాణాలలో సమాజాన్ని కాటువేసినట్టు స్పష్టంగా తెలుస్తుంది.

పై ఆచారాలను స్త్రీల మీద బలవంతంగా రుద్దిన పెద్దలు వీటికి అలౌకికతను అంటగట్టి వంతం రంగుపులిమి రకరకాలుగా ప్రచారం చేశారు. ముందుగా స్త్రీ ధర్మాలు - స్త్రీ తెల్లవారి లేచింది మొదలు నిద్రపోయే వరకూ ఎవరెవరికి ఎలా సేవలు చెయ్యాలి. పురుషులను ఎలా సేవించాలి అన్నవి చెప్పారు. పురుషుని ఆధిక్యతను చాటి చెప్పారు. స్త్రీకి భర్త దైవం అన్నారు. పతివ్రత ఎలా ఉండాలో చెప్పారు. వరులకంట పడకూడదన్నారు. పతివ్రతలకు సూర్య గమనాన్ని కూడా నిరోధించే శక్తి ఉంటుందన్నారు. దేవతలు పతివ్రతలకు జడుస్తారని చెప్పారు. 'సతి' చేసిన స్త్రీ గురించి ఎంతగా ప్రచారం చేశారంటే అవి ఊహాతీతంగా ఉన్నాయి. 'సతి' చేసి భర్త చితిమీద ప్రాణాలు విడిచిన భార్యకు శ్రీదేవి సాన్నిధ్యం

దొరుకుతుందనీ ఆమెను దేవి తన ఒడిలో ఉంచుకొని లాలిస్తుందనీ రాశారు. తెలుగులో 'రుక్మాంగద చరిత్ర'లో స్వర్గ నరకాల గురించి పాప పుణ్యాల గురించి ఏయే పనులకు ఏయే శిక్షలు ఉంటాయో చెప్తూ, సతి గురించి బ్రహ్మాండంగా రాశారు.

సతి చేసిన స్త్రీలకు గుడులు కట్టించి పూజించటం మన సమాజంలో ఉంది. నిత్య జీవితంలో ఆదరణ కరువైన స్త్రీలు చనిపోయినాకనైనా దేవి దగ్గర, అంటే తల్లి ఒడిలో సుఖంగా ఉండాలనుకోవటంలో ఆశ్చర్యం లేదు. అందుకే అలాంటి ప్రచారాలు చేసి వారిని వశపరచుకున్నారు. సుమంగళిగా చావటం కోసం వ్రతాలు భర్త అయుస్సు కోసం పూజలు ఇవన్నీ సరేసరి. చిన్నప్పుడెప్పుడో ఒకటి రెండేళ్ళు తల్లి ఒడిలో పొందిన ప్రేమానురాగాలను ఎరగా పెట్టి స్త్రీల చేత ఇన్ని దారుణాలు చేయించింది సమాజం, ఇవన్నీ కేవలం సామాజిక కట్టుబాట్లు చెడకుండా ఉండటం కోసమే. ఈ కథలన్నీ నమ్మారంటే ఆడపిల్లలుతల్లి ఆలనపాలనా కోసం ఎంత అర్రులు చాస్తున్నారో మనం ఊహించు కోవచ్చు

యజ్ఞం చేసి సోమయాజులైన వారికి ఇతర కారణాల వల్ల స్వర్గలోకం చేరిన వారికే పురుషులకు, రంభా ఊర్వశి వంటి అప్సరసల ఆలింగన సౌఖ్యాలూ, స్త్రీలకు దేవి చెంత నివాసమును. ఎందుకైనా మంచిదని 'భర్తతో స్వర్గలోకంలో సుఖంగా ఉంటుంది' అని కూడా ఒక మాట చేర్చారు. పతివ్రతల విషయంలో.

ఈ విధంగా ఈ సామాజిక నియమాల ప్రచారంలో ధర్మశాస్త్రాలు పురాణాలు, శృతులు, స్మృతులు, కావ్యాలు అన్నీ పాలు పంచుకున్నాయి. అవి ఏర్పడినదే అందుకు. సాంఘిక నియమాలకు మతాన్ని జత చేసి ప్రచారం చేసినందువల్లనే ఆ దుష్టాచారాలు జనులలో ఇంతగా పాతుకు పోయాయి. ఆ ప్రచారం చేయటంలోని లక్ష్యమే అది. లక్ష్య సాధనకు మతాన్ని ఎంచుకోవటంలోని వారి బుద్ధి సూక్ష్మత అభినందించవలసినదే. అందుకే 'శాస్త్రాల పట్ల వాటి పవిత్రత పట్ల ప్రజలకు గల నమ్మకాన్ని తొలగించండి' అని డా. అంబేద్కర్ ఉద్బోధించారు. స్త్రీలను కొన్ని ఆచారాలకు నియమాలకు కట్టి పడవేసిన సాహిత్యంలో రామాయణ మహాభారతాలు గొప్ప పాత్రవహించాయి.

రామాయం మహాభారతాలలోని మూలకథ ప్రపంచ వ్యాప్తమైనది. నిజానికి ఏదో ఒక రూపంలో ఆ కథలు అన్ని దేశాలలోనూ ఉన్నాయి. అవి జానపద కథలు. ఆ కథలు అలా కొన్ని వందల సంవత్సరాలు పాటలుగా కథలుగా ప్రచారంలో ఉన్న తర్వాత ఎవరో ఒకరు వాటిని రాసి పెట్టారు. అచ్చు యంత్రాలు లేని కాలంలో ఒక ప్రతిని (కాపీ) చూసి ఆసక్తి ఉన్నవారెవరో రాసుకునేవారు. రాసుకోవటంలో అసలు దాంట్లోంచి కొన్ని వదలివేయటమో, కొన్ని పొరబాటుగా రాసుకోవటమో, కొన్ని తమ స్వంత కల్పనలు, వ్యాఖ్యానాలు జతచేయటమో జరిగేది. ఇలా నాలుగైదు ప్రతులు రాసుకొని రెండు మూడు తరాలు జరిగే వరకు మూలకథలూ బాగా మారిపోయేవి. సమకాలీన సమాజానికి ఆదర్శంగా ఉండటం కోసం ఆ కథలలో మరి కొన్ని మార్పులు చేసేవారు. అవి రామాయణంలో ఉన్నాయనీ భారతంలో చెప్పారని నమ్మించి ప్రచారం చేసేవారు. పురాణాలు చదివి సామాన్య ప్రజలకు చెప్తూ ఉండే వారి చేతిలో వారి స్వార్ధ ప్రయోజనాల కోసం ఈ కథలు ఎన్నో మార్పులు పొందాయి. ఎంతో విస్తరించాయి కూడా.

అష్టాదశ, పురాణాలు', రకరకాల శాస్త్రాలు, ధర్మశాస్త్రాలు అన్నీ ఇదే ధ్యేయంతో వెలవడ్డాయి. మూఢ నమ్మకాలు ప్రజలలో ప్రచారం చేసి వారిని ఒక వర్గానికి దాసులుగా చేసినవి శాస్త్రాలే. మూఢ నమ్మకాలను తొలగించాలంటే ముందుగా ఈ శాస్త్రాలను ప్రశ్నించాలి. శాస్త్రాలపై వారికి గల నమ్మకాన్ని తొలగించాలి అప్పుడే వారిని మార్చటం సాధ్యమవుతుంది. అన్నాడు అంబేద్కర్. 'శాస్త్రాలు భోధిస్తున్న అక్రమ దుష్ట భావాలను వారి మనస్సుల నుంచి తుడిచి పెట్టండి. శాస్త్రాలను నిరాకరించటం ఒక్కటే చాలదు వాటి అధికారాన్ని తిరస్కరించాలి....'' అని చెప్పాడు అంబేద్కర్.

'సతి' గురించిన గొప్ప తనాన్ని మతంతో ముడిపెట్టి ప్రచారం చేయటంలోని అంతర్యం, పతివ్రతగా ఒక పురుషుని వస్తువుగా ఉండి పోవటాన్ని అంబేద్కర్ చెప్పిన ప్రకారం పరిశీలించవలసిన అవసరం ఉంది. అయితే మను ధర్మ శాస్త్ర కారుడు చాలా దూరదృష్టి కలవాడు. శ్రుతులను స్మృతులను పురాణాలను ప్రశ్నించకూడదనీ వాటి నిర్దేశాలకు కట్టుబడి ఉండవలసిందేననీ శాసించాడు.

శాస్త్రాలను ప్రశ్నించకూడదనీ తర్కించకూడదనీ మహాభారతం చెప్తున్నది.

మానవులను శాసించే కార్యక్రమంలో రకరకాల పురాణాలు, స్మృతులు పుట్టుకొచ్చాయి. ఒక్కోసారి రెండు పురాణాలు, రెండు ధర్మ శాస్త్రాలు ఒకే విషయం మీద పరస్పర భిన్నంగా సెలవిచ్చిన సందర్భాలూ ఏర్పడ్డాయి. అందుకు పరిష్కారంగా ఏం చెప్పాడంటే రెండు స్మృతుల మధ్య ఘర్షణ ఏర్పడితే మనుస్మృతిని అనుసరించాలన్నారు. (బృహస్పతి) అంతేగాని ప్రశ్నించకూడదు. ప్రశ్నించే హక్కు హిందువుకు లేదు. ప్రశ్నిస్తే శిక్ష సంఘ బహిష్కారం. కులాలన్నీ ఎవరికి వారు దడికట్టుకుని ఉన్న సమాజంలో సంఘ బహిష్కారం కంటె భయంకరం మరోటి లేదు. అంచేత ఎవరూ ప్రశ్నించే వారు కాదు.

ఈ నాటికీ సమాజంలో శాస్త్రాలకు ప్రశ్నించరాదనే నియమం ఉంది. 'అలా అంటే కళ్ళు పోతాయి' అని పెద్దలు మందలించటం తరచుగా వింటుంటాం రామాయణం విషయంలో ఇంకా ఉధృతంగా ప్రచారం చేస్తూనే ఉన్నది. రామాయణం చిత్రించిన ప్రకారం 'సీత' భారతీయులకు ఆదర్శ మహిళ స్త్రీ జాతికి మేలు బంతి. ముల్లోకాలనూ జయించిన మహా ప్రతాపశాలి రావాణుని కూడా ఈమె తన పాతివ్రత్య తేజస్సుతో దహించివేయగల సాధ్వి అట. అంచేతనే రామాయణాన్ని సీతాచరిత్రగా ప్రచారం చేస్తున్నారట.

కావ్యం రామాయణం కృత్స్నం సీతాయాశ్చరితం పౌలస్త్య వధ మిత్యేవ

చకార చరిత వ్రత మహత్
(బాల కాండ 7-4)

భర్తకు అత్తమామలకు విధేయు రాలుగా అరణ్యాలకైనా భర్తను అను సరించి పోయే ఇల్లాలుగా సీతను తీర్చిదిద్దారు. రామాయణంలో అడు గడుగునా పాతివ్రత్య ధర్మాలు నింపారు. సీత అగ్ని పరీక్షకు తట్టుకునేలా చేశారు. రసవత్తరంగా బోలెడన్ని కల్పనలు చేశారు. ఇంటింటి పారాయణ గ్రంథంగా రామాయణాన్ని ప్రచారం చేయటంలో కృతకృత్యులయ్యారు. ఆంధ్రదేశంలోనే కాదు ఏ రాష్ట్రంలో ఎక్కడ చూసినా సీతారాముల వనవాస కథలు-ప్రదేశాలు కనిపిస్తాయి.

మహాభారత గాథ కూడా అంతే. భిన్న కాలాలలోని రకరకాల సమాజాల కథలు అందులో ఉన్నాయి. వాటిలో పరస్పర విరుద్ధ ధర్మాలు కూడా చేరాయి. దాని నిండానూ పతివ్రతా ధర్మాలు గుప్పించారు. కుంతి ద్రౌపదికి చెప్పినవి రుక్మిణికి ద్రౌపది చెప్పినవి - మహర్షుల భార్యల చరిత్రలు - ఇలా రకరకాలుగా స్త్రీ ధర్మాలను ప్రచారం చేశారు. వీటితో బాటు కుల వ్యవస్థను బలపరుస్తూ వర్ణాశ్రమ ధర్మాల రక్షణయే రాజు కర్తవ్యం అన్నదానిని కూడా చెప్పారు. వ్యాసుడు - తదితర మహర్షులు రాజులకు బోధించే పరమ దర్మాలలో వర్ణాశ్రమ ధర్మరక్షణ అతి ముఖ్యమైనది. స్త్రీకి విధించిన కట్టుబాట్లు, రాజుల కర్తవ్యమూ పరస్పర సంబంధం కలవి కాబట్టి వీటిని ప్రచారం చేసే ధ్యేయంతోనే మొత్తం సాహిత్య మంతా నింపారు. వీటితో బాటే మారొకటి ఉంటూ వచ్చింది. అది గోబ్రాహ్మణ హితం. నిజంగానే ఇవన్నీ సమాజానికి విధిగా కర్తవ్యాలైనప్పుడో వీటిని పనిగట్టుకుని అంతగా ప్రచారం చేయ వలసిన అవసరం ఎందుకు వచ్చింది? ఎందుకంటే ఇవి మధ్యలో వచ్చినవి గనక. వీటిని తమ స్వార్థ ప్రయోజనాల కోసం లోకంలో ప్రతిష్ఠించవలసిన అవసరం వారికి ఉన్నది గనక. అంచేతనే ఈ మూఢాచారాలను తర్కించవలసిన అవసరం నేటి సమాజానికి ఏర్పడింది.

పూర్వం స్త్రీకి చదువు అక్కర లేదనే వారు. అంతగా అయితే చాకలి పద్దులు చూడటం వస్తే చాలుననే వారు. అంటే పురుషులకు ఎంత అవసరమో అంతవరకే స్త్రీలు కార్యభారం వహించా లన్నమాట. ఇప్పుడు అమ్మాయి ఉద్యోగం చేయాలంటున్నారు. ఆర్థిక బాధ్యత వహించాలంటున్నారు. కట్నం కూడా తేవాలంటున్నారు. ఇది సమాజంలో స్పష్టంగా కనిపిస్తున్న వైఖరి. తమకు అనుగుణంగా స్త్రీల సేవలు పొందటమే వారి లక్ష్యం. ఇలాంటి దృక్పథాన్నే ఇతర ఆచారాలకు మతపరంగా ప్రచారం లోకి తెచ్చిన ఆచారాలకు వర్తించి సమాజాన్ని పరిశీలించటం ఆధునిక స్త్రీ నేర్చుకోవాలి.

పూర్వం మాతృస్వామ్య వ్యవస్థ ఉండేదనటానికి భారతంలోనే కొన్ని ఆధారాలున్నాయి. స్త్రీ రాజ్యాలు కొన్ని ఉన్నట్లు ధర్మరాజు చేసిన రాజసూయ యాగ సందర్భంగా అర్జునుడు అలాంటి రాజ్యాలు చూసినట్లు చెప్పారు. పుత్ర సంతతి కోరకుండా కూతురుకు పుట్టిన వానికే రాజ్యాధికారం ఇచ్చే సంప్రదాయం కూడా కొన్ని రాజ్యాలలో ఉండేదనటానికి చిత్రాంగదా వృత్తాంతం ఉదాహరణ.

బాల్యా వివాహాలు. మొదట్లో ఆచారంగా ఉండేవని చెప్పటానికి ద్రౌపదీ స్వయంవరం, దమయంతీ స్వయంవరం వంటివి చెప్పుకోవచ్చు. ఇలా పరిశీలించు కుంటూ పోతే ఆ గనుల పాతరలలోంచి ఎన్నో విశేషాలు బయల్పడతాయి.

'సతి' అనేది మొదట్లో లేదు. బహు భార్యాత్వం బహు భర్తృత్వం ఉండేది. ఇంటికి వచ్చిన కోడలిని కులవధువుగా గౌరవించేవారు. భర్త మరణిస్తే ఆమె భర్త సోదరునితో జీవించవచ్చు. ఈ మేరకు ఋగ్వేదంలో ఆధారాలున్నాయి. భర్త చనిపోతే ఆ మృత శరీరంతో బాటు భార్యను కూడా స్మశానం వరకు తీసుకు వెళ్ళి భర్త పక్కన పరుండబెట్టేవారు. భర్తసోదరుడే, మరొకరో వెళ్ళి "ఓ స్త్రీ లేచిరా.. అతను విగత జీవుడయ్యాడు. నీకు అతనితో పనిలేదుఆమెను తీసుకు వచ్చేవారు. ఈ విధమైన ఆచారం వల్ల "సతి" అనేది మొదట్లో లేదని స్పష్టపడుతుంది.

రామాయణంలో వానరులలో స్త్రీలు భర్త సోదరునితో కలిసి ఉండటం అనే సంప్రదాయం ఉంది. అయితే తర్వాత కాలంలో భర్తతో పాటు చితిని ఎక్కటం అనేది ప్రచారమయ్యాక భర్తతో పాటు మరణించటం అనే భావనను రామా యణంలో చొప్పించారు రామాయణంలో ఉన్నదని చెబితే అంతా మారు మాట్లాడకుండా ఒప్పుకుంటారు గనుక అలా చేశారు.

వాలి చనిపోయినప్పుడు తార తానూ భర్తతో పాటు చనిపోతానని అంటుంది (కిష్కింధ, 21-16) తారా విలాపం చాలా సుదీర్ఘంగా వర్ణించారు. వాలితో పాటు నన్నూ చంపి నా భర్త దగ్గరకు పంపు అని రామునితో అంటుంది (కిష్కింధ 24-38). అప్పుడు రాముడు ఇలా అంటాడు - "వాలిని విడిచి ఉండలేననే బుద్ధి వదలి పెట్టు సుఖ దుఃఖాలన్ని బ్రహ్మ సృష్టించాడు." అని (కిష్కింధ 24-42) వాలి భార్య తార, సుగ్రీవుని భార్య రుమ ఇద్దరూ సంప్రదాయం ప్రకారం భర్త సోదరులతో ఉన్నట్లు రామాయణం చెబుతోంది. పాతివ్రత్యాన్ని భర్త మీద ప్రేమనూ చాటటానికై పై ఘట్టాన్ని సుదీర్ఘంగా వర్ణించి ప్రాయోపవేశ ప్రసక్తి తెచ్చి సూచించి వదిలేశారని అనుకోవాలి.

దశరథునికి ముగ్గురు రాణులు అని ప్రచారంలో ఉంది. వారు కాక అతనికి 350 మంది అంతఃపుర స్త్రీలున్నారట. వారు భార్యలుగానే పరిగణనకు వచ్చారు. శ్రీరాముడు భార్యా సమేతంగా అరణ్యాలకు వెళ్ళేటప్పుడు దశరథుడు భార్య లందరితోనూ కలిసి అతనికి వీడ్కోలు పలికాడు. (అయో. 34-10-13) 'అర్థ సప్తశతా'ని చెప్పారు వారి సంఖ్యను.

శ్రీరాముడు ఏకపత్నీ వ్రతుడని ప్రచారం చేశారు. అయితే ఆయనకు ఇంకా భార్యలున్నారని పత్రికలలో చాలా యేళ్ళ క్రితం వ్యాసాలు వచ్చాయి. సీతను ఆదర్శంగా చూపుతున్నారు గనక ఆమె భర్తకు మరీ ఎక్కువమంది భార్యాలున్నట్టు చెప్పటం బాగుండదని రాముణ్ణి ఏకపత్నీ వ్రతునిగా చెప్పి ఉంటారు.

సీతను రావణుడు ఎత్తుకు వెళ్ళిపోయాక రాముడు ఆమె కోసం విలపించిన ధోరణి శృంగార పరంగానే తప్ప మానవత్వపు ఛాయలతో లేదు. ఆమె లేకుండా భోజనం సహించటం

లేదనే బాధ - అంటే వంట రుచిగా అమరటం లేదనీ ఇతర కోరికలు తీరటం లేదనీ రాముడు ఎక్కువ బాధ పడ్డాడు.

సీతను రావణుడు ఎత్తుకు వెళ్ళక మునుపు సీతా రామలక్ష్మణులు అరణ్యంలో విహరిస్తుండగా 'విరాధుడు' అనే రాక్షసుడు సీతను పట్టుకుని చంకలో పెట్టుకుని తీనుకుపోబోయాడు. విరాధునితో పోరాడడం రామునికి కష్టమైంది. విరాధుని చంకలో సీతను చూసి కోపం మరింత ఎక్కువైంది. లక్ష్మణునితో తన బాధ వ్యక్తం చేస్తూ "... నాభార్య రాక్షసుని చంకలో ఉండటం చూశావా... కైకేయి కోరిక ఈ నాడు తీరింది... సీతను పరపురుషుడు ముట్టుకోవటం వల్ల నాకు కలిగిన దుఃఖం తండ్రి మరణం వల్లనూ రాజ్య భ్రంశం వల్లనూ కూడ కలగలేదు." (అరణ్య 2-18-21) అన్నాడు. స్త్రీ ఎంత ఉత్తము రాలైనా ఆమె అంతరంగం లెక్కలోకి రాదు. భౌతిక శరీరమే లెక్కలోకి వస్తుంది. రాముడు విరాధునితో "ఉత్తమమైన స్త్రీని అపేక్షించే హీనమైన ప్రయోజనం గల నిన్ను ధిక్కరించాలి" అని అంటాడు. ఇక్కడ కులాల సమస్య అన్యాపదేశంగా ఉంది. పై కులాల వారు తక్కువ కులాల స్త్రీలను అపేక్షించవచ్చు - సమాజం ఒప్పుకుంటుంది. తక్కువ కులానికి చెందిన పురుషుడు పై కులాల స్త్రీలను కోరకూడదు. అది తప్పు. ఇలాంటి ఉదాహరణల వల్ల రామాయణ మహా భారతాలు ఇతర కావ్యాలు, పురాణాలు అన్నీ స్త్రీ ప్రవర్తనను నియంత్రించటానికీ తద్వారా సమాజంలో చతుర్వర్ణాలను ప్రతిష్ఠించటానికీ చాలా కృషి చేశాయని చెప్పవచ్చు. మహాభారతం, హరిశ్చంద్రోపాఖ్యానం, నలచరిత్ర వంటి వాని ద్వారా స్త్రీలను జూదంలో ఒడిపోవటానికీ, వారిని ఆస్తిలాగా అమ్మివేయటానికీ కూడా పురుషునికి అన్ని హక్కులూ ఉన్నాయని ప్రతిపాదించారు. భర్తను అనుసరించటం ఇల్లాలు కర్తవ్యం. అడవులకు కూడా అనుసరించి వెళ్ళి అతనికి సౌకర్యాలు అమరిస్తే ఆమె మహా పతివ్రత. ద్రౌపది, సీత, సావిత్రి, దమయంతి ఇలా అరణ్యాలకు భర్తను అనుసరించి వెళ్ళి మహాపతివ్రత లయ్యారు. మునుల భార్యలు అరుంధతి అనసూయ ఎప్పుడూ అడవుల్లోనే ఉంటారు కాబట్టి వారి పాతివ్రత్యమూ పేరు పొందింది.

పతివ్రతా ధర్మాలను గురించి చెబుతూ "...కుల శీలములు గోరి బ్రతుకు పతివ్రతా రత్నంబులకును, బతిలేని రాజ్య సంపదలవియేల, పతిలేని సుతులేల బంధువులేల సతిలేని హితులేల ప్రాణంబులేల.." అని పతియచూడైవ మెబ్బంగుల సతికి" అనీ పదే పదే నూరిపోశారు. (హరిశ్చంద్రోపాఖ్యానం - గౌరన) పతివ్రతకు యముడైనా భయ పడతాడన్నారు.

"రా చంద్రమతి పతివ్రతవౌదు దునీవు, నీ చరిత్రంబు వర్ణింప నచ్చెరువు, సుదతి నీ మంగళ సూత్రంబు గాదె, పదివేల బాముల బాపె నీ పతికి -" అని దీవించడమే కాక చాల కాలం రాజ్యం పాలించి "ఒద్దిక వచ్చి మా యొద్దనే" ఉండండని శివపార్వతులు వారితో అన్నట్టు హరిశ్చంద్రోపాఖ్యానం కథ.

భర్త తనను అమ్మి వేసినా సరే భార్య ఊరుకోవాలన్న నీతినే కాక దాంతో పాటు మరెన్నో ఛాందస భావాలనూ ఈ పురాణాలు బోధిస్తున్నాయి.

ఈ మర్మాలు తెలియని పాశ్చాత్య పండితులు భారతీయ సాహిత్యంలోని స్త్రీ పాత్రలలో కనబడే స్త్రీత్వ ఛాయలు ప్రపంచ సాహిత్యంలోనే విలక్షణమైనవని అన్నారంటే ఆశ్చర్యమేముంది?

డా. అంబేద్కర్ ఉద్బోధించినట్టుగా ఈ సంప్రదాయాల సంకెళ్ళ నుంచి బయట పడి ప్రతి స్త్రీ ప్రతి పురుషుడు శాస్త్రాల దాస్యం నుంచి విముక్తుడైనప్పుడే సమాజ పురోగతి సాధ్యమవుతుంది.

—డా॥ వి. విజయభారతి

## నలుపు పాఠకులకు, ఏజెంట్లకు విజ్ఞప్తి

నలుపు గత మూడు సంవత్సరాల నుండి ఆర్థికంగా ఎన్నో ఇబ్బందులను ఎదుర్కొంటూ పోటీ ప్రపంచంలో నిలదొక్కుకోవడానికి అన్ని రకాలుగా సహకరించి, కాపాడుకున్న మా నలుపు పాఠకులకు, ఏజెంట్లకు హైదరాబాద్ బుక్ ట్రస్ట్ వారు హార్దికాభివందనములు తెలుపుతున్నారు. పక్షం పక్షం పుంజుకొని నలుపు ప్రజలలో నిలిచిపోయిందంటే మీ ఆదరాభిమానమే దానికి కారణం. అదే మాకు కొండంత బలం నిచ్చింది. కాని గత మూడు సం॥లుగా న్యూస్ ప్రింట్, కంపోజింగ్ ప్రింటింగ్ చార్జీలు విపరీతంగా పెరిగిన విషయం అందరికీ తెలిసిందే. ఇటువంటి పరిస్థితిలో ఆర్థిక ఇబ్బందిని కొద్ది మాత్రం తట్టుకోవడానికైనా 'నలుపు' రేటు పెంచక తప్పడం లేదు. 1992 మే నెల నుండి నలుపు విడి ప్రతి వెల 4-00 రూపాయలు ఉంటుందని, సంవత్సరం చందా 85-00 రూపాయలు ఉంటుందని తెలియజేస్తున్నాం. సహృదయంతో పాఠకులు, ఏజెంట్లు ఈ విషయాన్ని అర్థం చేసుకొని 'నలుపు'తో సహకరించాలని కోరుతున్నాం.

— వి. సుదర్శన్ రెడ్డి
సర్క్యులేషన్ మేనేజర్

# స్త్రీ విముక్తి - జనం పాటలు

"పరమేశ్వరుడు తన శరీరంలో సగం పార్వతికిచ్చి స్త్రీ మహోన్నతమైన స్థానాన్ని నిరూపించాడు" అని సాంప్రదాయిక వాదులు చెప్పుకున్నా, ప్రస్తుత సమాజంలో స్త్రీమూర్తి ఏ గౌరవ స్థానంలో వుందో, పురుషాధిక్య సమాజంలో ఎలా స్త్రీ అవశేషాల గుర్తులు మిగిలిపోయాయో ప్రస్తుత సమాజమే అందుకు నిదర్శనం.

ఈ ఆకాశంలో 'సగం నీవు, సగం నేను' అని చైనా విముక్తి ప్రదాత, పీడిత ప్రజల నాయకుడు మావో సమాజంలో స్త్రీకున్న స్థానాన్ని ప్రపంచానికి చాటాడు. స్త్రీని మార్క్సిస్టు దృక్పథంతో ఆలోచించినప్పుడు మాత్రమే స్త్రీకి సరి అయిన న్యాయం కలుగుతుంది తప్ప ప్రపంచంలోని వివిధ ఫెమినిస్టులు చెబుతున్న దృక్కోణం నుంచి చూస్తే స్త్రీకి సరి అయిన న్యాయం జరుగదు. (అయితే తాత్కాలికంగా సమస్యలపై స్పందిస్తూ జరుపుతున్న ఫెమినిస్టు ఉద్యమాల్ని తప్పుపట్టడం లేదిక్కడ) మన దేశంలో మనువు విధించిన మనుధర్మ శాస్త్రాన్ని మన ఇండియన్ సివిల్ కోడే దాటలేని పరిస్థితి వుంటే ఇంకా ఈ దేశంలో స్త్రీ సమస్యలు హిమాలయ పర్వతాల కంటే ఎత్తైనవనే చెప్పాలి. ఇప్పుడు యావత్ పెట్టుబడి దారీ ప్రపంచం స్త్రీలచుట్టు కొలతల అందాల పోటీల్లో పోటీ పడుతూ వుంది. వివిధ రకాల అందమైన ప్రకటనల మత్తుల్లో స్త్రీమూర్తి తల్లడిల్లుతూ వుంది. అందుకు మన దేశంలో వున్న స్త్రీలను మినహాయించాల్సిన అవసరమేమి లేదు. అలాంటి భావాల్ని అర్ధనగ్న అంగాంగ ప్రదర్శనల్ని, క్యాబరే డ్యాన్సర్లనీ, క్లబ్ డాన్సర్లు, సినిమాల్లో వెర్రితలలు వేస్తున్న విశృంఖల సెక్స్, క్రైమ్, వ్యభిచారం, పాతివ్రత్య పెనుభూతం ఇంకా పీల్చి పిప్పి చేస్తూనే వుంది భారత స్త్రీని. పిండం రూపంలో ఆడకూతురు వుందన్నా ఎబార్షన్ చేయించేటంతటి గొప్ప భావం స్త్రీమీద ఈ సమాజానికుంది. స్త్రీ స్త్రీగా ఎక్కడ నిలిచింది, ఎక్కడ మిగిలింది, ఆనాడు సతి మంటల్లో, ఈనాడు పతిబాధల అవమానాల వంటల్లో చితుల్లో రగులుతూనే వుంది మన పవిత్ర మహిళ. ఎక్కడ స్త్రీని స్వేచ్ఛగా మసలనివ్వకుండా వుంచారో అని మనం ప్రపంచాన్ని, భూగోళం తిరగేసి వెతుక్కోవలసిన అవసరం లేదు. మన సుందర ముద నష్టమైన మన మనుధర్మ విషశాస్త్రాల పుట్టల నుండి పుటలను తిరగేస్తే కనిపిస్తుంది. ప్రస్తుత వ్యవస్థలోని పురుషాధిక్యపు మంటల సమిధల్లో నిత్యం స్త్రీ రగులుకుంటూనే వుంటుంది. టూకీగా చెప్పుకుంటూపోతే ప్రభుత్వ లెక్కల ప్రకారమే దేశవ్యాపితంగా స్త్రీలపై జరిగిన అత్యాచారాల ప్రణాళికా చిట్టాలు కనిపిస్తూనే వుంటుంది. ఇది మన ఆటవిక ఆధునిక సమాజానికి గుర్తుగా చెప్పుకోవచ్చును.

ఈ వ్యవస్థను పూర్తిగా అంచనా వేసిన ఈ ప్రజా విప్లవ సాంస్కృతిక సంస్థలు స్త్రీని చెప్పడంలో, వాళ్లను మేల్కొల్పడంలో, వాళ్ల డప్పుల మీద మ్రోగిన మ్రోగుతున్న పాటలు చాలా విలువైనవి వచ్చాయని చెప్పవచ్చును.

"కొంగు నడుముకు చుట్టవే చెల్లెమ్మా
కొడవళ్ళు చేపట్టవే చెల్లెమ్మా"

అన్న పాటలో గ్రామాల్లో స్త్రీకి జరిగే అన్యాయాలను విశ్లేషించడం జరిగింది.

"పనిపాప లేడ్చిన పాలియ్య నియ్యరు
నడుము లెత్తకుండ నాట్లేయ మంటాడు
ఉరిమురిమి చూస్తాడు ఊరి దొరగాడు
పొద్దంత పనిచేసినా చెల్లెమ్మా
పస్తురోజులు తప్పవే చెల్లెమ్మా"

ఇంకా ఏడుస్తున్న పిల్లవాడికి పాలియ్యనివ్వకుండా పనిచేయించే దొరతనాలు వున్నాయా అని ప్రశ్న ఉద్భవిస్తుంది. అంటే దానికి సమాధానంగా రొమ్ము పిండి ఉగ్గ గిన్నెలో పోస్తే నీ బిడ్డకిస్తాను అన్న నిజాం కాలంనాటి దొరల అహంకారం తెలంగాణా ప్రజలు చవి చూసిందే. అట్లే కవి ఆ విషయాన్ని దృష్టియందుంచుకొని పొలాల గట్లమీద తిరుగుతున్న యజమాని నడుము ఎలెత్తనీయకుండా పనిచేయించడం ఇప్పటికీ వుందిగా. అలాగే పగలంతా రెక్కలు ముక్కలు చేసుకున్నా తిన డానికి తిండి గింజలు కరువన్నది పచ్చి యధార్థం. ఇప్పటికీ స్త్రీలు అలా నడుము వంచి పనిచేయబట్టే నాట్లు పడుతున్నాయి. పంటలు పండుతున్నాయి అన్న భావాన్ని స్ఫురింపచేస్తారు ఈ పాటలో. అట్లాగే

కడుపు నిండ తిండి కట్టుబట్ట లేక
మంచి నీళ్ళతోని కడుపు నింపుకొని
కుంచిపేల్కలు కట్టికూలి చెయ్యబోతే
చినిగిన బట్టల్లో చూసి నీ అందాన్ని
బలిసిన దొరకొడుకులే చెల్లెమ్మా
బతుకు బండలు చేసిరా చెల్లెమ్మా

పై రెండు వాక్యాలు దారిద్ర్యానికి గుర్తులు. కుంచి-పేల్కలు కట్టి కూలి చెయ్యబోతే చినిగిన బట్టల్లో చూసి నీ అందాన్ని అంటే దొరలు, భూస్వాములు, ధనవంతులు స్త్రీల శరీరాలతో యిష్టము వచ్చినట్లు పని చేయించుకోవడమే కాదు. వాళ్ల శరీరాన్ని అడ్డు అదుపులేని కావానికి వాడుకోవడం కూడా గమనంలోకి తీసుకోవడం జరిగింది. పాటలో వర్ణన ఏ రూపంలోనయినా ఉండవచ్చు. కాని ఇప్పటికీ డబ్బున్న వాడు స్త్రీని యధేచ్ఛగా అనుభవిస్తున్నాడు. వాళ్లకున్న దరిద్రమనే బలహీనతే స్త్రీల మానానికి రక్షణ లేకుండా చేస్తూ వుంది. ఇలా ఎన్ని జీవితాలు దొరలు చెరిచారు అని ఉదాహరణలో చెప్పవలసిన అవసరం లేకున్నా యిలాంటి ఘాతుకాలు మాత్రం జరిగాయి అన్నది ఆ పాటలోని ప్రతి పాదాల్లో ప్రతిధ్వనిస్తూ వుంది. అదే పాటలో

పుస్తెమట్టెలు పెట్టి పసుపు పారాణితో
కాళ్ళు చేతులకేమో సంకెళ్ళు వేశారు
నీతి మాటలతోటి నోరుకుట్టేశారు.

వంట యింటి జైలులో చెల్లెమ్మా
నిన్ను ఖైదీని చేసిరా చెల్లెమ్మా

పై వాక్యాల్లో మన వివాహ వ్యవస్థ ప్రతివతా లక్షణాలు, వంట ఇంటి కుందేలుగా వున్న పరిస్థితిని సహజంగ్గా చెప్పడం జరిగింది. ఈ విషయాలు చెబుతూనే

ఆలుమగలు కలిసి సినిమా చూడబోతే
రక్షక భటులంటూ భక్షక భటులొచ్చి
కాకి బట్టలోల్లు కనికరం లేనోళ్లు
నీ భర్తను చంపిరా చెల్లెమ్మా
నీ మానమును చెరిచిరా చెల్లెమ్మా

ఇది గ్రామాల నుంచి పోయిన జంటకైనా, పట్నాలనుంచి వెళుతున్న జంటకయినా పోలీసు స్టేషన్‌లలో జరిగిన విషయాల్నే చెప్పారు. సినిమాకు భార్యాభర్తలు వెడితే ఆ ఇద్దరిని అనుమానం మీద అరెస్టు చేసి భార్యభర్తలని చెబుతున్నా, సాక్ష్యం చూపుతున్నా వినకుండా ప్రవర్తిస్తున్న పోలీసుల నడవడికను కవి అద్భుతంగా వర్ణించాడు. అంటే ఆడది అర్థరాత్రి ఒంటరిగాదు. భర్తతో కూడా తిరిగే పరిస్థితికి నోచుకోని దౌర్భాగ్య పరిస్థితికి నెట్టబడ్డ దుస్థితికి చక్కటి వర్ణన. ఇలా జరిగిన సంఘటనలు దినపత్రికల్లో చాలా చదివి వుంటాం. అందుకే అదే పాటలో

పోలీసు స్టేషన్లేమోనరక కూపాలాయే
కండ్లుకానని దొరలు కామందు పోలీసు
నీ మానప్రాణాలనే చెల్లెమ్మా
దేవి మంటల గలిపిరా చెల్లెమ్మా
బతుకు తెరువుకని బలుసాకు తినుకుంటూ
పచ్చని నీ బతుకు పచ్చనోట్లకు కట్టి
మనసు సంపుకొని మానమమ్ముకొని
నిరివల్లె చెల్లెమ్మా చిచ్చు నీ బతుకయ్యే
అందమయిన బ్రతుకులే చెల్లెమ్మా
అంగట్లో సరుకాయనే చెల్లెమ్మా

ముఖ్యంగా స్త్రీ మాన ప్రాణాలకు ఎక్కడ రక్షణ ఉండాలో అక్కడే విచ్చలవిడితనం కన్పిస్తుంది. తినడానికి తిండిలేక అందమైన శరీరాలను అంగట్లో అమ్ముకొనే హీనమైన పరిస్థితి స్త్రీకి ఏర్పడింది. పచ్చనోట్లకు తమ శరీరాల్ని వెచ్చించి మనసు చంపుకొని, తమ శరీరాల్ని పంచుతూ జీవిస్తున్న జీవచ్ఛవాల యధార్థ దయనీయ గాథ వర్ణన యిది.

మరి ఇలాంటి బ్రతుకు, ఇలాంటి జీవితం, కళ్ళెదుటే కనిపించే సంఘటనలు వీటన్నింటిని వివరిస్తూ ప్రజా కళాకారుడు పాట పాడుతాడు. గొంతు విప్పి విషయాలను దండోరా వేస్తాడు. మరి ఇలాంటి దయనీయమైన స్థితిని విన్నవించడంతోటే ఈ పాట ముగియదు. విప్లవించమని చురకత్తిలాంటి పదునైన పదాలను పాడుతాడు.

దొరల కామానికి దోపిడయ్యేకన్నా
రక్కసుల చేతుల్లో చిక్కి చచ్చేకన్నా
బాంచ బతుకుల తోటి బూడిదయ్యేకన్న
పోరుబాటలోన రాలిపోయిన మేలే

ఓ! స్త్రీ ఈనాడు నువ్వు అనుభవిస్తున్న స్వేచ్ఛలేని, దోపిడీకి గురయ్యే ఈ జీవితానికి, పురుష అహంకారపు జ్వాలల్లో మసై పోయేకన్న పోరాట మార్గంలో పోరాడి మరణించడం ఉన్నతమైనదని అలాగే దొరలు ఉన్నంతకాలం, దోపిడీ వున్నంత కాలం మగవాళ్ల పెత్తనపు సంకెళ్లు వున్నంతకాలం నీకు విముక్తి లేదు. అందుకే "బంధనాలను తెంచుకో చెల్లెమ్మా - బందూకునే అందుకో చెల్లెమ్మా" అంటూ పోరాటానికి ఆహ్వానించడం కనిపిస్తుంది.

నానాటికి పెరుగుతున్న వరకట్నపు చావులు దానికి పరిష్కార మార్గాలు ఏమిటని? ప్రభుత్వం చట్టాలు చేస్తేనే, రకరకాల ఫెమినిస్టు సంఘాల విశ్లేషణల వల్లనే ఈ సమస్యకు శాశ్వత పరిష్కారం దొరకదు. పైపై విషయాలు వెతుక్కుంటూపోతే లాభం లేదు. అసలు పునాదులు ఎక్కడున్నాయో వాటిని పెకలించాలి. అందువల్ల వ్యవస్థ సమగ్ర స్వరూపాన్ని విశ్లేషించాలి. దాన్ని కవి ఎవరో కాని కట్నపు హత్యల మీద చాలా విలువైన సమాచారాన్ని యిచ్చేనొక పాటను రాసాడు. ఆ పాట మొత్తాన్ని విశ్లేషించి చూడవలసిన అవసరం కూడా లేదు. మొదటి పల్లవిలోనే అంటాడు.

కర్మభూమిలో పూచిన ఓ పువ్వా
విరిసీ విరియని ఓ చిరునవ్వా
కన్నుల ఆశలు నీరైకారగ
కట్నపు జ్వాలలో సమిధై పోయావా?

మనది ఏ భూమి? కర్మభూమి, వేదాలు వెలసిల్లిన భూమికదా. అందుకే ఇలాంటి ఈ పవిత్ర భూమిలో విరిసి విరియని ఓ చిరునవ్వా అన్న విషయం తెలుస్తూనే వుంది. స్త్రీ ఆశలు కన్నీటి ప్రవాహంలో కలిసిపోగా, ఆమె కట్నపు జ్వాలల్లో సమిధగా మాడిపోయింది. మొదటి ఈ చరణాలే ఆలోచింపచేస్తాయి. మెదడున్న మనిషిని కదిలిస్తాయి. ఇలాగే కరుణ రసాన్ని నింపాదిగా నింపుకొని సాగుతుంది ఆ పాటలోనే ఓ చోట-

ఆడది కన్నా అడవిమానుకే -
విలువనిచ్చే ఈ దేశంలోన
ఆరడి పెట్టిన ఆడపడుచుకు -
అత్తారింటతప్పని స్థితి ఇది
బ్రతుకున నిప్పులు పోసిన
అత్తకు - గర్భశోకము తప్పకున్నది
పిశాచ గణాల ఆనందానికి -
మారణ హోమం జరుగుతున్నది
తేళ్లను చంపే పులల సీమలో -
కిలకిల మేధం సాగుతున్నది
జీవన రాగం అర్తనాద మాయే..

అడవిలో చెట్టుకు యిచ్చే విలువ ఈ దేశంలో స్త్రీకి లేదని, ఆడపిల్లయి పుట్టిన తర్వాత భర్తతో కలిసి అత్తావారింటికి తప్పక వెళుతుంది కదా! అట్లాగే అత్తలు కోడళ్లను హింసించడం కూడా సహజంగా జరుగుతున్న ఒకానొక ఆధునిక ఆటవిక చర్యగా మారిపోయింది. ఈ విషయాన్ని ఇట్లాగే యధావిధిగా చెబుతున్న కవి ఆఖరి వాక్యాల్లో వినే శ్రోతని ఒక్కసారిగా బంధం వేసి సంకెళ్లతో కట్టిపడేసేటంతటి శక్తి ఆ మాటలకి, ఆ వాక్యానికి వుంది. ఈ పాటలో ద్రవించే హృదయానికి ఎవరూ అడ్డుకట్ట వేయలేరు. ఇక్కడ స్త్రీ జీవితం అనే రాగం అర్తనాదమయ్యింది శోకంతో. ఎందుకంటే వేడినెత్తురు నిత్యం పురుషులు చవి చూస్తున్నారు. అదే కాదు. కోకిల (స్త్రీ) హత్యలు జరుగుతున్నాయి అంటూ అద్భుతంగా చెప్పిన ఈ మాట ఒక్కటి యధార్థ వర్ణనకు పతాక స్థాయి. అదే పాటలో "ఏ డాక్టరు నీకై సాక్ష్యం రాదు - కోర్టు నీకు రక్షణ రాదు" ఈ చట్టాలు, కోర్టు నేతి బీరలో నెయ్యి లాంటివేనని బోధిస్తూ చివరగా ముగింపులో-

"కర్మభూమిలో పూసిన ఓ పువ్వా
కన్నుల మంకెన పూవులు పూయగ

నెత్తురు మంటలు కేతన మవ్వగ
సమర హోరులో ముందుండాలమా!"

నీ కనుకొనల్లో కారవలసింద కన్నీరు కాదు. ఎర్రగా పండిన మంకెన పూవులుగా నీ కన్నులు చంద్ర నిప్పులు కాయాలి. కట్నపు జ్వాలల్లో కాదు నీవు సమిధ కావాల్సింది. నెత్తురు మంటల్లో జెండగ నిలవాలి నువ్వు. సమర సన్నద్ధమై ప్రజా పోరాటంలో దివిటీగా నిలవాలనే సందేశంతో పాట ముగుస్తుంది. స్త్రీల పాటల్లో మణి పూసలాంటిది ఈ పాట.

ఇలా సమస్యలను చాటుతూ, ఘటనల మీద సరియైన వివరణనిస్తూ పోరాటానికి కలసిరావాలని అనేకములయిన పాటలు మహిళా పాటల్లో చూస్తాము. ఈ స్త్రీ పాటల్లో చాలా ప్రాచుర్యం ప్రచారం పొందిన పాటలు అనేకములయినవి ఉన్నాయి. గద్దర్ రాసిన "సిరిమల్లె చెట్టు క్రింద లచ్చుమమ్మో లచ్చుమమ్మా, సినబోయి కూర్చున్నా వెందుకమ్మా ఎందుకమ్మా" అన్న పాట గ్రామీణ స్త్రీ జీవితానికి అద్దంపట్టే విధంగా వుంది. ఈ పాట బాగా ప్రచారం పొందింది. అట్లాగే 'అమాస చీకటి అర్ధరాతిరి చెల్లెమ్మా ఓ చెల్లెమ్మా, యిల్లు దాటితివి పల్లె దాటితివి చెల్లెమ్మా... ఓ చెల్లెమ్మా' అన్న పాట, 'చెల్లెమ్మా ఓ చెల్లెమ్మా', 'హక్కులకై పోరాడుదామను', 'మారలేదు - మారలేదు', 'గడప దాటిపోయే చెల్లెమ్మా', 'చెల్లెలా నా చెల్లెలా', 'స్త్రీ బ్రతుకు', 'ఎర్రెర్రని దారిలోన నా చెల్లెమ్మా', 'కదలి రండి వనితలారా', 'అశ్లీలాన్ని అంతం చేద్దాం', 'మాయమ్మా అలిసమ్మా' లాంటి పాటలు ఇవన్నీ మచ్చుకు కానీ, ఇంకా ఎన్నో ఎన్నెన్నో మహిళల మీద వచ్చిన పాటలు అద్భుతమైనవి. ప్రజా పోరాటాల నుండి ఉద్భవించినవి.

సుమారు 1910 వ సం॥లో ఆనాటి స్త్రీని కన్యాశుల్కాన్ని కథాత్మకంగా గొప్పగా వర్ణించిన ముత్యాల సరాల గేయము, గురజాడ వారి పూర్ణమ్మ ఆనాటి సమాజానికి ముఖచిత్రం. కానీ 8 దశాబ్దాల తర్వాత చూస్తే మళ్ళీ అదే స్త్రీ సమస్య, కానీ ఇక్కడ రూపం మారింది. రూపం మారినా ఈ సమస్యను స్త్రీని విలాస వస్తువుగా మార్చేసిన అర్థ భూస్వామ్య వ్యవహారం జోరుగా సాగుతున్న ఈనాటి గ్రామసీమల్లో, కాసిరెడ్డి లాంటి దుర్మార్గుల దుర్మార్గాల్ని చూపిస్తూ సాహసవంతమైన 'చెల్లి! చెంద్రమ్మ'ను సృష్టించి కథాత్మకంగా లిఖించిన శివసాగర్ వ్రాసిన 'చెల్లి చెంద్రమ్మ' కథ సామాజిక పరిణామ క్రమంలో నూటిదనంతో కవిత్వీకరించబడిన విప్లవ కవిత్వం - స్త్రీలపై వచ్చిన కవిత్వానికి మకుటం చెల్లి చెంద్రమ్మ.

ఇంకా అనేక పోరాట పాటల్లో స్త్రీని ఆదిశక్తిగా కాకసామాజిక మార్పుకు కేతనంగా విప్లవ మూర్తిగ కనిపిస్తది. సమస్యల్ని చెప్పి స్త్రీ పోరాటంలోకి రమ్మనడమే కాదు. పోరాటంలో దూకి తమ ప్రాణాల్ని బలియిచ్చిన తెలంగాణా పోరాటపు చిలకమ్మలున్నారు. పోరులో ఆత్మార్పణ చేసుకున్న స్నేహలతలు వున్నారు. నిజం మాట్లాడి ఈ వ్యవస్థను నిగ్గదీసిన నిర్మలమ్మలు, వున్నారు. నేలకొరిగిన వారిని తలచుకునే పాటే పాటలు 'స్మృతి గీతాలు' కూడా పోరాటానికి ప్రేరణగా, మార్గంగా నిలిచాయి.

'స్వర్ణలత వందనమో, వందనమమ్మా' అన్న స్మృతి గీతం (ఎలజీ) ఆమె జీవితాన్ని చెబుతూ కొంచెం కథాత్మకంగా కూడా చెబుతూ ఎన్‌కౌంటర్‌లో మరణించిన స్వర్ణలతను గుర్తు చేస్తున్న కన్నీటి పాట ఇది. నిజంగా ఈ పాటలో ఎమోషన్‌తోపాటు, విషయాన్ని చెబుతున్న పద్ధతి కూడా కొత్త శైలి, కొత్త రాగం సంతరించుకొని వుంది. స్త్రీల పాటలకు సంబంధించి వచ్చిన స్మృతి గీతాల్లో ఈ పాట ప్రశస్తమైనదే అని చెప్పవచ్చు. చూడండి పాటను-

వందనమో వందనమమ్మా
నా సెల్లేల స్వర్ణమ్మ
సెమట సుక్కల వందనమమ్మా
సేనుసెలకల వందనమమ్మా
కన్నతల్లులా వందనమమ్మా
సిన్నికూనలా వందనమమ్మా
బందూకుల వందనమమ్మా
నా సెల్లేల స్వర్ణమ్మ
బక్క రైతుల వందనమమ్మా
నా సెల్లేల స్వర్ణమ్మ

ఈ పై వాక్యాలలో గొప్ప దుఃఖం కనిపిస్తుంది. అట్లాగే పాటను పాటగా కాకుండా చూస్తే దీంట్లో గొప్ప కవిత్వం కూడా కనిపిస్తుంది. పోరాటం గురించి వర్ణించినప్పుడు, వీరుల గురించి తలచినప్పుడు తెలుగు సాహిత్యంలో ఇంత వరవడితో వచ్చిన పాట లేదు. స్మృతి గీతాల్లో ఈ పాటదో ప్రత్యేక శైలి. ఈ పాటలో బ్రహ్మాండమైన వచన కవిత్వం వుంది. అట్లాగే ప్రతీకలు కూడా విపరీతంగా వచ్చిపడ్డాయి. ఆ పాట రాసిన కవి కవిత్వం, ప్రతీకలు ఏరి రాసాడని కాదు. ఇక్కడ అభిప్రాయం. దేనికి గుర్తుగా కష్టజీవి. చెమట చుక్కలను చెబుతామో, ఆ చెమట చుక్కలే ఇక్కడ రెడ్ శెల్యూట్ చెబుతున్నాయి. 'శ్రమలో సౌందర్యం' చూసి శ్రీశ్రీ వచన కవిత్వాన్ని నిర్వచించి సాహిత్యాన్ని సక్రమ మార్గంలో నడిపించాడు. ఇక్కడ ఈ పాట రాసిన కవి కూడా సెమట చుక్కల్ని, సేను సెలకల్ని,కన్నతల్లిదే! సిన్న కూన అని అద్భుతంగా అత్యంత సహజ అడవిని అలంకారంగా తీసుకొని బందూకుల వందనం, బక్క రైతుల వందనముతో పోరాట పాటని విప్లవ పాటని సరికొత్త మార్గంలో నిర్వచించాడు. ఈ పాటలో ఇలా స్వర్ణలత చేసిన పోరాటాలకు సంబంధించిన సంఘటనలు గుర్తు చేస్తూ జీవితాన్ని విశదపరుస్తూ చెప్పుకుంటూపోతూ మధ్యలో అంటాడు అకలి అత్యంత సహజంగా.

అడవికి వచ్చిన స్వర్ణను చూసి
అడవితల్లి ముద్దాడి మురిసినది
గిరిజన తమ్ములు చెల్లి స్వర్ణకు
విల్లు బాణములు కానుకలిచ్చిరి
అన్నలు చెల్లిని కౌగిలించుకొని
పోరు పొలిమేరల జాడ చెప్పినరు
గెరిల్ల వీరులు తుపాకి పేల్చి
ఎర్రెర్రని దండాలన్నరు
నువు తుపాకి అందుకున్నావే
నాసెల్లేల స్వర్ణమ్మ
నువు గెరిల్ల దళముల చేరినవే
నాసెల్లేల స్వర్ణమ్మ

ఈ వీరవనితకు స్వాగతం చెప్పింది అడవి. తన బిడ్డను అక్కున చేర్చుకు ముద్దాడింది అడవి. అడవి పోరాటం, ఆ పోరాటంలో వచ్చిన స్వర్ణకు గిరిజన తమ్ములు విల్లు బాణములు కానుక లిచ్చారు. అడవినంతా చూపించారు. అడవి హద్దులు చెప్పారు.

అడవిలో తలదాచుకోవడం చెప్పారు. తుపాకి కాల్చడం చెప్పారు. గెరిల్లాగా మారిన స్వర్ణకు గెరిల్లా వీరులకు ఎర్రెర్రని స్వాగతాలు పలికారు. అలా స్వర్ణ గెరిల్లా దళంలో చేరింది అని చెప్పిన పద్ధతి. అడవిని పోల్చి చెప్పడం, అణువణువున అడవిని స్వర్ణను, పోరాటాన్ని వర్ణించుతూ అదే పాటలో-

కొండలు గుట్టలు ఎక్కుతు దిగుతు
అలసిపోయిన చెల్లి స్వర్ణకు
సెలిమలు చల్లని నీరు తాపినయ్
మండుటెండలో తిరిగే చెల్లికి
పచ్చని చెట్లు గొడుగు పట్టినయ్
చిన్నబోయినా చెల్లి స్వర్ణను
చిలుకల కోకిలలు పలుకరించినయ్
రింగు ఉంగరాల జుట్టును చూసి
అడవి మల్లెలు అలముకున్నవి
తండ్లల్లోనా తల్లులు చెల్లెకు
బాసనేర్పినరు బ్రతుకు నేర్పినరు
బాంబులిసురుట తుపాకి పేల్చుట
ఆటలు చెల్లెకు అన్నలు నేర్పిరి
నువు తుపాకి గురి నేర్చావమ్మా
నా సెల్లేల స్వర్ణమ్మ
దోపిడిపై గురిపెట్టావమ్మా
నా సెల్లేల స్వర్ణమ్మా

పై వాక్యాల వర్ణన సహజత్వానికి ప్రతీక. అట్లాగే చెప్పే విషయంలో స్పష్టత ఒక్కటే కాదు. ముఖ్యంగా వర్ణన. అందు లో సహజత్వం నిండిన వస్తువు వర్ణన ఇంకా బలాన్నిచ్చింది. ఈ పాటకు. అట్లాగే ఈ పాటను పరిశీలిస్తే ఈ పాటేగాదు, ఇంకా అనేకములయిన జనం పాటల్లో వచన కవిత్వం కనివిన్పొంది. అలా జరగడం సహజమైందే. కవిత్వం లోకి పాట, పాటలోకి కవిత్వం వెళుతుం డడం జరుగుతూనే వుంటుంది. అలసిపోయిన అడవిలోని స్వర్ణకు సెలిమల్లో నీరు త్రాగించడం, ఎండకాలంలోని ఎండకు ఆ అడవిలోని చెట్లు గొడుగులుగా నీడనివ్వడం, అలసటలో, దిగులుగా వున్న చెల్లిని చిలుక, కోకిలలు పలుకరించినాయి అంటే అడవిలోని అన్నలు, గిరిజనులు ధైర్యాన్ని ఇచ్చారని చెప్పడమే. ఆ తండాలో నివసించే ప్రజలు అక్కడ ఎలా తిరుగాలో, ఎలా పోరాడాలో నేర్పారు. బాంబు విసురుట, తుపాకి పేల్చుట లాంటి ఆటలు నేర్పారు. స్వర్ణ తుపాకి కాల్చడం నేర్చి గెరిల్లాగా మారిందని చెబుతున్నాడు కవి.

ఈ పాటలో అద్భుతమైన సహజత్వం, అడవి వర్ణన, స్వర్ణ జీవితాన్ని చెప్పిన శైలి, పోరాట పాటల్లో వస్తున్న కొత్త ఒరవడి, పాటలోకి వచ్చిన వచన కవిత్వం, ఇవన్నీ నిండి వున్నాయి. అంతేకాదు. ఈ పాట బాణీ కూడ అద్భుతమయింది. ఈ పాట విని కరగని మనిషుండడేమో! హృదయమనేది వుంటే.

ఇది స్త్రీల పాటల మీద వచ్చిన విలువైన స్మృతి గీతాల్లో ఒకటి. ఇలా స్త్రీలకు సంబంధించిన అనేక పోరాట పాటలు, ఉద్యమ గీతాల్లో మనల్ని పదునెక్కే విధంగా ఆలోచించే విధంగా చిత్రించబడ్డాయి. విప్లవ కవులు సృష్టించిన ఈ పాటల సాహిత్యం ఎంతో మందిని చైతన్య పరిచింది. ముందుకు సాగేలా చేస్తుంది. ఇది స్త్రీల పాటల మీద ఓ చిన్న పరిశీలన మాత్రమే!

**- జూలూరు గౌరీశంకర్**

## PARTICULARS OF OWNER SHIP IN RESPECT OF NALUPU

## FORM IV

| | |
|---|---|
| 1. Place of Publication | Hyderabad |
| 2. Periodicity of its Publication | Telugu Fortnightly |
| 3. Printer's | |
| a) Name | Cyril Reddy |
| b) Whether Citizen of India | Yes |
| c) Address | 1-1-342/B, Viveknagar, Hyderabad - 20 |
| 4. Publisher's | |
| a) Name | Cyril Reddy |
| b) Whether Citizen of India | Yes |
| c) Address | 1-1-342/B, Viveknagar, Hyderabad - 20 |
| 5. Editor's | |
| a) Name | B. Thakaram |
| b) Whether Citizen of India | Yes |
| c) Address | 1-20-24, Ashok Nagar Hyderabad - 20. |
| 6. Names and Address of individual who own the Magazine and Partner of share holders holding more than one percent of the total Capital | Hyderabad Book Trust 1-1-342/B, Viveknagar, Hyderabad - 20 |

I, Cyril Reddy hereby declare that the particulars given above are true to be best of my knowledge and belief

1-3-1992

Sd/-
**Cyril Reddy**
Publisher




అది తెలంగాణాలో ఊరు. ఊరు కుండాల్సిన లక్షణాలన్నీ ఉన్నయ్. ఊరికి దూరంగా ఇసిరేసినట్లు చిన్న చిన్న గుడిసెలతో హరిజన వాడ, ఓ వైపు గొల్లిండ్లు, ఓవైపు గౌండ్లిండ్లు, ఓవైపు చాకలిండ్లు ఓ వైపు ఇతరత్రా కులాలన్నీకలిపి నాల్గు దిక్కులా కాపలా కాస్తున్నట్టుగా పనిబాటోళ్ళ ఇండ్లన్ని ఉన్నయ్. ఊరి మధ్యన ఊరి గుండే మీదన్నట్టుగా దొర బంగ్లా, దాని చుట్టూ రెడ్డి పటేన్ల ఇండ్లూ ఉన్నయ్. కాక పోతే ఇప్పుడు ఊరు పాత ఊరు లెక్కలేదు. కరణం పంతులు దొర తనం, పటేన్ల పెత్తనం పోయి చాలా రోజులైంది. ఇప్పుడది రూపంలో మాత్రమే 'ఊరు'. ఏనాడైతే ఊర్లల్లకు సంఘాలొచ్చినయో ఊరు పోరైంది. దొరలు, పటేన్లూ పట్నాలు పట్టింద్రు. కూలి నాలికి అందగా అన్నలొచ్చింద్రు. పట్నం బట్టిన దొరలు, పటేన్లు వల్లెలకు పోలీసుల పంపింద్రు. పోరు ననచ డానికొచ్చిన పోలీసులు ప్రజల కాల్చుక తిన్నరు. పోరు ఆగలేదు పోలీసుల పని అయిపోలేదు. పోలీస్ పికెట్ ఏర్పాటు చేశారు. పోరైన ఊరు మొదలు రైతుకూలి సంఘమే అయితే అదిపెరిగి పెద్దదై మహిళా సంఘం, బాల సంఘమైంది.

ఎదైనా ఒక ఊర్లో ఒకరి పేరు అందరికి తెలిసి ఉంటుంది. అది మంచితనం తోటైనా కావొచ్చు, చెడుకైనా కావొచ్చు. ఈ ఊర్లో బతుకమ్మ తెలవని వాళ్ళుండరు. బతుకమ్మ ఊరందరికీ తెల్వడానికి అజ్జాద్దో బజ్జాద్దో కాదు, చీటికి మాటికి గిల్లి కజ్జాలు పెట్టుకొనే గయ్యాలి గంపకాదు. లేక మొగన్ని ఏమీ గొరకాకుండా చేసి అంతా తనిష్టం వచ్చినట్టు సాగించుకొనేద్ కాదు. గొండ్ల బతుకమ్మ అంటే మాటంటే మాట మీద నిలబడే పాబందికి మరో పేరు. 'ఎవరికీ జర్గినా అన్యాయం అన్యాయమే" నని బగ్గున మండే తీరుక బతుకమ్మ పేరు. సంఘ పెద్ద అయినందుకు పోలీసులు పట్కపోయి కొట్టి జైళ్ళ పెట్టినా 'పోరు బాటే బతుకుబాట'ని చెప్పి నిల్చినదీ బతుకమ్మ. అందుకే బతుకమ్మ అందరికి తెలుసు. తెలుసు అనేదాని కంటే ఊరందరికీ బతుకమ్మంటే గౌరవ ముంది. ప్రేముంది ఒకరకంగా ఊరందర్లోనూ బతుకమ్మ ఉంది.

బతుకమ్మ కొడుకు మేఘ్యం తాళ్ళు బంద్ చేసి బాయ్‌కాడికి పోతుండు. మేఘ్యం తండ్రి కనకయ్య తాళ్ళు ఎక్కసాతగాకుంట అయినంక ఎకురం చెల్కలో చిన్నబాయి తొవ్వి కరెంటు మోట్రు పెట్టిన్రు. ఎట్టకాలం నీళ్ళు ఊరక ఒక్కమడికూడ పార్తలేదు.

"బాయ్‌కాడ ఏముందమ్మా.... ఒక్కమడి కూడా పార్తలేదు, నేనేం చెయ్యాలె అన్నడు మేఘ్యం తల్లితో.

" మరి ఏం చేస్తం బిడ్డా....అన్నలు

సెప్పింది మంచిది కదా బిడ్డా. మందిని తాగుడుతో ముంచి మనం కష్టపడకుంట బత్కాలంటే న్యాయంగుంటదా......." అన్నది.

"అయితే నేను ఇంకొ ఇద్దర్ని తీసుకొని బాయిని లోతు తొవ్వుతనమ్మా" అంటుండంగనే బడి నుంచి చెల్లె సరూప వొచ్చింది.

"అన్నా... బాయి తొవ్వుతుండ్రానే.... అయితె నేను గూడచ్చి సూస్తా" అన్నది. సరూప ఊర్లోని హైస్కూల్‌లో 9వ తరగతి సదువతుంది. ఊళ్లె బతుకమ్మకు ఎంతపేరో సరూపకు అంత పేరు. సరూప సక్కగ పాడుతుంది. "పాటలు ఎట్ల నేర్చిందేగానీ ఆ గొంతుకే మొక్కాలే" అంటారు సరూప పాట ఇన్నోల్లు. "పల్లెల సూడు.....,పోరు పల్లెల సూడు," అనే పాట పాడుతూంటే రోమాలు నిక్కపొడ్సని మనిశుండడు. "సిరుమల్లె సెట్టు కింద..." పాట పాడ్తే కంటనీరు తుడ్వని కఠినాత్ముడుండడు. "బాల సంఘం" లో తిరుగుతు పాటలు పాడుతూ ఊరూరు ప్రచారం చేసిన సరూప ఇప్పుడు "కల్లు-సార బందు చేయ్యాలని" ఊరూరు తిరుగుతూ పాటలు పాడి ప్రచారం చేసే దళానికి నాయకురాలైంది. మేఘ్యం బాయికాడికి పోతూ సంగ కార్యక్రమాలల్లో చురుకుగా పాల్గొంటున్నాడు. ఊర్లో అందర్నీ కల్లు గీత బంద్ చేసేటట్లు ఒప్పించి బంద్ చేయించడంతో బతుకమ్మ, సరూపలతో పాటు మేఘ్యం పేరు గూడా అంతటా పాకి పోయ్యింది.

ఒకొక్కటీ సంఘం తీసుకున్న కార్యక్రమాలన్నీ విజయవంతం అవుతూంటే పోలీసులకు ఎక్కడలేని కసి పుట్టుకొస్తుంది. పెద్దపెద్ద పోలీస్ ఆఫీసర్లేమో ఊళ్లల్లో ఇదంతా జర్గుతుంటే మీరు తమాష చూస్తుండ్రా" అంటూ నానా బూతులు తిడ్తుంటరు. ఊళ్లె పోలీసులకేమో ఏం చేయాల్నో అర్థం గాదు. బయటికేం కనబడదు. జర్గేటివన్నీ జర్గి పోతుంటయ్. జర్గినంక తెలుస్తయ్. ఎవరేందో అర్థం కాదు. అందరూ ఏమీ తెల్వనంట్టే ఉంటరు. బతుకమ్మ లాంటోల్లు ఇద్దరు ముగ్గురు తప్ప ఒక్కరు గూడా పోలీసులకు తెల్వరు. "కల్లుగీత బంద్" విషయంలో మేఘ్యం ఉన్నట్లు "కల్లు బంద్" విషయంలో ఇష్టంలేని ఎవడో పోలీసులకు చెప్పిండు. ఎప్పుడుపడ్తె అప్పుడు ఊరు మీద పడి పోరగాళ్ళను, వయసోల్లను పట్టుకపోతుంటే ఈ ఘద్యన మేఘ్యం బాయికాడ్నే పంతుండు.

ఒకనాడు తెలతెల్లారగట్ల పసులకాడి పోరగాడొకడు ఎగపోసుకుంట ఉరుకొచ్చి "బతుకక్కా.... మేఘ్యన్నని పోలీసులు పట్టుకపోతుండ్లు..." అని ఎడ్సుకుంట అప్పుడే లేచి ఆకిలూకుతున్న బతుకమ్మకు సెప్పిండు. ఊకుతున్న పొర్క అట్లనే పడేసి

"ఎప్పుడ్రా.... ఏడంగ పోతుండ్రు, ఎట్లొచ్చిండ్లు" అడిగింది.

"జీపుల్నే... బాయికాడికి పోయి పట్టుక పోతుండ్లు...."

బతుకమ్మకు పానంల పానంలేదు. "ఏం చేద్దును. బాయి కాన్నించి ముసలోడు ఇంక రాకపాయే ముసలోనికి తెల్వకుండొచ్చా" అని భర్త గురించి అనుకొంటుండంగనే పడ్తాలేస్త ఉరికొచ్చి ఇంట్ల ఎగపోసుకుంట కూలపబడ్డడు.

"మేఘ్యం.... మేఘ్యాన్ని పట్టుక పోయింద్రు....." అని నేలకాయ్ సూసుకుంట కన్నీళ్ళు తుడుసుకుండు.

"ఎందయ్యా సూత్తవ్ లేపాదం, వోరంగల్ కెళ్ళి అక్కడ తెల్సుకొనొద్దం" అంది. ఇద్దరు దమ్మ దమ్మ తిన్నట్టు జేసి సరూపకు "భయపడకు బిడ్డా... అన్నను ఎవ్వలు తీసుకపోయిండ్లో సూసుకొని తీసుకొస్తం. టిఫిన్ తిన్కపో. రాత్రోరకువస్తం. బద్రంగుండు" అని బిడ్డ తలమీద చెయ్యేసి నిమిరి వోరగల్లుకు పోయింద్రు పోలీసు ఎస్.పి దగ్గరికి పోతే అక్కడికి పొమ్మండు. అక్కడికి పోతె ఇంకోకాడికి. ఇట్లా కొడుకు కోసం బతుకమ్మ, కనకయ్య ఎస్.పి ఆఫీసు సుట్టూ ఇరవై రోజులు తిర్గిండ్రు. రోజు రేపంటే మాపన్నరు. మాకు తెల్వదంటే మాకు తెల్వదండ్రు. ఇరవై రోజుల తర్వాత బతుకమ్మ ఎస్.పి ఆఫీసుకు పోతే...

"నీ కొడుకు పేరేంది..." అన్నడు ఎస్.పి

"మేఘ్యం...." అంది బతుకమ్మ ఏడ్సుకుంట.

"అయితే మెగాలల్ల సూడుపో" అని ఎస్.పి నవ్వుకుంట అని ఇంకిప్పుడు రాకు, నాకేం తెల్వదు" అన్నాడు. తెల్లారి మరుసటి దినం చౌరస్తాలో కరెంట్ స్థంబానికి వొరంగల్ చౌరస్తాలో ఉరి పోసుకొని ఒక నక్సలైటు మరణించిండ"ని అంతా పుకారైంది. ఆరోజు కూడా కొడుకు జాడకోసం వచ్చిన బతుకమ్మ, కనకయ్యలకు కరెంటు స్తంభం చివర ఆకాశంలో మేగాలకు సగం దూరంలో ఏలాడుతున్న మేఘ్యం కనిపించాడు.

"నాకొడుకును బాయికడ్నించి పట్టుకొచ్చి ఇక్కడ సంపిండ్రు పోలీసులు" అని రెండు చేతులతో రొమ్ము కొట్టుకొంటు ఏడుస్తూ అందరికి చెప్తూంది. మేఘ్యం శవమై ఏలాడిన స్తంభం దగ్గర వందల మంది జమై చూస్తుండడంతో పోలీసులొచ్చి లాఠిచార్జీ చేసి అందర్ని అక్కడి నుండి గెదిమిండ్రు.

"నాకొడుకు మేఘ్యం శవాన్నైనా ఇయ్యండి. బొంద పెట్టుకుంటం" అని ఎంతమొత్తుకున్నా "ఎవరో గుర్తు తెలియని నక్సలైటని" పోలీసులు బతుకమ్మను దగ్గరకి కూడా రానియ్యకుంట శవాన్ని ఎత్తుకపోయిండ్రు కండ్ల ముందే చెట్టంత కొడుకు మాయమైనట్టు అయిపోతేబతుకమ్మ,కనకయ్యలుఏడ్చి ఏడ్చి కండ్ల నీరింకి పోయి మాటకూడా పెకల లేని స్థితిలో ఇంటికి చేరిండ్రు. జర్గిన సంగతి తెల్సిన ఊరు ఊరంతా బతుకమ్మ ఇంటికి చేరింది. అందరూ మేఘ్యం రూపు తలసుకొని ఏడ్సుతుండ్రు. "సచ్చినోల్ళంత మంచోళ్ళన్నది పాతది నేడు సంపబడుతున్న వాళ్ళంతా మంచివాళ్ళే" నన్నది మరోసారి మేఘ్యాన్ని పోలీసులు పొట్టన బెట్టుకొని శవం చేసిండ్రు" అని అనుకుంటున్నారు.

కొడుకు సూస్తుండంగనే బాయికాడ్నించి పట్టుకపోయి మాయం చేసి చంపిన తీరును పదే పదే గుర్తు చేసుకొని కనకయ్య కుమిలి కుమిలి ఏడ్చి మంచం పట్టిండు. అదేమంచం పట్టి కొద్ది రోజుల్లోనే కొడుకు మేఘ్యంతో కనకయ్య కలిశి పోయిండు. అప్పటి దాంకా ఎన్నిసార్లు పోలీసులు దాడిచేసినా బతుకమ్మనే పట్టుకొపోయి నానా

బూతులు తిట్టి కొట్టి పంపే వారు. ఊర్లల్లో పోలీస్ పికెట్ ఉందిగాబట్టి అంతా రహస్యంగా పని చేస్తారు. ఎవరేందో అర్థంగాదు శత్రువుకు ఎటొచ్చి బతుకమ్మ లాంటోల్లు ఇద్దరు ముగ్గురు చాలా ఏండ్లుగా అందరికి తెలిసి సంఘంగా పనిచేస్తడు. మిగతా వారంతా రహస్య పని విధానంలో ఉంటరు. "కల్లు గీత బంద్" చేయ్యాలనే పార్టీ పిలుపు తోటి స్వార్థపరులు, సంకుచితులైన కొందరి పనుల మూలంగా కొందరి పేర్లు పోలీసులకు తెల్సిపోయినయ్. అందులో భాగమే మేఘ్యం అరెస్టు హత్య.

ఏమాత్రం ఒడుదొడుకులు లేకుండా సాఫీగా నడిసే కుటుంబం ఒక్కసారిగా కుప్పకూలి పోయింది. "కల్లు గీత బంద్ అయితేంది కష్టం చేసి బతుక్తం" అనుకొన్న బతుకమ్మ ఆశలు అడియాశలయ్యాయి. పోయిన కొడుకుపై ప్రేమతో కనకయ్య పోయిండు. అప్పటి దాకా ఏ చీకు చింతా లేకుండా ఉన్న బతుకమ్మ ఇల్లు పచ్చగా గుబురుగా ఉండే మోదుగు చెట్టులా ఉండేది. పదిమందికి నీడనిచ్చే మోదుగు చెట్టులా అందరి కష్టాల్లో ఆదుకునేది. అయితే బతుకమ్మిప్పుడు కొడుకు పోయి, భర్త పోయి ఎండకాలంల్లో ఆకులు రాల్చిన మోదుగు చెట్టులా అయినా ఆమెలో పిరికి చేరలేదు. ధైర్యం కోల్పోలేదు. పోగా కొడుకు అన్యాయంగా పట్టుకెళ్ళి చంపిన పోలీసులపై కోపం పెంచుకొంది. అందుకే ఇంకింత కసితో...., విప్లవ భావంతో ముందుకు పోవాలని నిశ్చయించుకొంది. ఇంకిప్పుడు తను చేయాల్సింది ఒక సంఘం పనే తప్ప ఏమి లేదు. ఇక సంఘమే దిక్కు, సంఘమే సర్వస్వంగా నిర్ణయించుకొంది. కాకుంటే; బిడ్డ సరూప అన్న సచ్చిన కాడినుండి బడికి పోతలేదనే ఫికరు పెర్గింది. ఎట్లనన్న పెండ్లి చేసి ఎల్లగొడ్తె బాగుండు ననుకొంది. ఉన్న ఎకరం పొలం అమ్మైనా పెళ్లి చేయ్యాలని అనుకొంది.

సమ్మక సారక్క జాతర ఊరి నుండి అందరు బండ్లు కట్టుకొని పోతుండ్రు. కనకయ్య ఉన్నన్ని రోజులు ఆయనే బండి కట్టి ఊర్లోల్లని ఎక్కించుక పోయెటోడు. ఇప్పుడు బతుకమ్మ బండి కట్టి చిన్న పిల్లల్ని, ముసలోల్లని బండ్లే జాతరకు తీసుకపోయింది. సంఘం పనులు, ఇంటి పనులే తెల్సిన బతుకమ్మ ఇప్పుడు వ్యవసాయం చేయడం నేత్తి నేసుకొంది. నాగలికి ఒలిపట, దాపట తెల్వకున్నా ఉన్న రొండెడ్లు మంచివి, పనికి అలవాటు అయినయ్ కాబట్టి ఎలాగోలాగ నెట్టుకొస్తుంది. ఒకనాడు సరూప, బతుకమ్మ బాయికాడ "ఎద్దెం మద్దెం కరెంటు ఎప్పుడస్తదో" ననుకుంట బాయికాడ కూసుండ్రు. దూరంగ వస్తుండగా ఎప్పుడు చూసిందో ఏమో సరూప "అమ్మా.... అన్నొస్తుండు..." అని సంతోషంగా ఎగిరిగంతేసింది. బతుకమ్మకు ఒళ్ళు జల్లుమంది.

" ఎక్కడన్నా ఏందే.... గట్టి గురుతవు" అంది.

" అదే సత్తెన్ననే.....అగో... అని వొచ్చేదిక్కు వేలెత్తి సూయించింది. బతుకమ్మ సూయించిన దిక్కు లేశి చూసి

" అరే అన్నలుగా బిడ్డా.." అని ఏదో యాదికచ్చినట్టు

" అయ్యో బువ్వ లేదుగా బిడ్డా... ఎప్పుడూ దిన్నరో ఏందో..." అంది.

సరూపకు ఇదేమి పట్టలేదు. ఎన్నో రోజులైంది అన్నలగలిసి. "కల్లు వ్యతిరేక చేస్తారు క్యాంపేనప్పుడు కల్సిండ్రుండ్లు. ఇప్పుడా" అని మనసులో అనుకొని దళానికి ఎదరు పోయింది. అందరూ సరూపను అక్కున చేర్చుకొని" నీ అన్న మేఘ్యం చనిపోతె మేమంతా అన్నల ముండంగా భయమెందుకు"న్నట్టుగా సరూపను దళం మధ్యన నడిపించు కుంటూ సాధరంగా తీసుక స్తున్నారు.

దళాన్ని సూడంగనె బతుకమ్మకు దుఃఖమాగలేదు. మేఘ్యం యాదికొచ్చి బిగ్గరగా ఏడ్చింది. దళనాయకుడు సత్తన్నను కౌగలించుకొని ఒళ్ళంతా తడిమి తన కొడుకే అన్నట్లుగా ప్రవర్తించింది. దళం అంతా కుసున్నారు. ఎప్పుడు బాయికాడికొచ్చినా మేఘ్యం ఉండేటోడు. ఇప్పుడు బతుకమ్మ ఉండి మేఘ్యం లేని లోటు కనపడ్తుంది. దళ సభ్యులంతా విచారంగా కిందికి సూసుకుంట కూసున్నరు. దళ నాయకుడు సత్తెన్న దేన్నో ఎతకుతున్నట్టు అటుఇటు సూస్తు న్నడు. అది చూసి బతుకమ్మ.

"ఏంది బిడ్డా సూత్తవ్" అంది.

" దూపైతుందమ్మా... నీళ్ళు" అన్నడు.

" అయ్యో కరెంటోడు కాలిపోను దాని కోసమే సుత్తున్నం"

" మరెట్లమ్మా.... "

" అగన్నా ముంతకు తాడు కట్టింది. శేది తాగుదాం" అని మొత్తల దాపెట్టిన ముంత తాడుతో తెచ్చి అన్నకు సూయించి నీళ్ళు శేదడానికి బాయి ఒడ్డుకుపొయ్యింది.

"బద్రం సరూపా" బతుకమ్మ.

" అ..... అనుకుంటనే ముంతను బాయిలకేసి నీళ్ళు బైటికి తెచ్చి సత్తెన్నకు ఇచ్చింది. నీళ్ళను సూశిన సత్తెన్న ముఖం ఎల్గిపోయింది. అందరు నీళ్ళు తాగిండ్రు.

" ఉండర్లి అన్న.... నేనింటికి పోయివస్త" అనుకుంట సర సర ఇంటితోవ బట్టింది బతుకమ్మ. సరూప దళంతో కుసోని అన్న మేఘ్యాన్ని పోలీసులు ఎట్ల తీసుకపోయింది, ఎట్ల సంపిందీ..., ఫికర్తో తండ్రి ఎట్లా మంచం పట్టి సచ్చిపోయిందీ... అంతా చెప్పింది. చివరకు అమ్మ తనకెట్ల పెండ్లి చేయ్యాలని చెప్పి, పెండ్లి చూపుల తతంగం, అందులో వాడు ఎట్లా 'పిల్ల మంచిగ లేదంది చెప్పి కళ్ళ నీల్లు తుడ్సుకుంది. సత్తెన్న విషయాన్నంతా విని సరూపను ఏడ్వద్దు అన్నట్టుగా బుజం మీద చెయ్యేసి ఊపాడు. సరూప సత్తెన్నను పక్కకు తీసుకపోయి చాలా విషయాలు మాట్లాడింది. సత్తెన్న కూడా చాలా విషయాలు చెప్పాడు. చివరకు ఇద్దరు ఒక నిర్ణయానికి వచ్చినట్టుగా " సరూప ఎలిగే ముఖంతో అందర్లో కొచ్చి కూసింది. సత్తెన్న గూడావచ్చి "కామ్రేడ్ లైనొచ్చిందేమో సూడు తానం సేద్దాం. బతుకమ్మ వచ్చేవరకు తానం చేద్దాం" అన్నాడు. ఒక దళ సభ్యుడు ఉరికి మోటర్ పెట్టిండు బొంయ్యన నీల్లు బయటపోసింది. అందరూ బట్టలు తుక్కొని తానం చేసిండ్రు. ఒక దళ సభ్యుడు తొందరగా చేసి ,సెంట్రీ చేస్తున్న కామ్రేడ్ను తానానికి పంపాడు. అందరి తానాలు అయిపోయినయ్. అందరు బట్టలారేసి కూసుంటుండంగనే బతుకమ్మ గంపల అన్నంతో వచ్చింది.

అందరూ అవురావురంటూ తింటున్నారు. తింటున్న దళ సభ్యుల దిక్కు బతుకమ్మ అట్లనే చూస్తూ.....

"కొడుకులు ఎప్పుడు తిన్నరో ఎందో.... అకలి ఒచెరుగదన్నట్లు ఎట్ల తింటున్నారో..." అనుకొని "సరిపోద్దా బిడ్డా" అంది. "సరిపోద్దక్కా" అని ఇద్దరు ఒకేసారి సత్తెన్న ఇంకోదళ సభ్యుడు అన్నాడు.

తిన్న తర్వాత అంత కొరాల్ల చింత చెట్టుకింద గడ్డాంల పక్కన కూసుండ్రు. బతుకమ్మకు ఈ రోజు పండుగ లాగుంది. సచ్చిపోయిన కొడుకు లేసొచ్చినట్లుంది. బిడ్డ గురించి, బిడ్డ భవిష్యత్ గురించి ఎంతో చెప్పాలని ఉంది. ఎట్ల చెప్పాల్నో అర్థమైతలేదు బతుకమ్మకు. ఎట్లనో ఆలోచించి ఆలోచించి పెండ్లి సూపుల విషయాన్ని మెల్లగా లేవదీసి జర్గిందంతా చెప్పి " ఈ కాలంలో అంత లంగలున్నరు బిడ్డా.... ఆపోరడు సుశినేడు సూశిపోక మొఖం మీదనే ఒంక సెప్పిపాయే, మల్లెట్ల చేయ్యాలె పండ్లి, అయినా పిల్లలు సిన్నాలు, సికార్లు తిరిగి మంచి మంచి పిల్లలకు ఒంకలు పెట్టి ఎక్కడ కట్నం ఎక్కువ ఇస్తరో పసిగట్టి చేసుకుంటుండ్లు" అంది.

అంతేకదమ్మా ఈ లోకంల ఏది నీతిగా ఉంది చెప్పు" అన్నాడు దళంలోని ఒకరైతులాగున్న దళ సభ్యుడు.

"మంచిగ చెప్పినవన్న" అని మాటలు రాక అట్లనే ఊకుంది. కాని ఈ పెండ్లీలు గిండ్లీలు వద్దు. నాబిడ్డ సుకంగుండాలంటే పార్టీలకు పోతనే మంచిది. ఈరోజు ఎవన్ని ఎట్ల నమ్మాలె, పెండ్లైనంక మూడు రోజులకే సంపుతుండ్రు. వరకట్నం తెమ్మని సచ్చిందాకా కొడుతుండ్రు. ఇక్కడున్న ఏముంది ? ఏం బతుకు ? సంఘంలో పోతే సచ్చినా మంచిగ సావొచ్చు. ఎట్లనన్న జేసి అన్నని అడిగితే బాగుండు అనుకొంది. కాని అడ్గితే ఏమనుకుంటడో సత్తన్న. బిడ్డ చిన్నగున్నది. పార్టీల పెద్దగ సదివినోల్లు ఉంటరాయే. పోరి సదువవే అంటే మధ్యన బంద్ బెట్టే అనుకుంట ఎటో చూస్తుంది.

" ఏందక్కా..... ఏదో ఆలో చిస్తున్నావ్" అడిగిండు సత్తెన్న

" ఆ, ఏం లేదన్న" ఉలిక్కి పడ్డట్లు అని ఇబ్బందిగా కదిలి కూసుంది. మదిల అనుకున్న మాటలు ఇన పడ్డయా ఏంది అని అనుమాన పడ్డది. తేరుకొని

" పొద్దుగూకి పోయింది" పోతుమన్నా, ఇంకన్నమున్నది. పోయె తప్పుడు తినిపొండ్లి" అని "సరూప లేయే పోదాం పొద్దుగుంకితే ఎవో అనుమానాలు" అని బిడ్డను తీసుకొని తల్లి ముందర బిడ్డ నడుస్తుంటె ఇంటి బాట పట్టింద్రు. తుపాకీ... డ్రెన్.... ఓహ్.... సరూపకు పట్టరాని ఆనందంగున్నది. రెండు మూడు రోజులల్ల అన్న ఎవలినన్నా తోలిచ్చి నన్ను దళంలకు తీసుక పోతడంట అని ఆలోచించు కుంట ఎనుకంగ తల్లి వస్తుందో లేదో చూసుకొ కుంటనే నడస్తుంది. సరూపా ఎందే పిల్లా.... సిన్నగ నడువు, నేను గూడ వేస్తున్నగా...." అంది. ఈ లోకంలో కొచ్చిన సరూప నడక తగ్గించి మెల్లగ అంగలేనుకుంట నడుస్తుంది. బాయికాడికి వస్తుండ్రు పోతుండ్రు. రోజులు గడిచినయ్ అనుకున్న ప్రకారంగా గొల్ల పర్వతాలు బాయికాడికి వచ్చి సాటుంగ సరూపకు సైగ చేసిండు. సరూప అన్నల పిలుపు వొచ్చింది అనుకొని ఎగిరిగంతేసి పర్వతాలు దగ్గరికి ఉరికింది. జేవుల కెల్లి ఒక కాగితం తీసి ఇచ్చిండు. అది సదువుకున్న సరూప " అమ్మ ఇప్పుడు గడ్డి కొయ్యడానికి పొలంలకి పోతది అప్పుడు మాట్లాడుదాం" అంది. బతుకమ్మ పొలంలకు పొంగనే సూడు సర్వతాలన్నా... నన్నుఅన్నలు రమ్మన్నరు. నేను దళంల పోతున్న. అమ్మకు తెల్వది. అన్న పొయ్యిండు, నాయిన పోయిండు నేను పార్టీలపోతే ఎంత ఏడ్సుతదో... అమ్మగడ్డి గోసుకోచ్చి పెట్టంగనే అమ్మను ఇంటికి పంపుతా. నన్ను అన్నలు దగ్గరికి తోలుకపో..., అమ్మకు చాల రాత్రైన తర్వాత చెప్పు.... నేను దళంల పోయినని ఏడ్వకని సెప్పాలె. ధైర్యం నువ్వే ఇయ్యాలె " అని చెప్పి అమ్మ యాదికొచ్చి ఏడ్పొచ్చింది. కన్నీల్లు తుడ్సుకొని దళంల పోవడానికి ఆలస్యమైతుందని అటుఇటు సూస్తుంది. బతుకమ్మ గడ్డిమోపుతో రాంగనె ఇంటికి పంపింది. సరూప పర్వతాలుతో నడుస్తూ దళం కోసం దూరం అంగలతో కదిలి పోయింది.

రాత్రైంది సరూప ఇంటికి రాక పోయేసరికి బతుకమ్మ కలసి నోళ్ళం దర్ని అడుగుతుంది. పర్వతాలు, కొంత ఏచార మొకం పెట్టి బతుకమ్మను ఇంట్లోకి తీసుకపోయి భయం భయంగా అటుఇటు చూసి ఎవ్వరు సూస్తలేరని నమ్మకం కుదిరిన తర్వాత సరూప దళంల పోయింది" అన్నాడు. బతుకమ్మ గుండే గుభిల్లుమన్నది. దుఃఖ మొచ్చింది. కోపమొచ్చింది. భయమైంది. కొంత సేపటికంట తేరుకొని పర్వతాలుతో "ఇంకెవ్వలికి సెప్పకు తమ్మి" అని మాత్రం చెప్పింది. రాత్రంతా నిద్రరాలేదు బతుకమ్మకు తననుకున్న ట్లుగానే సత్తెన్న బిడ్డను తీసుకపోయి నందుకు ఆరోజు మదిలనుకున్న మాటలు ఇన్నట్లున్నది. అనుకొంది. తెల్లారి ఉల్లే అందరు సరూప ఏడికి పోయిందని అడిగినోళ్ళకు ఊరికి పోయింది అని చెప్పింది. అప్పటికే ఊల్లంతా వరంగల్ మీటింగు గురించి పోదామని జట్లు జట్లుగా అనుకొని ఎట్ల పోవల్నో నిర్ణయించు కుంటున్నరు. ఎవ్వరో బతుకమ్మనడిగింద్రు. "బతుకక్కా... కాశిబుగ్గ మీటింగ్కు ఎట్లయినా పోదాం" అని వెంటనే "ఎట్లందే. ........నాబండి లేదా..... బండి కట్కోని పోదాం" అంది. ఊర్లె అంతట తిర్గి నడువలేక, తీసుకపొయ్యే దిక్కులేక ఉన్న ముసలోల్ల నందర్నీ బతుకమ్మ బండ్లె ఎక్కించకొని చిన్న పిల్లల్ని బండ్ల నింపి బండితో కాశి బుగ్గకు బయలు దేరింది. బండి పిల్లలు, ముసలోల్లతో నిండిపోయింది. ఊరిబయట చెట్టుకు గట్టిన రెండు జండాల్ని పిల్లల్ని తీసుకరమ్మని బతుకమ్మ ఒకటి చేతుల పట్టుకొని బండి ముందు నడుస్తుంది. బండికి బాట సూప్తుంది. అందరికన్న సిన్న పిల్లగాడు జెండాకర్ర ఒక చేతుల, ఎద్లని అల్లిచ్చే కర్ర ఇంకో చేతుల పట్టుకొని బండిని ముదుకు నడుపుతుండు. బతుకమ్మ బండి అన్ని బండ్ల కంటే ముందుంది. బతుకమ్మ బండికి గొప్ప త్యాగాలతో కూడిన అనభవాలతో గూడిన ముందు చూపు ఉంది. బతుకమ్మ బండికి గొప్ప భవిష్యత్తు ఉంది. బతుకమ్మ బండికి దారిచూపుతుంది. బండిని నడుపుతున్న బాలుడు పది వసంతాల ఉద్యమ బాలుడు. బతుకమ్మ బండి కష్ట జీవుల మీటుంగుల కల్సింది.

– స్వరూపి

# మానవి

శోకం శ్లోకమైన కావ్యం
వేదనే నాదమైన వాదన
బాధలు రోదనైన నివేదన కాదు
తరతరాల నిశ్శబ్ద గర్భం
తనకు తాను జన్మనిచ్చుకుంటున్న
యుగయుగాల స్త్రీ జాతి మౌన విస్ఫోటనం
కళ్ళు మూసినా తెరచినా
రెప్పకూ, రెటీనాకు మధ్య
ఆడబ్రతుకు వెలుగు నీడల చారిత్రక
ప్రవాహాలు •
అవమానాలు - అణచివేతలు
ఆర్తనాదాలు - ఆత్మహత్యలు
ప్రశ్నలు - ప్రతిఘటనలు
గెలుపు ఓటముల దివారాత్రాలు
నాటివా? నేటివా? ఏనాటివి?
ఈ పరాధీనత జాడలేడివి?
పరాయీకరణ పునాదులు ఎక్కడ?

సమానార్థక భిన్నాంశాలు వ్యతిరిక్తులై
సమస్త జీవజాలంలో లేని
ఆడ మగ అసమానతలు
మనిషి తనాన్ని మింగేసిన చరిత్ర
మానవత్వాన్ని మైనస్ చేసి
ఆడతనం మగతనం ఆపాదించిన కుట్ర
స్వంతవేలితో కన్ను పొడుచుకున్న
మానవజాతి మూర్ఖత్వానికి పరాకాష్ఠ
సమాజ పరిణామ క్రమంలో
సౌలభ్యం కోసమో సౌకర్యం కోసమో
స్త్రీ పురుషుల మధ్య జరిగిన శ్రమవిభజన
శరీర సహజ లక్షణం చేసి
శరీర ధర్మం పేరిట స్త్రీని
నాలుగ్గోడలకు పరిమితం చేసి
ఇంతకాలం చెప్పినదంతా
ఆడజాతి అణచివేత చరిత్ర.
కూడినా తీసివేసినా హెచ్చించినా, భాగించినా
గిలగిల కొట్టుకుంటూన్న స్త్రీ శేషరూపం
చాకిరీకి చేతులూ కనడానికి గర్భసంచీ
సంభోగించడానికి గర్భ ద్వారమూ మిగిలిన
వికృత
అబల, ఆలి, అమ్మ, ఆడకూతురు
చరిత్ర చీకటి కోణాల్లో ఆమె యేదో
హృదయాల బలితర్పణ.

రగిలి రగిలి రాజుకున్న రోదన
కుమిలి కుమిలి కుంపటైన వేదన
చరిత్ర శిథిల శకలాల మాటున
పరాధీనత జాడలు పరాయీకరణ
పునాదులు
ఒక వివాహిత హత్య మరో ఆత్మహత్య
చెరచబడ్డ బాల్యం అణచబడ్డ యవ్వనం
పితృస్వామిక చట్రంలో ఊరేగుతున్న
మాతృత్వం
తాలికి తలవంచి ఆలి
మనిషికి ఊపిరి నిచ్చి అమ్మ
అత్తా! కోడలా! అక్కా! చెల్లి
పేరేదైతేనేం వరసేదైతేనేం
ఆమె ఉనికికి ఊపిరికి అర్థం, పరమార్థం
అన్నీ అతడే అయిపోయి
లొంగుబాటే ఆడతనమని
స్త్రీత్వం అంటే కనడం పెంచడం
చాకిరీ చేయడం సర్వస్వం ధారపోయడమేనని
శరీర లక్షణాలని బ్రతుకు అర్థాన్ని
జీవిత ధర్మాన్ని మనసు రూపాన్నీ
నిర్దేశించిన కుట్రల్ని జీర్ణించుకుని
తనకు తానే శత్రువై
తన్ను తానే వంచించుకుని కుంచించుకుని
తనను తానే ధ్వంసించుకుంటూన్న
కుసుమ కోమలీ, కలకూజితమ్మా
కొమ్మా, రెమ్మా నడయాడే బొమ్మా
గొంతుకు బిగించిన శ్రుతిలయల్లో
బ్రతుకు రాగం బంధీ అయిన
సామాజిక సమాధి లోపల
తనను తానే వినలేని
తరతరాల మౌన సంఘర్షణ బద్ధలయితే
సమాజమా ఇంక నువ్వు స్త్రీత్వాన్ని చెక్కలేవు
ఆమెనింకెంత మాత్రం శాసించలేవు
తనను తాను పునర్ నిర్మించుకుంటున్న స్త్రీ
సామాజిక రూపాన్ని తీర్చిదిద్దుతోంది
పురుషాధిక్య సమాజమా
స్త్రీకి మాత్రమే నువ్వు కట్టిన
శీల శిగ్గు బ ల్లలకి
ప్రాతివ్రత్యపు ఇనుప కచ్చడాలకి
లక్ష్మణరేఖకీ, లక్షలాది నియమ
నిబంధనలకిక స్వస్తి
స్త్రీ శరీరాన్నీ అందులోనూ
గర్భసంచినీ, గర్భ ద్వారాన్నీ
చాకిరీ చేసే చేతులనే తప్ప
హృదయాన్నీ మేధస్సునీ చూడలేని
శ్రమశక్తిని గుర్తించలేని
కబోది చరిత్ర కంటి పొరలకి శస్త్ర చికిత్స
హరప్పా, మొహంజదారో, గ్రీకు
సింధు రోము నాగరికతల
శిథిల శకలాల్లో చరిత్ర త్రవ్వకాల్లో
ఆమె చెవిపోగులనీ, చేతి గాజులనీ
రంగు రంగుల పూస పేర్లనీ తప్ప
నాగరికత నిర్మాణానికి ఆమె ధారపోసిన
నెత్తుటి చారలనీ, చెమట ప్రవాహాలనీ
చూడలేని చరిత్రను తగలేసి
మానవేతిహాసంలో సగమైన స్త్రీ
తనను తాను ఆవిష్కరించుకుంటూంది.

ఆదిమ గణాల నడిపిన ఆది మానవి
అడవి మృగాలను చెండాడిన శక్తిశాలి
వ్యవసాయానికి బీజం వేసిన
సృజనాత్మక శక్తి
సామాజిక పరిణామ క్రమంలో సహచరి
మానవ జాతి సంస్కృతి నిర్మాణంలో
సగభారం మోసిన మానవి
మనిషికి మారకం తెలియని నాడు
శ్రమైక జీవన శక్తి, సమాజ చోదక శక్తి
ఓటికి వంటకు నాలుగ్గోడలకు పరిమితమై
అబలయై సరుకులో సరుకైన
ఇల్లాలు, గృహలక్ష్మి
సంతానలక్ష్మి, సంసార నౌక
తనకు మాత్రం తానేమీ కాని ఏకాకి
తన కోసం ఆలోచించకూడని స్త్రీ
భర్తకి కర్మేషు మంత్రి
ఆమె సౌందర్యం ఆమెకి శత్రువు
అతనికి శయనేషు రంభ
బాల్యంలో తండ్రి యవ్వనంలో భర్త
వృద్ధాప్యంలో కొడుకుల రక్షణలో
కుటుంబిక కోటగోడల కాపలాలో
నిలువెల్లా ఆశలు విరగపూసి
కలలు కన్న కాపురం
కన్యాశుల్కమో వరకట్నమో దేనికైతేనేం
కాలి కుప్ప కూలుతున్న కమురుకంపు
హత్యలు ఆత్మహత్యలు.
సజీవ దహనాలు
పాతివ్రత్యపు తిలకం దిద్దుకున్నా
వ్యభిచారం రంగు పులుముకున్నా
అంతరాత్మను సమాధి చేశాకనే కదా
ఆమె లైంగికత్వాన్ని అణచివేశాకనే కదా
ఆడతనాన్ని అందలం ఎక్కించేది
శవసంభోగం అమానుషం అన్నా
అంతరాత్మను వాపసు చేయమని అడిగినా
ఆమె నేరం పేరు అహంకారం
ఆత్మాభిమానమే అహంభావం
అతడి అహంకారం, ఆత్మాభిమానం
ఆమెది గర్వం అతడిది పంతం
అతడి పట్టుదల ఆమె పొగరు
ఆడదాని తెంపరితనం మగాడి
తెలివి తేటలు
అతడి స్వర్గావర్తతే విద్య
ఆమె ఈర్ష్యాద్వేషాల కుళ్ళు
తండ్రీ! భర్తా! సోదరుడు
కామ్రేడ్! సహచరుడా! ఎవరైతేనేం
స్త్రీని మనిషిగా చూడలేని
మానవిగా మన్నించలేని
అహంమీద అజ్ఞానం మీద
అంధకారం మీద ఆధిపత్యం మీద
సంఘటిత మూఢత్వం మీద
సాంస్కృతి మీద
భక్తి విశ్వాసాల అధికారం మీద
సాగుతోందీ సంఘటిత పోరు
అబలల అంతరాత్మల అట్టడుగున
అణగిఉన్న
ఆదిమానవీ లేచిరా
ఆవాహన చేస్తున్నాము నిన్ను
ఆది మానవీ తిరిగిరా
తల్లి కడుపులో పిండమైనది మొదలు
తలకొరివి పెట్టడానికి తనయుడే కావాలని
కన్న తల్లి కడుపు పంటను నియంత్రించే
రక్తసంబంధాల వ్యాపారానికి సవాలుగా
పితృస్వామ్యాన్ని ధ్వసించ
ధనస్వామ్యాన్ని నిర్మూలించ
మానవీ పునర్జన్మించు.

– రత్నమాల

13C8

## ...జాతీయ మహిళా దినోత్సవం

,లనుద్ధరించాలని మీరు అయ్యో
ంతర్జాతీయ మహిళా సంవత్సరం పాటించమంటిరి
ని, ఈ రాజ్యంలో
ప్పుడు చూసినా నట్టనడి రోడ్ల మీద అత్యాచార మానభంగాలు
ల కొద్ది అబలలు వ్యభిచారినిలు, జోగినీలు క్షమించాలి, ఈ
లకుల్ని అందుకు
ళ్ళకు ప్రతిది "మిధ్య" అంతా దేవుడెరుగు
నం కేవలం నిమిత్త మాత్రలమంట!
మస్తంసృష్టించినా నేటికి దొరక్క
ల్లులు కన్న అవిటివాళ్ళపై జాలిపడి
అంతర్జాతీయ వికలాంగుల సంవత్సరము
పాటించమంటిరి-
ని, ఈ రాజ్యంలో
కిరోసిన్, ఏసిడ్ పోసి
గుడ్డి వాళ్ళనుత్పత్తి చేస్తున్నారు-
వాళ్ళను చేతుల్ని నరికి "పుణ్య" క్షేత్రంలో పడేస్తున్నారు
క్షమించాలి ఈ పాలకుల్ని అందుకు.
వారికి పరలోక చింతన ఎక్కువ
వారి "ఖర్మ" రాతల్ని కమనీయంగా రాస్తున్నారు.
నేటి బాలురే రేపటి పౌరులని
...మైన భవిష్యత్ జ్యోతి కోసం
...జాతీయ బాలల దినోత్సవం చేయమంటిరి.
ని, ఈ రాజ్యంలో
బజారు కుక్కల చేతుల్లో చిక్కిపోయి
తమ దాక పాల డబ్బాలన్న రాక
పసికూనలు కళ్ళు తెరువకనే కళ్ళు మూస్తున్నారు
వెలుగును చూడకుండానే చీకట్లో కలుస్తున్నారు
క్షమించాలి, ఈ పాలకుల్ని అందుకు.
వారికి అన్నం పెట్టిన వాడే సున్నం పెడుతాడనే
నమ్మకం జాస్తి-
ఈ పాలకులు
...త వీరుడు అంబేద్కర్‌ను పూజిస్తూ, పొగుడుతు
...తులపై దండోర మ్రోగిస్తూ ఊచకోత కోస్తున్నారు
...చేసి మీరు "అంతర్జాతీయ దళిత సంవత్సరం
...టించమనకండి
...దేశంలో భగల్పూర్లో, ఆంధ్రప్రదేశ్, గుజరాత్ అంతర్జాతీయ
...నభంగాల సంవత్సరము చేయమనండి
...గోసా యిస్తున్నాం
... పాలకులు మహాఘనంగా పాటిస్తారు
...రొక్కసారి అంతర్జాతీయ కీర్తినార్జిస్తారు
...రొక్కసారి అంతర్జాతీయ కీర్తినార్జిస్తారు.

—సంధిని

## ఈ వ్యాపారం నే చేయలేనమ్మా!

అమ్మా!
నువ్వు నాన్నను కొన్నావట గదా!
ఎందుకు కొన్నావు? ఎంతకు కొన్నావు?
కొనుట అమ్ముట
అమ్ముట కొనుట
చిన్న తనంలో లెక్కల మాస్టారు చెప్పిన లాభనష్టాలు
మదిలో మెదులుతున్నాయి
అందుకే లాభనష్టాల బేరీజు వేసుకొన్నావో లేదో
అనే అనుమానంతో
అంతా నాన్నే చెప్పాడు!
కొనటం జరిగితే మళ్ళీ అమ్మాలి కదా!
అమ్మాలంటే కొనటానికి పెట్టిన పెట్టుబడి రావాలి కదా?
అందుకే నన్ను కన్నారంట!
అదే లాభమంట!!
అంతా నాన్నే చెప్పాడు!
అమ్మా! ఇప్పుడు వచ్చిన లాభాన్ని
మళ్ళీ అమ్ముతారటగదా!
అందుకే అన్నయ్యను మంచి మార్కెట్‌కే అమ్మారట గదా!
వచ్చిన లాభం, వచ్చే లాభం
పైనా అపైనా
ఎంతో ఇంకెంతో
ఈ లెక్కలన్నీ నే చేయలేనమ్మా!
ఇక నాన్న నాకేమీ చెప్పొద్దు
అమ్మా! నీవు పెట్టిన అసలేమిటో
అసలే తీసుకుంటావో వడ్డీయే తీసుకుంటావో
నాకనవసరం
నేమాత్రం ఈ వ్యాపారం చేయలేనమ్మా!
ఒకప్పుడు నీవూ!
అమ్ముడుపోయిన దానివేనట గదా!
"కన్యాశుల్కం" గురించి చెబుతూ
అంతా తెలుగు మాష్టారే చెప్పాడు!
ఇంతకీ నువ్వు ఎవరివి అంటే
"ఆకాశంలో సగభాగమట"!!
అంతా గతమే చెప్పింది!
ఇక వర్తమానంలో
ఈ వ్యాపారం నే చేయలేనమ్మా!

— కె. చిన నరసయ్య

**NALUPU** Fortnightly Regd. as N.P. 45022/89 Regd. H/Sd-173/RNP

వెలువడింది BC త్వరపడండి




## ప్రపంచ చరిత్ర

సమగ్ర చారిత్రక యదార్థం

మూలం: క్రిస్ బ్రెజియర్

అనువాదం: వల్లంపాటి వెంకట సుబ్బయ్య

వెల: 20/-

"కార్యకారణ సంబంధాన్ని నిరూపిస్తూ సంఘటనలను దండ గుచ్చటమే చరిత్ర రచన" అని అంటాడు సుప్రసిద్ధ బ్రిటీష్ చరిత్రకారుడు ఇ.హెచ్. కార్. ఆ కోవలోని రచనే 'ప్రపంచ చరిత్ర'. ప్రాచీన గతానికి సంబంధించి తాను స్వయంగా రాసిన, సేకరించిన కట్టలకొద్దీ కాగితాల ద్వారా, స్కూళ్ళో చదివేటప్పుడు నిర్వహించిన చరిత్ర ప్రాజెక్టుల ద్వారా క్రమ పద్ధతిలో కుదించి చరిత్రను నిండు రూపంలో దర్శించ వీలు కలిగించాడు క్రిస్ బ్రేజియర్.

"ఇతి హాసపు చీకటి కోణం/అట్టుడుగున పడి కన్పించని/ కథలన్ని కావాలిప్పుడు... అనే - చారిత్రక చైతన్యాన్ని ఈ పుస్తకం కలిగిస్తుంది. 'ఖురద-వానరజాతుల'! నుండి పరిణామం చెంది మన పూర్వీకులుగా రూపాంతరం పొందే క్రమంలో ఏర్పడిన చరిత్రను వివరిస్తూ ఆదిమ మానవుడిని వేటగాడనడం కట్టుకథనే అంటాడు బ్రెజియర్. అలాగే నాగరికత పుట్టుక తర్వాత తొలి నాగరికతలో అభివృద్ధిని సాధించినట్లు భావించినా సామ్రాజ్యాలలో సామాన్యుల జీవితం అలాగే ఉందని, నగర వ్యవస్థ సైనిక వ్యవస్థగా రూపొందిన కొద్దీ స్త్రీలపై పెత్తనం, పురుషుల ప్రాధాన్యత పెరిగిన చరిత్రను తెల్పాడు.

'అగ్రరాజ్యాలు- అనాగరికులు' మరో శీర్షికలో ఆయా దండయాత్రలను, వారి ప్రభావాన్ని వివరించి పరమాత్మ జీవాత్మ పునాది మీద మతము ఏర్పడి ఎలా క్రమ క్రమాభివృద్ధి పొందాయో మత యుద్ధాల స్థితికి ఎలా దిగజారాయో కూడా వివరించింది ఈ పుస్తకం. తెరమరుగున ఉన్న ఆఫ్రికా గురించి, బానిస తిరుగుబాట్లు, ఫ్రెంచి విప్లవం, రష్యా విప్లవం, చైనా విప్లవం తదితర అంశాలతో సహా రెండవ ప్రపంచ యుద్ధంలో అనేక ముఖ్యాంశాలను ప్రతిబింబించిన ఈ సమగ్ర ప్రపంచ చరిత్రను అందరూ చదవాల్సిందే.



ప్రతులకు:
**హైదరాబాద్ బుక్ ట్రస్ట్**
ఇం. నెం 1-16-10/సి,
జవహర్ నగర్,
హైదరాబాద్ - 500 020.

Edited by B. Tharakam, and published by Cyril Reddy on behalf of
...abad Book Trust, Printed at Gayatri Enterprises Hyderabad for Hyderabad Printers.



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KLVA102M297 |
| పుస్తకం పేరు | వలుపు |
| తారీఖు | 07 February 2025 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 65 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | no |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | mary |
| పేజీలు విడదీసినది | mary |
| స్కాన్ చేసినది | Priyanka |
| పరీక్ష చేసినది | AMRUTHA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |